క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

## అధిక రుచికరం అధిక సంపూర్ణం




**ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు పాపాయి పెరుగుదలకు మంచిది.**

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తంకోసం అదనంగా ఐరన్ కల్గినది. గట్టి పళ్లు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కల్గినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పతి చెంచాలో అధిక సంపూర్ణ ఘన ఆహారం.

CLARION/B/GX/3/234 Tel



# వార్తా పత్రికల ధరలు ఎందుకు పెరుగుతున్నాయో మీకు తెలుసా?

రోజూ మీరు సుపరిచితమయిన వార్తాపత్రికని చదువుతూ ఉంటారు.

వార్తలు, వ్యాఖ్యలు, వినోదం— అంతా ఒక కప్పు కాఫీకన్నా చవుకగా అందిస్తుంది ప్రతి దినమూ మీ పత్రిక.

మీ వార్తా పత్రిక ద్వారా ప్రపంచమే మీ ముందు ఉంటుంది.

కాని, వార్తా పత్రికల ప్రపంచం కష్టాలలో ఉందని మీకు తెలుసా? ఒక వేళ తెలియక పోతే తెలుసుకోవాలని మా అభిప్రాయం.

## వార్తాపత్రికల మెడలకి ఉచ్చులు

వార్తాపత్రికల ఉనికికే ముప్పుతెచ్చే పన్నులు, సుంకాలని గురించి మీకు తెలుసా?

న్యూస్‌ప్రింట్ మీద 15 శాతం సుంకం ముందు వేశారు. దాన్ని టన్నుకి రు. 825 గా మార్చారు. ఒక వార్తా పత్రిక ఉత్పత్తి ఖర్చులో 50 శాతం న్యూస్‌ప్రింట్‌కే అవుతుంది.

ఇక దిగుమతి అయిన యంత్రపరికరాల మీద, ఇతర వస్తువుల మీద 40 నుంచి 150 శాతం దాకా సుంకం వేశారు.

1983 బడ్జెట్‌లో ప్రకటనల వ్యయం మీద 20 శాతం ఒప్పుకోమన్నారు. అంటే ప్రకటనదారుల ఖర్చు మీద 20 శాతం వ్యయంగా అంగీకరించకుండా దానిని లాభాలలో కలుపుతారన్నమాట. దీనితో ప్రకటనలు తగ్గిపోతున్నాయి. ప్రకటనలు 'దండగ' అనీ 'అవసరం కాదనీ' అనీ ప్రభుత్వం వారి అభిప్రాయం.

ఇదంతా ఎక్కడికి దారి తీస్తోంది?

పత్రికలు తమ అమ్మకం ధరలని పెంచుతాయి. పెంచటం వల్ల అమ్మకాలు తగ్గుతాయి.

అమ్మకాలు తగ్గితే ప్రకటనలు తగ్గుతాయి. అందుచేత మళ్ళీ అమ్మకం ధరలు పెరగాలి.

ఇది నిరంతరంగా జరిగితే చివరికి ఒక వార్తాపత్రిక ధర మరీ అధికం అయిపోయి, కొనే వారికి అది "అందుబాటులో లేదు" అనిపించి నిజంగానే వినియోగదారుకి అందుబాటులో లేకుండా పోతుంది.

ఇంత జరిగితే అది చాలా తక్కువ రాబడి కోసం ప్రభుత్వం అనుసరించే విధానాల ఫలితంగానే జరుగుతుంది.

## సమాచార ప్రసారానికి అవరోధాలు

1980 తరువాత దేశంలో పత్రికల అమ్మకాలు ఎలాగ ఉన్నాయో ఈ కింది అంకెలు తెలుపుతాయి. అవి తగ్గుముఖం పడుతున్నాయని మీకే తెలియగలదు.

| | | |
|---|---|---|
| 1977 | — | 37,427,000 |
| 1978 | — | 40,850,000 |
| 1979 | — | 46,449,000 |
| 1980 | — | 50,921,000 |
| 1981 | — | 51,102,000 |
| 1982 | — | 50,094,000 |

1981 కన్నా 1982 అంకె తక్కువ!

వర్తమాన దేశాలలో 1000 మంది జనానికి కనీసం 100 కాపీల వార్తా పత్రికలు అమ్ముడు పోవాలని ఐ.రా.స. వారు నిర్ణయిస్తే భారతదేశంలో ఈ అంకె 13!

అక్షరజ్ఞానం అందరికీ వుండాలనీ, సమాచారం ధారాళంగా ప్రసారం కావాలనీ ప్రభుత్వం వారు అంగీకరించి ఆ విధానానికి కట్టుబడి ఉంటామంటూనే ఇలాగ చేస్తున్నారు.

## ఆలోచించండి

గిట్టుబాటు కావటానికి ఒక వార్తా పత్రిక ఎన్నిసార్లు ధర పెంచాలి? అలాగ పెంచుతూ ఉంటే అది ఇంకా ఎందరికి అందుబాటులో ఉంటుంది?

ప్రకటనలు "దండగా"? అవి "అవసరమయినవి కావా"?

లేక పోతే వార్తాపత్రికలు సరసమయిన ధరలకి జనానికి అందుబాటులో లేకుండా చేసే విధానాలకే ఆ వర్ణనలు వర్తిస్తాయేమో!

ఈ ప్రశ్నలని గురించి ఆలోచించండి! అవి చాలా ముఖ్యమయిన విషయాలకి సంబంధించినవి.

**మీకు తెలుసుకునే హక్కు వుంది!**
**మాకు తెలిపే హక్కు ఉంది!**
**వార్తాపత్రిక అక్కరకివచ్చే మిత్రుడు అనుకోండి!**

ఇండియన్ ఎండ్ ఈస్టర్న్ న్యూస్ పేపర్ సొసయిటీవారిచేత ప్రకటితము.

## ముఖచిత్రం

నా అభిమాని నటి ముచ్చెర్ల అరుణ (27–4–84) ముఖచిత్రం వేసినందుకు చాలా సంతోషించాను. యింతవరకూ ఎవరూ ముద్రించనంత అందంగా ముద్రించారు. మీకు నా ధన్యవాదాలు. ఇట్లే నా అభిమాన నటుడు శోభన్‌బాబు ముఖచిత్రం వేస్తారని ఆశిస్తున్నాను.

ఎన్. వెంకటేశ్వరరావు, మారేడుబాక.

* * *

మా ప్రియతమ అభిమాని "రెబల్‌స్టార్ కృష్ణంరాజు"ను మంచి స్టిల్‌లో మీ (మా) ఆంధ్ర సచిత్ర వారపత్రిక మీద చూడాలి అని నేనూ, నా యొక్క మిత్రబృందము కోరుచున్నాము.

తామాడా లక్ష్మణరావు, కాశీబుగ్గ.

## వెలుగు–నీడ

"వెలుగు–నీడ" సీరియల్ చదువుతున్నంత సేపు తెరపై సినిమా చూస్తున్న అనుభూతిని పొందేను. కథ వాస్తవానికి అతి దగ్గరగా నడిచింది. సంభాషణలు కూడ బాగా నడిచాయి. చంచల కొడుకు కోసం తపించి పోవడం చదివి కొంతసేపు తెరమీద చూస్తే కళ్ళు చెమ్మగిల్లినట్లు చెమ్మగిల్లాయి.

ఇ. శివకుమార్ ప్రసాద్, చర్ల.

## సినిమా బాలట్ ఫలితాలు

1983 సంవత్సరము సినిమా బాలట్ ఫలితాలు చాల సంతృప్తికరంగా ఉన్నాయి. ఉత్తమ చిత్రం "బహుదూరపు బాటసారి" ఉత్తమ నటుడుగా డాక్టర్ అక్కినేనిగారు ఎన్నికైనందులకు, మాకు చాల ఆనందముగా ఉన్నది. అక్కినేని నాగేశ్వరరావుగారికి మా హృదయపూర్వక అభినందనలు. ఆంధ్ర సచిత్ర వారపత్రికమీద ముఖచిత్రంగా డాక్టర్ అక్కినేనిగారిని చూడాలని చాల కాలముగా కోరుతున్నాము.

పారుపల్లి ఆనందప్రసాద్, విజయనగరము.






## గోరంతదీపం

'గోరంతదీపం' కోట్లమంది ఆంధ్రులకు కొండంత వెలుగునిచ్చింది. వాస్తవాలను వడబోసి, సహజత్వాల సంతరింపజేసిన శ్రీ వింధ్యవాసిని నవల 'గోరంతదీపం' తెరపై చూచిన మంచి సినిమావంటి అనుభూతిని కలిగించినది.

శ్రీమతి వి. విజయలక్ష్మీ రెడ్డి, ప్రొద్దుటూరు.

## అద్భుత వ్యక్తులు

4–5–84 పత్రికలో "అద్భుతవ్యక్తులు" అన్న శీర్షికలో డా॥ రైన్ గురించిన వ్యాసం చాలా విజ్ఞానదాయంగా ఉంది. ఒక వ్యక్తికి టెలిపతీ, క్లియర్ వాయన్స్, సైకో సైనసిస్, ఇ. ఎస్. పి. వంటి అతీంద్రియశక్తులుంటాయని వాటిని క్రమశిక్షణ, దీక్షతో అనుసరిస్తే అన్నీ సంక్రమిస్తాయని ఈ శీర్షిక ద్వారా తెలుసుకున్నాము. సమాజంలో ఏ ఏ వ్యక్తి ఎలాంటి విషయాలలో పరిశీలనలు చేశాడు, వాటి ప్రత్యేకతలు, అన్నీ తెల్సికోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

ఏది ఏమైనా ఆంధ్రసచిత్ర వారపత్రికవారు ఇలాంటి విజ్ఞానవంతమైన శీర్షిక ప్రారంభించినందుకు ఆనందిస్తున్నాను. రచయిత శ్రీ బి. వి. పట్టాభిరాంగార్కి అభినందనలు.

ఇంకా మానవునికి ఎన్ని శక్తులున్నాయి? వాటి ప్రత్యేకత ఏవిటి? అన్న విషయాలగురించీ, ఇంకా ఎంతోమంది మహానుభావుల గురించి తెల్సుకోవాలని ఆరాటపడుతున్నాను.

యన్. నాగేశ్వరరావు, హైదరాబాద్.

## కో చెరగు

మెరుపు కథల రచయిత బి. పి. కరుణాకర్ గారి కలంనుంచి చాలా రోజులకు కొత్త కథ చదివాను. రాధ మనసు చదవాలంటే 'వెంకట్రావును వదిలిపెట్టేయండి' అన్న మాటలే చదవాలి.

సంఘం ఇరుకు సందుల్లోని మురికి మనసుల కుటుంబంలో ప్రాణవాయువుకై అలమటిస్తున్న కొవ్వొత్తి 'రాధ'.

కెప్టెన్ కె.వి.కె. రావు, 56, ఏ.పి.ఓ.

## స్వప్న భంగం

"స్వప్నభంగం" క్రొత్త సీరియల్ కథ మా ఇంట్లో అందరికి నచ్చింది.

కొత్తకోట దేవీప్రసాద్, కురుపాం.

## వైష్ణవీ దేవి

శ్రీమతి అయ్యాగారి వెంకట సత్యవతిగారు వ్రాసిన, "మహాశక్తి స్వరూపిణి మాతా వైష్ణవీదేవి" అన్న వ్యాసం ఫొటోలు మాకు బాగా నచ్చాయి. ఆ వైష్ణవీదేవి దక్షిణ భారత దేశంలో త్రికూట పర్వతంమీద ఉన్నదని విన్నవించారు. కాని అది ఎక్కడ? ఏ ప్రాంతం? అన్నది ఆ వ్యాసకర్త వివరింపలేదు. కాని దానిని పాఠకులకు తెలియజేయగోరుచున్నాము.

ఎ. ఎల్. నిర్మల, ఆగిరిపల్లి.

★ 'శ్రీ మాతా వైష్ణవీదేవి' ఆలయం గల త్రికుట పర్వతం ఉత్తర భారతదేశంలోని జమ్మూ– కాశ్మీర్ రాష్ట్రంలో 'కట్‌రా' వద్ద 'హంసాలీ'అనే గ్రామ ప్రాంతంలో ఉన్నది. –సం॥

## స్వకుల చంద్రిక

స్వకుల సాలి సమాజ బాంధవులలో కూడా వివిధ కళారంగాలలో మేధావులు వున్నా వెలుగులోనికి రాలేదు. వారు మట్టిలో మాణిక్యాల్లాగే యున్నారు. స్వకుల సాలి సమాజ బాంధవులను సర్వేచేసి, స్వకుల మహనీయులను, డాక్టర్లను, డిగ్రీ హోల్డర్లను, పోస్ట్ గ్రాడ్యుయేట్లను, ఉద్యోగస్థులను, వ్యాపారవేత్తలను పుస్తక సంకలనాభి ముఖంగానైనా సమాజ బాంధవులకు పరిచయం చేద్దామనెడి వుద్దేశ్యంతో నేను 'స్వకుల చంద్రిక' అనెడి పుస్తక సంకలనాన్ని — రూపొందించవలెనని యున్నాను.

వివిధ ప్రాంతాలలో నివసించే ఉద్యోగస్థులు, వ్యాపార వేత్తలు (స్వకుల సాలి సమాజ బాంధవులు) తమ తమ పరిచయాన్ని చిరునామాలను నాకు తెలపాలని మనవి చేస్తున్నాను. రిప్లై కార్డుకూడా పంపాలని విజ్ఞప్తి.

— జయసుమన్,
(ఇ. జె. నరేష్‌కుమార్), ఫ్రీలాన్స్ జర్నలిస్ట్,
చౌడమ్మ గుడి దగ్గర,
రాయదుర్గం–515 865, అనంతపురం జిల్లా.

**త్వరలో ప్రారంభం!**

**కొత్త సీరియల్ నవల**

**జీవన సరళిలో తీయని రవళి**

రచన:

**శ్రీమతి జి. హేమంత**

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 25–5–'84

శ్రీ రక్తాక్షినామ సం. వైశాఖ బ. దశమి

**సంపుటము 76 : సంచిక 37**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్టులో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

మిస్ ఆంధ్రప్రదేశ్ (1984)గా
ఎన్నికైన కె. వనజకుమారి
(ఫొటో : ఎస్.జి.కె. మూర్తి, ఎస్.బి.ఐ.)



**★ లోకం పోకడ ✳ ఊమెన్ ★**



# భా. జ. పా. కుట్రలు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఈ భారతీయ జనతా పార్టీ వాళ్ల టక్కరుతనం ఇంతా అంతా కాదని నాకు తెలుసు. ఈ మధ్యనేకదా వాళ్ళు మధ్యాహ్నం ఎండలో రాష్ట్రపతి భవన్‌కి నడిచివెళ్ళి శ్రీమతి గాంధీని తీసెయ్యాలని రాష్ట్రపతిని కోరారు వీళ్ళు? పాపం జ్ఞానీ జెయిల్‌సింగ్‌ని రాష్ట్రపతి చేసిన వారు శ్రీమతి గాంధీ కాని ఆమెని ప్రధాన మంత్రి చేసిన వారు ఆయన కాదు అన్న సంగతి భా. జ. పా. వాళ్లకి తెలుసా ? – ఈ జర్నలిస్టులూ పని చేసి చేసి బుర్ర వేడెక్కి పోయి తప్పులు రాస్తారని కూడా నాకు తెలుసు. అయినా సరే, అసలేమి జరిగిందో తెలుసుకుందామని రావ్‌రావు ఆదిక్‌ని కలుసుకోవటానికి ప్రయత్నాలు మొదలుపెట్టాను. చివరికి ఆయనని కలుసుకున్నాను. ఆయన చెప్పినది ఇదీ :

"నేను విమానంలో వి. ఐ. పి. సీటు అంటారే, దానిని అడగలేదు. కాని, నాకు ఎయిర్ ఇండియా వాళ్ళు ఆ సీటునే ఇచ్చారు అప్పుడే అనుకున్నాను ఏదో కుట్ర పన్నుతున్నారని. నేను ఎవరిని ? వసంతరావు పాటిల్ మంత్రివర్గంలో మంత్రిని అంతేకదా ? ఎకానమీ తరగతిలో ఒక మూల సీటు ఇవ్వండి, చాలు–అన్నాను. వాళ్ళు వింటారా ? వినరు ! మీకు మొదటి తరగతి ఇవ్వాలంటూ నన్ను జగదీష్ ప్రసాద్ మాథుర్ అనే పార్లమెంటు సభ్యుడు లేదా భా. జ. పా. పార్లమెంటు సభ్యుడిలాగే ఉన్న ఆయన పక్కన కూర్చోపెట్టారు. నేను ఇదంతా ఏమీ పట్టించుకోలేదు కాని కొంతసేపటి తర్వాత విమానం కాప్టెన్ ఒక సీసా చేత్తో పట్టుకునివచ్చి నా పక్కన కూర్చున్నాడు. కూర్చున్నవాడు ఊరుకోకుండా నాకు బూతు కథలు చెప్పటం ప్రారంభించాడు. అసలు విమానం కాప్టెన్‌లు విమానంలో తాగవచ్చునా ? ఏమో ఈ భా. జ. పా. కాప్టెన్‌ల సంగతే వేరు. కొంతసేపు ఊరుకుని ఇక ఉండబట్టలేక నేను ఎయిర్ హోస్టెస్‌ని పిలిచాను. ఆవిడ అంత చిన్నావిడ కాదు. ఆమెకి జరమలోనీ పోలికలు ఉన్నాయి కూడా. ఆవిడతో అన్నాను : ఈయన నన్ను చంపుకు తింటున్నాడు, ఆయనని ఇక్కడినుండి తీసుకుపొండి – అని. ఆ అమ్మాయి నన్ను చూసి కన్నుకొట్టింది – ఈ భా. జ. పా. ఎయిర్ హోస్టెస్‌లు మరీ బరితెగించినవాళ్లనుకోండి ! దానితో నేను ఆమెని పట్టుకోబోయాను. "నీ మానాన్న నువ్వుండకుండా ఏమిటీ గొడవా ?" అని కోప్పడింది ఆవిడ. నేను రాజకీయవాదిని కదా ? విమానంలో రాజకీయాలకి ఏమి అవకాశం ఉంటుంది ?

ఫ్రాంక్‌ఫర్ట్ చేరుకున్నాము. నేను దిగినప్పుడు తాగివున్న విమానం కాప్టన్‌ని నావెంట తీసుకుపోయాను. (విమానం నేలమీద వాలటానికి నేనే ఆయనకి సాయపడ్డాను లెండి.) ఫ్రాంక్‌ఫర్ట్ విమానాశ్రయంలో ఒకచోట నుంచి మరొక చోటుకి చాలాదూరమే ఉంటుంది. ఒక తాగిన కాప్టెన్‌తో ఈదూరాలు నడవడమంటే మాటలా ? ఎలాగో అలాగ "కస్టమ్స్" కనుక్కొన్నాము. "మీ దగ్గిర ఏముంది ?" అని అడిగాడు అక్కడ అధికారి. ఏమీలేదన్నట్లు తల అడ్డంగా ఆడించాను. అధికారి నమ్మలేదు. నా సంచీ వెతికాడు. అందులో 8 సీసాలు దొరికాయి. అక్కడికి అవి ఎలాగ వచ్చాయి ? ఏమో, నాకు తెలియదు. సరే, అధికారి నన్ను పోలీసులకి అప్పచెబుతానన్నాడు.

పోలీసుస్టేషనులో ఒక అమ్మాయి ఉంది. ఆమె సంస్కృతంలో మాట్లాడింది. అంటే భా. జ. పా. గూఢచారి అనేకదా అర్థం ? లేకపోతే పోలీసుస్టేషనులో సంస్కృతమా ! "2 + 2 ఎంత ?" అని అడిగింది. అర్థంలేని ప్రశ్న ! కాంగ్రెసు వాళ్ళకి కూడటం రాదు, గుణించటం మాత్రమే వచ్చు ! పోనీలే, అని వదిలేశాను. కాని రాత్రికి ఒకగది అవసరం అన్నాను. నేను దురుద్దేశంతో అడగకపోయినా సరే ఈ ప్రశ్న ఆమెకి కోపం తెప్పించింది. భా. జ. పా. వాళ్ళతో వచ్చిన చిక్కు ఇదే. పార్లమెంటులో కూడా ప్రతి ప్రశ్ననీ అపార్థం చేసుకుంటారు ! అసలు నేను చేసిన నేరం ఏమిటి ? నా సంచీలో 8 సీసాలు దొరికాయి, టాక్సీ డ్రయివరు డబ్బు అడుగుతున్నాడు. ఈవిడేమో 2+2 ఎంత అని అడుగుతుంది ! [తర్వాత తెలుసుకున్నాను. ఈ లెక్కని తాగినవాళ్లకి వేస్తూ ఉంటారు. అని, వాళ్ల నిషా ఎంత ఉందో తెలుసుకోవటానికి అన్నమాట.] నేను ఒక్క చుక్క వేసుకోలేదే !

హోటల్‌లో నన్నొక గదిలో, కాప్టెన్‌ని ఇంకొక గదిలో పెట్టారు. పొద్దునే ఆయన గదిలోనుంచి శబ్దాలు వినపడ్డాయి. ఏమిటా, అని అక్కడికి పరిగెత్తాను. అందులో మహమ్మద్ యూనస్‌లాంటి మనిషి ఉన్నాడు ! ఆయనకి ఈ ఊళ్లో ఏమిటి పని ? ఇదంతా భా.జ.పా. కుట్ర కాకపోతే ఇంకేమిటి ? గదిలో ఒక మూలగా హోటలులో పనిచేసే అమ్మాయి నుంచుని ఉంది. "యూనస్" ఆవిడమీద కేకలు వేస్తున్నాడు.

"యూనస్"అన్నాను మర్యాదగా, "ఇదేమిటి ఢిల్లీ అనుకున్నావా ? హోటళ్లలో అమ్మాయిల మీద కేకలు వెయ్యటానికి ?"

పాపం ఆ అమ్మాయి దగ్గిరికి వెళ్లి ఏమయినా సహాయం కావాలా, అని అడిగాను. ఆడపిల్ల ఏడుస్తూ నుంచుంటే ఆ మాత్రం అడగకపోతే ఎలాగ ?

హటాత్తుగా గదిలోకి పోలీసువాళ్ళు వచ్చారు వచ్చి నన్ను పట్టుకుని "ఇంకొకళ్ల గదిలో నీకేమిటి పని ?" అని అడిగారు. ఆ అమ్మాయి ఏడుపు అధికం అయింది. యూనస్ మొహంమీద చిరునవ్వు వెలిసింది.

నా పాస్‌పోర్టు చూపించాను. నాకు దౌత్యవర్గపు పాస్‌పోర్టు ఉంది. అంటే నన్ను అరెస్టు చెయ్యటానికి ప్రత్యేకంగా తతంగం ఉంటుంది. లాభంలేదు. మళ్లీ పోలీసు స్టేషను, అక్కడ సంస్కృతం మాట్లాడే అమ్మాయి తయారు !

ఇంతలో కెప్టెన్ మాయమయ్యాడు. అతన్ని మళ్లీ చూడటానికి నేను హానోవర్ ఎక్సిబిషన్‌కి వెళ్లవలసి వచ్చింది. అతనూ, యూనస్సూ, ఎయిర్ ఇండియా హోస్టెస్సూ ఒకచోట కూర్చుని అంతూలే కేసు గురించి మాట్లాడుకుంటున్నారు.

అప్పుడే ఒక వ్యక్తి అక్కడికి వచ్చి తన పేరు మాలిక్ అనీ, తాను లండన్‌లో జర్నలిస్టుగా పనిచేస్తున్నాననీ చెప్పాడు. నేను నమ్మలేదు. అతనూ భా. జ. పా. మనిషిలాగే కనిపించాడు.

"రండి ! నాతో బార్ దగ్గిరికి రండి !" అని పిలిచాడు.

"బార్ దగ్గిరికా ! నేనెవరినో తెలుసా మీకు ? నేను గాంధీ (అదే ఇందిరా గాంధీ). అనుచరుడిని. ఖద్దరు ధరిస్తాను, రాట్నం వడుకుతాను. చస్తే తాగను ! అలాంటి నన్ను బార్‌కి రమ్మని పిలుస్తారా ? భారతదేశంలో ఎందరు అన్నంలేక మాడుతున్నారో తెలుసా మీకు ? మీ జర్నలిస్టులకి ఇదేం రోగం పట్టుకుంది ?" అని కోప్పడ్డాను. "నేను ఎవరినో తెలుసా ? ఒక డిప్యూటీ ముఖ్యమంత్రిని !"

[66 వ పేజీ చూడండి]

# భలే బేరం!

ఒక అందమైన
స్టీలు గ్లాసు
కేవలం
రూ.2-25లకు









సూపర్ పవర్

## రీగల్



మురికిని నిర్మూలిస్తుంది
బట్టలను కాపాడుతుంది




షా వాలెస్ వారి విశిష్ట ఉత్పాదన

సూపర్ పవర్ రీగల్ బహుమతి లేకుండాను లభించును

# వ్యక్తిగతం



1982 లో అఖిల భారత అన్నా డి.ఎం.కె. పార్టీలో చేరి, 1983 లో ఆ పార్టీ ప్రభుత్వంలో ప్రచార కార్యదర్శిగా నియమితురాలై తిరుచందూరు ఉప ఎన్నికలో తమ పార్టీ అభ్యర్థి విజయానికి కారకురాలైన కుమారి జయలలిత (35) 1984 లో రాజ్యసభకి ఎన్నికైనారు. రాజ్యసభ సభ్యురాలిగా ఎన్నికైన తొలి సినీనటి ఈమే. (గతంలో నర్గీస్‌దత్ నామినేట్ చెయ్యబడ్డారు.) తమిళనాడు రాజకీయాలలో రెండవ స్థానాన్ని అలంకరించిన ఈమె రాజ్యసభలో ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. పార్టీ ఉపనాయకురాలిగా కూడా ఎన్నికైనారు. తమిళనాడు ముఖ్యమంత్రి పదవిని ఎం.జి.ఆర్. తర్వాత ఈమె చేపట్టగలరని ఎంతోమంది అనుకుంటున్నారు...



డల్లాస్‌లో జరిగిన ప్రపంచ టెన్నిస్ ఛాంపియన్ షిప్ (ఫైనల్స్)పోటీలో జాన్ మెకెన్రో అత్యద్భుతంగా ఆడి 99నిమిషాల్లో తన ప్రత్యర్థి జిమ్మీ కానర్స్‌పై ఘన విజయాన్ని సాధించాడు. ఈ బహుమతి విలువ 150 వేల డాలర్లు. తన జీవితంలో ఇంత అద్భుతంగా ఎప్పుడూ ఆడలేదని జాన్ మెకెన్రో అన్నాడు...



హాలీఉడ్ నటి షెర్లీ మెక్‌లీన్‌కి ఆస్కార్ అవార్డు లభించింది. ఆమెకి ఈ అవార్డు రావటానికి దోహదం చేసిన ''టెర్మ్స్ ఆఫ్ ఎన్‌డియర్‌మెంట్'' చిత్రానికి మరోనాలుగుఆస్కార్‌లు వచ్చాయి. 1958 లోనే ''సమ్ కమ్ రన్నింగ్'' అనే చిత్రంలో ఈమె నటనకి ఆస్కార్ యివ్వాలని సిఫార్సు చేస్తూ అయిదు నామినేషన్‌లు వచ్చాయి. కానీ అవార్డు మాత్రం రాలేదు. 26 సంవత్సరాల తర్వాత యిప్పుడు ఆమె స్వర్ణోత్సవ (50) సంవత్సర పుట్టినరోజు బహుమతిగా ఈ ఆస్కార్ లభించింది...




25–5–1984 శుక్రవారం మొదలు 31–5–1984 గురువారం వరకు

♈ మేషం: చాల కాలం క్రితం వదలిన ఒకానొక విషయం ఈవారం పూర్తి చేయగలిగినామని సంతోషిస్తారు. ఆదాయమున్నది. అధికారుల మూలంగా మేలున్నది. అప్పులుంటే వసూలు కాగలవు. శ్రమించండి. స్త్రీలకు: గృహానందం, వస్తు సేకరణకు అవకాశం ఉన్నది.

♉ వృషభం: మీతో మాట మాట పట్టింపుతో దూరంగా పోయిన బంధుమిత్రులు దాపునకురాగలుగుట కూడా విశేషమే. ఒకానొక మిత్రుని మూలంగా గృహవసతియో, భూవసతియో సమకూరే అవకాశమున్నది. స్త్రీలకు: నూతనోత్సాహం, ఉద్యోగంలో ఏదో అనుకూలం సంభవం.

♊ మిథునం: పదిమందిలో పేరుప్రతిష్ఠలు తెచ్చుకొంటారు స్వగ్రామానికో, పట్టణానికో పోగల అవకాశాలున్నాయి. వ్యవహారజ్ఞానం వలన ఏదో మేలు మీకు చేకూరగల అవకాశాలున్నాయి, గ్రహించండి. యత్నకార్యానుకూలం, వృత్తియందు పెంపు ఏర్పడగలవారం.

♋ కర్కాటకం: దూరప్రాంతాల నుండి మిత్రులో, బంధువులో యింటికి రానున్నారు. ప్రజా సమూహంలో కొందరకు పేరు ప్రతిష్ఠలు అతిశయింపగలవు. నూతనాంశాలు గ్రహించే అవకాశము గలవారం. స్త్రీలకు: శ్రద్ధాసక్తులతో అనేక వ్యవహారాలు గృహసంబంధమైనవి, శుభసంబంధమైనవి సర్దుబాటు చేసికోగలుగుతారు.

♌ సింహం: బంధువుల మూలంగా యిబ్బందులకు గురికాగలరు. అయివోజు అధికం కాగలదు. వస్తుసేకరణకు, నూతనాంశాలు గ్రహించుటకు అనుకూలమైన వారం. కొందరకు సభాకార్యక్రమానుకూల్యత సిద్ధించగలదు వ్యవహారం ఏదైనా పరిష్కరింపబడాలంటే అనుకూల వారం. స్త్రీలకు: ఉద్యోగంలో రాదగిన 'ప్రమోషన్' లభ్యంకాగలవారం.

♍ కన్య: అకారణవైరం ఏదో సంభవం కానున్నది. గమనించదగిన ముఖ్యాంశం. వ్యవహారం ఏదైనా పరిష్కరింపబడవలసి ఉంటేఅనుకూలమే. సుఖశాంతులకు, కుటుంబానందానికి లోపం లేదు. స్త్రీలకు:ఆదాయమందు అభివృద్ధి చెప్పదగియున్నది. ఉద్యోగ యత్నాలు సానుకూలం కావటం గమనించగలుగుతారు. వారం ఆనందదాయకమే.

♎ తుల: కుటుంబసభ్యులకు గాని, మీకుగాని ఆరోగ్యలోపం ఏర్పడవచ్చు. వృత్తి ఉద్యోగాలందు అభివృద్ధి చెప్పదగినవారం. గృహ విస్తరణ కార్యక్రమమందు శ్రద్ధవహించుట చెప్పదగిన అంశం. స్త్రీలకు: విలువైన వస్తువులు సేకరించుకొనుటకు, అవకాశమున్నది.

♏ వృశ్చికం: పదిమందిలో పేరు ప్రతిష్ఠలు ఆర్జించుకొనుటకు అవకాశమున్నది. ధన లోపం ఏమాత్రం కనిపించదు. బంధువర్గీయుల మూలానమే లేదో జరుగనున్నది. చాలమందికి క్రయవిక్రయములందు అనుకూలత చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు: సక్రమంగా జరుగవలసిన పనులలో జాప్యం చెప్పదగిన అంశం. ఋణదాతల వత్తిడికి అవకాశం గలవారం.

♐ ధనుస్సు: దూరప్రాంతాలకు పోవాలనే మీ వాంఛ సఫలమవుతుంది. నూతనాంశాలు గ్రహించే అవకాశమున్నది. కొందరకు సభారంగాన గౌరవం సంభవం. స్త్రీలకు: ఉత్తముల మూలాన గాని, అధికారుల మూలాన గాని, ధనవంతుల మూలాన గాని మేలు సంభవించే అవకాశం గల వారం.

♑ మకరం: శుభ కార్యాలోచనలు సఫలం కాగలవు. కుటుంబానందం యినుమడింపగలదు. స్త్రీల వలన మేలు జరుగుటకు ఆస్కారం గలదు. సభా సత్కారం కొందరకు చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు: ముఖ్య బందువుల రాక గాని, ప్రజా రంగంలో పేరు పెంపునందుట గాని ఈవారంలో చెప్పదగిన అంశం.

♒ కుంభం: విద్యా వైజ్ఞానికంగా మీకు సదవకాశాలు లభ్యం కాగలవు. వృత్తి రీత్యా మీకు మేలు చేకూరుట నిశ్చయం. వ్యాపారం చేసేలాగైతే అధిక లాభార్జనకు అవకాశం గల వారం. ప్రయాణాలు సాధ్యమైనంతలో తగ్గించుకొనుట ఈవారం శ్రేయోదాయకం.

♓ మీనం: అధికారుల వలన గాని, రాజకీయవాదుల వలన గాని ధనాఢ్యుల వలన గాని జరుగదగిన పనులుంటే ఈవారంలో సుకరంగా నెరవేరగలవు. మాటకు విలువ పెరగటం కూడ గమనించగలుగుతారు. స్త్రీలకు: బంధువులతో ఘర్షణ, తలకు మించిన పనులు, కుటుంబ బాధ్యతలతో సతమతం కావటం గమనించగలుగుతారు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



# తాజమహల్ సౌందర్యం మాటున...

అమర ప్రేమ మహల్ షాజహాన్ ముంతాజ్ మహల్ అని ఎంతగానో పేరు పడ్డది. ప్రపంచంలోని సౌందర్య సౌధాలలో గణించతగ్గ ప్రాశస్త్యంతో భరతభూమికి మకుటాయమానంగా ఉన్న తాజ్‌మహల్ మొగలాయి ప్రభువుల ప్రేమకు, కళాతృష్ణకు, వాస్తు ప్రతిభకు, శిల్ప విశిష్టతకు తార్కాణంగా నిలుస్తుంది. అయితే తాజ్‌మహల్ సౌందర్యం మాటున ఆశ్చర్యం గొలిపే చరిత్రాత్మకమైన నేపథ్యముందని తెలిసినప్పుడు ముస్లిముల చిత్తశుద్ధినే శంకించవలసి వస్తుంది. వాస్తవాలు ఎప్పటికైనా బయటపడి తీరుతాయనే మాట అక్షరసత్యమేమోననిపిస్తుంది.

ముంతాజ్ బేగంపైన ఉన్న అపారమైన అనురాగ వాత్సల్యాలే షాజహాన్‌ని తాజ్‌మహల్ కట్టించడానికి ప్రేరణ కల్పించాయని అనుకోవడం జరుగుతున్నది. రాణులకు రాణి అయిన ముంతాజ్ సమాధే తాజ్‌మహల్ అన్నప్పుడు షాజహాన్ ప్రేమ ఎంతో అమరమైనదని, అపురూపమైనదని కూడా అనుకోవలసివస్తుంది. తాజ్‌మహల్ లాంటి కట్టడాన్ని మళ్లీ ఎక్కడా కట్టకుండా ఉండడానికి తాజ్‌మహల్ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించిన ముఖ్యమైన వాస్తు శిల్పి చేతివ్రేళ్లను షాజహాన్ ఖండించివేయించాడని ఒక కథ (కట్టుకథే కావచ్చు!) ప్రచారంలో ఉంది. ఇది భార్యమీద ఆయనకుండే మమత వల్లేనని కొందరు వ్యాఖ్యానించడం కూడ కద్దు. చేతి వ్రేళ్లను పోగొట్టుకొనే ముందు ఆ శిల్పి తాజ్‌మహల్ లోపలికెళ్లి వచ్చాడని, ఏంచేసాడో ఏమో తెలియదుకాని, ప్రధాన గర్భస్థలిలో ఒక ప్రాంతం నుంచి నీటిబొట్లు రావడం ప్రారంభమైందని, ఇప్పటికీ పరిస్థితి అలాగే ఉందని, వాస్తవ పరిస్థితికి తగిన కారణాన్ని ఈనాటికీ ఎవరూ కనుగొనలేకపోతున్నారని మరో కల్పన. తాజ్‌మహల్ సౌందర్యం కన్నా ముందు ఆ మహల్‌కు రాళ్లెత్తిన కూలీల శ్రమ సౌందర్యాన్ని చూడడం నేర్చుకోవాలని కీర్తిశేషులు శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) అంటూ ఉండేవారట. ఇటీవల పురావస్తుకాల నిర్ణయశాస్త్రం బాగా అభివృద్ధిచెందిన కారణంగా తాజ్‌మహల్‌కు సంబంధించిన ఎన్నో రహస్యాలు బయటపడ్డాయి. ఆర్కియోమెట్రీ సాయంవల్లే స్పెయిన్‌లో ఉన్న కార్డోబా మసీదు అసలు మసీదే కాదని, అది కాథోలిక్ చర్చని తెలిసింది. అలాగే తాజ్‌మహల్ కూడ మసీదుకాదని, అది భారతీయ కట్టడమే అని, అసలు షాజహాన్ దాన్ని కట్టించనే లేదని—కొన్ని వింత యదార్థాలు బయటపడుతున్నాయి.

ఆర్కియో మెట్రీలో సి—14 పద్ధతి, థర్మోల్యూమినెన్స్ పద్ధతి అంటూ రెండు రకాలున్నాయి. ఈ పద్ధతులుపయోగించి ఏ కట్టడాన్నైనా పరిశీలించి అదే కాలంనాటిదో మూడు శాతం అటూ ఇటుగా ఖచ్చితంగా చెప్పవచ్చునని శాస్త్రజ్ఞానాన్ని, శిల్ప పరిజ్ఞానాన్ని కలబోసి పరీక్షించడంలో ఘనాపాటి అనిపించుకొన్న న్యూయార్క్ యూనివర్సిటీ ప్రొఫెసర్ డేవిడ్ కింగ్ చెబుతారు. ఈయన ఎన్నో ముస్లిమ్ కట్టడాలను పరిశీలించి అవన్నీ ముస్లిమ్ మూల సూత్రాలకు వ్యతిరేకంగా ఉన్నట్లు పేర్కొనడం గమనార్హం. ఆర్కియోమెట్రీవల్ల ఒక కట్టడం మీద కొన్ని సంవత్సరాల తరువాత మలామాచేసి ఉన్నా కనుక్కోవచ్చునని అమెరికాకు చెందిన బ్రూక్లిన్ పట్టణంలో ఉన్న ప్రముఖ శిల్పశాస్త్ర పరిజ్ఞాని డాక్టర్ ఇవాన్స్ విలియమ్స్ అంటున్నారు.

ఆర్కియోమెట్రీ విజ్ఞానం వల్ల తాజ్‌మహల్ ముస్లిమ్ కట్టడమై ఉండడానికి వీలు లేదని స్పష్టంగా తెలుస్తోంది. ముస్లిమ్‌ల పవిత్ర మతగ్రంథం ఖురాన్‌లో ఓ నిబంధన ఉంది. మహమ్మదీయులంతా ప్రార్థనా సమయంలో మక్కా వైపుకు తిరిగి ఉండాలి అని. సూర్యచంద్రుల గమనం, నక్షత్రస్థితుల నైజం, కాలచక్రంలో కలిగే మార్పులు—ఇత్యాది వాటిని అనుసరించి, గణిత శాస్త్ర

ప్రాభవాన్ని ఉపయోగించుకొని మక్కా ప్రపంచంలోని ఏ ప్రాంతం నుంచైనా ఎక్కడ వున్నది, ఏ దిశలో వున్నది—వగైరా విషయాలను తొమ్మిదవ శతాబ్దం కన్నా ముందే ముస్లిమ్‌లు తెలుసుకోగలిగే స్థాయిని అందుకొని ఉన్నారన్న మాట చరిత్ర సత్యం. ఆ దృష్ట్యా ఆలోచిస్తే మసీదుగా చెప్పబడుతున్న తాజ్‌మహల్ పశ్చిమం వైపుకు తిరిగి ఉండగా, ఆగ్రాకు మక్కా 14 డిగ్రీల ఈశాన్యంలో ఉంది. పైగా హిందూ ఆలయ శిల్పశాస్త్రాలకు అనుగుణ్యంగా భారతీయ దిక్శాస్త్రానికి సరితూగేలా తాజ్ మహల్ కట్టబడి ఉంది. అటువంటప్పుడు తాజ్‌మహల్ మొగలుల కట్టడమెలా అవుతుందో అర్థంకాదు.

షాజహాన్ చరిత్రకు అద్దంపట్టే "బాద్ షానామా"లో ఆకాశాన్నంటే భవనాన్ని రాజా జైసింగ్ నుంచి షాజహాన్ కొన్నివేల ఎకరాల ప్రభుత్వ భూమిని ఫణంగా ఇచ్చి స్వీకరించినట్లు, ఆ భవనంలో మహారాణి అయిన ముంతాజ్‌ను ఖననం చేసినట్లు ఉంది. అయితే షాజహాన్ భవనంతోపాటు స్థలంకూడ తీసుకొని ఇరవై ఏళ్ల శ్రమతో అద్భుతమైన తాజ్‌మహల్‌ను సృష్టించాడని కొందరు అభిప్రాయపడతారు. ఈ అభిప్రాయానికి సరియైన సాక్ష్యాధారాలు లేవనే చెప్పవలసి ఉంది. శాస్త్రజ్ఞానం ఆధారంతో ఆర్కియో మెట్రీ విద్యవల్ల తాజ్ మహల్ కట్టినకాలం క్రీ. శ. 1279 నుంచి

## తాజ్‌మహల్ సౌందర్యం

1439 వరకు ఉండే అవకాశం ఉంది. కాని నేటి చరిత్ర చెబుతున్నదాని ప్రకారం తాజ్ మహల్ క్రీ. శ. 1638 – 1670 మధ్య కాలంలో కట్టబడినది. అంచనాలోని వ్యత్యాసం 200 సంవత్సరాల నుంచి 360 సంవత్సరాల వరకు ఉంది. శాస్త్రజ్ఞానంపై నమ్మకమున్న వారెవరూ తాజ్‌మహల్ 17వ శతాబ్దంలో కట్టబడిందంటే విశ్వసించలేరు. కాబట్టి డాక్టర్ ఇవాన్స్ విలియమ్స్ పరీక్షలవల్ల తాజ్‌మహల్ షాజహాన్ మాత్రం కట్టించలేదని స్పష్టంగా తెలుస్తుంది. అదే నిజమైనప్పుడు అబద్ధపు ప్రచారమెందుకని ఎవరైనా అడిగితే, ఇటీవల మన వారే కాలనాళిక పేరిట చరిత్రను ఎందుకు భూస్థాపితం చేసారని ప్రశ్నించడంలో అనౌచిత్యమేమీ లేదని అనుకోవడం తప్పు కాబోదు.

తాజ్‌మహల్ శిల్పశాస్త్ర ప్రావీణ్యానికి ప్రతీక అని అనడంలో దోషం లేదు. దాన్ని కట్టినవారు తప్పకుండా గొప్ప మేధావులై ఉండాలి. ముస్లిమ్ అయినా, క్రిస్టియన్ అయినా పార్శీ అయినా, హిందూ అయినా వారిని గౌరవించవలసిందే. ఒకవేళ హిందువే అయి ఉంటే గౌరవంతోపాటు మన శక్తిమీద మనకు ఎంతో నమ్మకము, అంతకు మించిన గురి ఏర్పడుతాయి. మనవారి నైపుణ్యానికి మసిపూసి, ఎవరో పరాయివారు ఆ నైపుణ్యమంతా వారిదే అయినట్లు ప్రకటించుకోవడం భరించలేనంత కష్టం. ఈ తప్పిదం ఎవరు చేసినా శిక్షార్హులే! అయినా అబద్ధానికి ఎంత రంగులు పూసినా ఏదో ఒకనాటికి వెలిసిపోక తప్పదు.

తాజ్‌మహల్‌కు నాలుగు వేపులా స్తంభాలున్నాయి. మసీదుకు స్తంభాలుంటాయా? తాజ్‌మహల్ కోటలాంటి కట్టడం. కందకం కూడ ఉంది. ముంతాజ్ సమాధే అయితే కందకం ఎందుకు? తాజ్‌లో వందల గదులున్నాయి. అవన్నీ అతిథి గృహాలు! మసీదుల్లో ఇట్లాంటివి కనిపిస్తాయా? యమునకు దగ్గరగా కొంచెం దిగువలో ఉన్న గదులను పూర్తిగా మూసివేసారు. కనిపించకుండా ఇటుక గోడలు కూడ కట్టివేసారు. ఆ లోపలే హిందూ దేవత సంబంధమైన సామగ్రి ఉందని ఎందరో అనుమానిస్తారు. ఇలాంటి అనుమానాలను నివృత్తి చేయడానికి పురావస్తుశాఖ ఎందుకు ముందుకు రాదో అర్థంకాదు. రాకపోగా కాలుష్యం వల్ల తాజ్‌మహల్ అందం చెడనున్నదని లేనిపోని సరిక్రొత్త సందేహాలను సృష్టించడం ఎందుకనేది అసలే అర్థం కాదు.

జగజ్జేగీయమానమైన తాజ్ మహల్ సౌందర్యం మాటున జగద్విదితంకాని రహస్య నేపథ్యమేదో ఉందని, దాన్ని ఛేదించవలసిన అవసరముందని అందరూ గ్రహించగలగాలి! ★

**— డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు**

# బానిస

## భమిడిపాటి భాస్కరరామారావు



చుక్క గొల్లుమంది. వీరిగాడు మూసిన కన్ను తెరవడంలేదు. వాడు ఆమె కండలో కండ. రక్తంలో రక్తం. వాడి ఒంటిని ఎర్రటి నెత్తురు చారలు. అప్పుడే కొన్ని చారికలు నల్లటి పెచ్చులు కట్టాయి. బాధగా ఒగరుస్తున్నాడు వీరిగాడు. వాడి ఒంటిమీద చేయివేసి చూచింది చుక్క. పెనంలా కాలిపోతోంది వళ్ళు.

గుడిసెలో బుడ్డి దీపం మందంగా వెలుగుతోంది. ఒకమూలగా పొయ్యిమీది ఎసరు మరుగుతోంది. పొయ్యిలో పుల్లలు బయటవే మండుతున్నాయి. పుల్లలు ఎగదొయ్యాలనిగాని, రాగి పిండో, బియ్యపు నూకలో ఎసట్లో పొయ్యాలని గాని తోచడంలేదు చుక్కకి. ఆమె మనసునిండా పదేళ్ళ వీరిగాడే నిండిఉన్నాడు.

వీరిగాడిని తనివితీరా గుండెలకు హత్తుకోవాలని మనసు తీరా కౌగలించుకోవాలని తల్లిమనసు ఉబలాటపడింది. కాని ఆమెకు ఆ అవకాశం యివ్వడంలేదు వీరిగాడు. ముట్టుకునేసరికే బాధతో విల విలలాడిపోతున్నాడు. వాడి శరీరస్థితి అంత దారుణంగా ఉంది.

చుక్క కళ్ళు నీటితో నిండిపోయాయి. నీటిపొర తెగి మలినమైన ఆమె బుగ్గలమీదనుండి జారి వీరిగాడిమీద పడింది ఎర్రటి గాయంమీద ఉప్పటి కన్నీటి బొట్లు. వీరిగాడిలో కదలిక వచ్చింది. తల అటూ యిటూ ఊగించాడు.

చుక్క ముఖంలో చెప్పలేనంత ఆనందం తాండవించింది. దానితో రవ్వంత ఉత్సాహం కలిగింది. ఆ ఉత్సాహం చిన్న కెరటంలా ఆమె చేతుల్లోకి ప్రవహించింది. వీరిగాడి బుగ్గలు నిమరడానికి చేతులు ముందుకు చాపింది.

వీరిగాడు పెదిమలు కదిపాడు "...ద... ద...దా...గం... మంచినీళ్లియ్యే." అస్పష్టంగా వినిపించింది చుక్కకి.

చటుక్కున కుండ వద్దకు పరుగెత్తింది చుక్క. మకిలిపట్టి సొట్టలు పడిఉన్న సిల్వర్ గ్లాసుతో నీళ్లందుకుంది. వీరిగాడి పెదిమలు

మునివేళ్లతో విడదీసి కొద్ది కొద్దిగా నీరు ఒంపింది. వీరిగాడు మెల్లమెల్లగా రెండుమూడు గుక్కలు నీరు త్రాగాడు.

"ఏటయిందిరా ? ... ఈరీ ! ... నీకేట యిందిరా ?" దుఃఖం వల్ల గొంతు జీర పోయింది చుక్కికి. మాట స్పష్టంగా రావడం లేదు. పెదిమలు వణుకుతున్నాయి.

నీళ్ళు త్రాగడంతో కాస్త ఊపిరి లేచి వచ్చింది వీరిగాడికి. అతికష్టం మీద కనురెప్ప లెత్తి తల్లివంక చూచాడు.

"ఏటయిందిరా ఈరీ !" మళ్లీ అడిగింది చుక్కి. ఆమె గొంతు ఆందోళనగా ఉంది.

"ఓలమ్మా ! అబోతే... పెసరసేను కడ్డం పడ్డాది. తోలబోయానే."

"నువు సేలో కెందుకెల్లావురా ? మీ అయ్యేమయ్యాడు ?"

"సినదొర ఊరెల్తన్నాడే. ఆరి పెట్టె బెడ్డింగు అట్టుకుని అయ్య ఆరి ఎనకెల్లాడే. నన్నేమో పెసరసేను సూత్తా ఉండమన్నాడే." వగరుస్తూ కాసేపు ఆగాడు వీరిగాడు. చుక్కి మరికాసిని మంచినీళ్లు వాడి నోటిలో పోసింది. అవి త్రాగి, "సేనేపికి అబోతొచ్చింగే—నేను రాయి యిసిరాను అది ఆగలేదు. సేను కడ్డంపడింది కర్రొట్టుకుని ఎనకేపునించి ఒక్కటుచ్చుకున్నానే. అది అడ్డం తిరిగింది. నన్ను కొమ్ముల్తో యిసి రేసిందే"

"ఓరి నా కొడకో..." చుక్కి గొంతు తడంటింది.

కొడుకు చేనుకు కాపలా ఉండడం, అబోతు ఎదురు రావడం, కొమ్ములతో వీరిగాడిని విసిరి పారవేయడం ఆమె కంటి ముందు ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఆమె చిగురు టాకులా ఒణికిపోయింది. ప్రేమా, దయా, కరుణా, ఆర్ద్రతా, మాటలకూ చేతలకూ అందని భావనా, తడారిన కళ్ళూ...చుక్కి నిభాయించుకోలేకపోయింది.

అబోతు ఎత్తి పారవేస్తున్నప్పుడు వీరిగాడు పెట్టిన కేకలు ప్రక్కపొలాల్లో పని చేసు కుంటున్న రైతులు విన్నారు. బానా కర్రలతో పరుగు పరుగున వచ్చారు. విసిరి పారేసి తిరిగి బుసలుకొడుతూ వీరిగాడి మీదకు ఉరకబోతున్న అబోతును తరిమి కొట్టారు. వీరిగాడిని భుజాల మీద వేసుకున్నారు. తెచ్చి గుడిసెలో దింపారు. చుక్కి వీరిగాడితో ఏదో అనబోతోంది. ఇంతలో దొర యింట్లోంచి రంకెలు వినిపించాయి. దొర అరుస్తున్నాడు.

"ఏడీ? ఎక్కడ ?" అరిచాడు భుజంగ రావు. అరుపు పెద్దింట్లో ప్రతి ధ్వనించి వెనుక నున్న పాకలో వినిపించి తాటాకుల్లో తల దాచుకుని ఆకాశంలో కలిసిపోయింది.

పాకలో చుక్కి పెద్దింట్లో పార్వతమ్మా ఒక్కసారే ఉలిక్కిపడ్డారు. పార్వతమ్మ వంటిం



ట్లోంచి వచ్చింది. పమిట కొంగుకు చేతులు తుడుచుకుంటూ కలవరపాటును కప్పి పుచ్చు కుంది.

"ఏమిటండీ ఆ రంకెలు ? ఎవరి మీద?" అడిగింది పార్వతమ్మ.

ఆమె ప్రశ్నకు బదులివ్వకుండానే హాలులోకి నడిచాడు భుజంగరావు. వంకెకు వ్రేలాడదీసిన హంటర్ అందుకున్నాడు. వచ్చినంత వేగంగా యింటి పెరడులో అడుగుపెట్టాడు. నైరుతి మూలగా ఉన్న చుట్టు గుడిసెవైపు తిరిగాడు. "ఒరేయ్ నారిగా ! ఇలా రారా వెధవా !" అంటూ అరిచాడు.

నారిగాడు అప్పుడే గేటులోంచి "దొరా !" అంటూ పరుగెత్తుకుని వచ్చాడు.

నారిగాడు చేతికందే దూరంలోకి వచ్చాడు. వెంటనే భుజంగరావు హంటర్ ఝళిపించాడు. "వెధవా ! ఒళ్ళు పాకరెక్కిందా ?" హంటర్ గాలిలోకి లేచింది. నారిగాడు ఉంగలు చుట్టుకు పోయాడు. నారిగాడు మారు పలకడం లేదు. యజమాని కొట్టే దెబ్బల బాధ పంటిబిగువున అణుచుకుంటున్నాడు. కాని 'ఎందుకు కొడతావు దొరా ?' అని అడగడానికి కూడా ప్రయత్నించడం లేదు. తరతరాల బానిసత్వ ప్రభావం వాడినలా నిర్జీవ ప్రతిమలా మార్చివేసింది.

చీటికి మాటికీ తన భర్త ఏ కారణమూ లేకుండానే నారిగాడిని ఆ విధంగా హింసించడం మామూలే. అయినా భుజంగరావు వెనుకనే వచ్చిన పార్వతమ్మ ఏమీ మాట్లాడలేకపోయింది. అలాటివేళ అతడిని అడ్డుకునే సాహసం ఆమెకు లేదు. మనసు ఎంత రోదిస్తున్నా నిస్తేజంగా చూస్తూ నిలబడిపోయింది పార్వతమ్మ.

గొడ్డులా వెట్టిచాకిరీ చేస్తున్న తనమగణ్ణి అలా దారుణంగా బాదుతున్న దొర వైపు అసహ్యంగా, భయంగా చూస్తోంది చుక్కి. గుడిసెదాటి ముందుకు అడుగువేయలేక అక్కడనే నిలబడిపోయింది.

ఒంటికి పసరుపట్లు వేస్తున్న తల్లి అధాటుగా గుడిసె బయటకు వెళ్ళింది. ఛెళ్ళు ఛెళ్ళుమని కొరడా చప్పుడు వినిపిస్తోంది. దొర తన తండ్రిని కొడుతున్నాడని అర్థమైంది వీరిగాడికి. దేకుతూంటూ గుడిసె బయటకు వచ్చి తల్లి వెనుక చతికిలపడిపోయాడు.

"తొత్తుకొడకా ! బంగారంలాంటి పెసర చేను నాశనం చేశావు కదరా ! ఆ నష్టం ఎవరు తీరుస్తాడురా ? నీ అబ్బగాడొచ్చి తీరుస్తా డటరా ?" ప్రశ్న, ప్రశ్న వెనుక హంటర్ దెబ్బ.

నారిగాడు పెదవి విప్పలేదు. మౌనంగా భరిస్తున్నాడు దెబ్బలు.

కొట్టికొట్టి భుజంగరావుకు కూడా అలుపు వస్తోంది. అదే అదనుగా గమనించి, "ఇంక చాల్లెండి !" అంది పార్వతమ్మ.

ఆమె స్వరంలోని భావాన్ని గ్రహించి, ఒక్కసారి ఆమెవైపు ఎర్రగా చూచి, "ఈ వెధవలకు మూడు రోజులపాటు నూకలూ, రాగి పిండి యివ్వకు. కడుపు మాడితేనే గాని బుద్ధి రాదు." అని యింట్లోకి నడిచాడు.

ముద్దలా పడివున్న నారిగాడి వైపు జాలిగా చూచి ఉస్సురని నిట్టూరుస్తూ తనూ లోపలకు నడిచింది పార్వతమ్మ.

నారిగాడిని కొట్టికొట్టి అలసటతో కుర్చీలో కూలబడి ఉన్నాడు భుజంగరావు. వెండి చెంబుతో మంచినీళ్ళందించింది పార్వతమ్మ. గటగటా చెంబు ఖాళీ చేశాడు భుజంగరావు.

"ఎందుకండీ చీటికీ మాటికీ వాడినలా చావబాదుతారు ? వాడే తిరగబడితే ! వాడు తలుచుకోక గాని మీ కబంధహస్తాల బారి నుండి తప్పించుకోలేడూ ?" అంది పార్వతమ్మ.

"బానిస వెధవ. తిరగబడితే నిలువులోతున పాతర వెయ్యనూ! ఇక తప్పించుకోవడం సంగతా, అలా జరిగిన నాడు ఏం జరుగుతుందో వాడికి బాగా తెలుసు."

"అవును. బానిస వెధవే ! నిజమే. ఎప్పుడో వాడి తాతల కాలంలో మీ తాతల వద్ద పుచ్చు కున్నది ముష్టి వందరూపాయలు. అందుకే తరతరాలుగా వాళ్ళు మీకు కట్టుబానిసలు."

"వాళ్ళ చావులకు ఖర్చుపెట్టిందో ? వాళ్ళ పుట్టుకలకు మనమే యివ్వడం లేదూ ? ఆ వందతోనే సరిపోయిందా ?"

"ఆ డబ్బులెక్కలేమీ నాకు తెలియవు. కాని వాళ్ళ చాకిరీని రూపాయలలో లెక్కిస్తే మనమే వాళ్ళకు ఋణపడతామేమో ! ఎప్పుడైనా ఆలోచించారా ? తాము సేవ చెయ్యడానికే

## స్కూళ్ళలో కంప్యూటర్లు

పశ్చిమ జర్మనీ స్కూళ్లల్లో కంప్యూటరు బోధనలకు ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలని పశ్చిమ జర్మనీ ప్రభుత్వం నిర్ణ యించింది. ప్రస్తుతం 75 శాతం పాఠ శాలల్లో కనీసం ఒక కంప్యూటరు ఉన్నది. విద్యార్థుల డేటా ప్రాసెసింగ్ పద్ధతులకు ప్రత్యేకంగా మార్కులను ఇస్తున్నారు. టీచర్లకంటే కంప్యూటర్లే ఎక్కువగా బోధించ గలవనే ఉద్దేశ్యం సర్వత్రా వ్యాపిస్తున్నది. కంప్యూటర్లను ప్రవేశ పెట్టడంవలన టీచర్లకు కూడా బండ చాకిరీ తప్పుతుంది. మరింత నిర్మాణాత్మక కార్యక్రమాలపై వారి దృష్టిని మరలించ డానికి వీలవుతుంది. జపాను, అమెరికా దేశాలలో కిండర్‌గార్డెన్ తరగతులలోకూడా కంప్యూటర్లను ఉపయోగిస్తున్న సంగతిని కూడా ఈ సందర్భంలో పేర్కొన్నారు.

హార్లిక్స్ మా కుటుంబంలో ప్రతి ఒక్కరికి మిత్రుడు వంటిది - రోజంతా ఆఫీసు పనితో అలసి వచ్చే మా శ్రీవారికి, కాలేజికి, డాన్సు క్లాసుకి వెళ్ళివచ్చే మా అమ్మాయికి, ఫుట్‌బాల్ హీరో మా అబ్బాయికి. అంతెందుకు, రోజూ మార్కెట్ పని ముగించుకుని ఇంటికి వచ్చాక, నేను కూడా ఒక కప్పు హార్లిక్స్ త్రాగవలసిందే! హార్లిక్స్ మాలో ప్రతి ఒక్కరికి మేలు చేస్తుందని నా నమ్మకం.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముతున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




కొత్త సమయం,
కొత్త రూపం

మంచి పుష్టికరమైనది

HTD-HMM-8072 TEL

పుట్టామనే న్యూనతాభావం వాళ్ళ మనసుల్లో హత్తుకుపోయింది. ధర్మప్రవచనాలపేరిట వాళ్ళ కదే మారిపోస్తున్నారు. అందుకే మీలాటివాళ్ళ ఆటలు యధేచ్ఛగా సాగుతున్నాయి ఈ పుణ్య భూమిలో.

కాని వాళ్ళు నిజం తెలుసుకోగలిగిననాడు ఏమౌతుందో ఊహించగలరా? వాళ్ళ కళ్ళు తెరుపుడుపడ్డనాడు మీ మిధ్యాహంకారం మట్టి కరుస్తుందని తెలుసుకోండి. వాళ్ళ చావు పుట్టుక లకు ఏదో ఉదారంగా ధారపోస్తున్నట్లు మాట్లాడకండి.''

''ఏమిటే మితిమీరుతున్నావు. ఆ వెధవలకు రోజూ తిండి పెట్టడంలేదూ ?''

''ఆఁ! మహలావు పెట్టేస్తున్నాంలెండి. పండుగ దివాలుతప్ప మిగతా రోజుల్లో వాళ్ళ కిచ్చేది నూకలూ, రాగిపిండేకదా ?''

''దిగివచ్చావుకదా అన్నపూర్ణమ్మ తల్లివి. వరి అన్నం కుంభాలుగా తోడిపొయ్యి.''

''అల్లా పెట్టినా మనమే వాళ్ళకు రుణపడి ఉంటాం.''

''కట్టిపెట్టు నీ ధర్మపన్నాలు.''

''నా మాట వినండి. కాలం మారుతోంది. దానికనుగుణంగా మనమూ మారడం ప్రకృతికి హితమైన ధర్మం. ఊరుకే మూగజీవాల ఉసురు పోసుకోవడం మనకు శ్రేయస్కరంకాదు. నారి గాడిని వెట్టిచాకిరీనుండి విముక్తుణ్ణి చెయ్యండి.''

''మన పనులు ?''

''వాడి స్థానంలో వాడినే పాలేరుగా పెట్టు కుందాం. మనకేంగతిలేదు కనుకనా ?''

''పాలేరంటే ఏదో పావలాకో పరక్కో దొరుకుతాడనుకుంటున్నట్లుంది నీ వరస చూస్తే. పాతిక బస్తాల ధాన్యమైనా పొయ్యందే దొరకడు. పైగా పాలేరుంటే సరిపోతుందా ? పశువులను కాయడానికి మరో కుర్రాడుండాలి. నీకు పాచిపనికీ వంట్లపనికీ మరో ఆడదుండాలి. వీటన్నిటితో ఖర్చుతడిసి మోపెడవుతుంది. ఏమనుకున్నావో.''

''మనకు ఏ మాత్రమూ పై ఖర్చు కాకుండా యిన్ని అవసరాలూ కేవలం రాగిపిండీ నూకలతోనే తీరుతున్నాయని చెప్పు కుంటున్నారు గదా—అలాటప్పుడు ఆ నారిగాణ్ణి అలా చీటికీ మాటికీ ఏ తప్పూ చేయకపోయినా గొడ్డును బాదినట్టి బాదుతారేం?''

''వాడు ఏ తప్పూ చేయలేదని వాదించ డానికి వాడి తరపున వకాల్తా తీసుకున్నావా ?''

''అలా వ్యంగ్యంగా మాట్లాడే బదులు అసలు వాడు చేసిన తప్పేమిటో చెప్పరాదూ !''

''వాడికి నేను చెప్పినదేమిటి ? వాడు చేసిన దేమిటి ? రేపో మాపో కోతకు సిద్ధంగా ఉన్న పెసర చేనంతా ధ్వంసం చేశాడు వెధవ.''

''మన అబ్బాయిని టవును వెళ్ళే బస్సు ఎక్కించడానికి పెట్టె బెడ్డింగూ తలకెత్తుకుని వెళ్ళాడు. అక్కడికీ వీరిగాణ్ణి కాపలా ఉంచనే ఉంచాడు. వాడేమో వేలెడు వెధవ. వచ్చిందేమో మదించిన ఆబోతు. అక్కడికీ దానిని తోలాలని విశ్వ ప్రయత్నం చేశాడట వెర్రివెధవ. కొమ్ములతో విసిరి పారేసిందట వాణ్ణి. చుట్టు ప్రక్కల పనిపాటలు చేసుకుంటున్న వాళ్ళు అడ్డుపడ్డారు. లేకపోతే దారుణంగా చచ్చిపోయి ఉండేవాడు పాపం.''

''గొడ్లను కాయడానికిదో దొంగెత్తు, నిజంగా అంత దెబ్బలు తగిలాయేమిటి ?'' అని, ''ఈ మధ్య చుక్కిముండ కూడా సరిగా పని చేస్తున్న జాడ లేదు.'' అన్నాడు భుజంగరావు.

''అదిప్పుడు ఓపలేని మనిషండీ !''

''మళ్లీ ఓ పనికిమాలిన ఖర్చా ? ''

''అదేమిటండీ అలా అంటారు. మీ కుటుం బానికి కట్టుబానిసగా పడి ఉండడానికి మరో ప్రాణి భూమిని పడబోతూంటేను.'' అంది పార్వతమ్మ.

ఆమె తనను ఎద్దేవా చేస్తోందని భుజంగ రావుకు తెలుసు. అతడు కార్యవాది. కనుకనే ఏమీ మాట్లాడలేదు. తనకు తృప్తి నివ్వగలది సిరి ఒక్కటే. అది వస్తుంటే చాలు—ఎవరేమను కున్నా లెక్కచేయడు.

*　　*　　*

''ఏమిటే ? ఎప్పుడో మీ తాతలనాడు వంద రూపాయల బాకీ పుచ్చుకున్న పాపానికి యిలా పిల్ల పిల్ల తరం వెట్టిచాకిరీ సెయ్యవలసిందే నంటావా ? '' అడిగింది చుక్కి.

''సెయ్యక మనం సెయ్యగలదేం ఉందే — ఏమీలేదు. నీతో పెళ్లి కావడానికి ముందు నేనూ మా అయ్యతో యిట్టాగే దెబ్బలాడేను. మా అయ్య సెప్పిన మాటతో మనసు సరిపెట్టుకో నేకపోయాను—ఏటయితే అదే అయిందని తెగిం చాను కీనాడు.''

''ఏటిసేశావేంటి ? '' అడిగింది చుక్కి. ప్రక్కనే గోనె గుడ్డల మీద ఒళ్లెరుగని జ్వరంతో మూలుగుతున్నాడు వీరిగాడు.

''ఈ యిల్లిడిసి పారిపోయాను.''

''మరి మళ్లీ యిక్కడకే ఎలా సేరావు ? ''

''నా అంతట నేనే సేరాననుకుంటన్నా వేటి ? అందుకే నిన్ను ఎర్రిమొగానివనేది. సరుకేదో ఎత్తికెళ్లిపోయావని కేసెట్టాడు దొర. పోలీసోల్లు వెతికి పట్టుకున్నారు.''

''మరి నీకాడ సరుకేదీ నేదు కదరా !''

''ఓసెర్రిమొగమా — మనకాడ నిజంగా ఉండాలేంటే. దొర యిచ్చిన సరుకోటి నాసేతిలో కుక్కారు పోలీసోల్లు. అలా ఎట్టి నన్ను లాక్కొచ్చారు. సుట్టుపక్కలోళ్ళంతా నేను నిజంగానే దొంగతనం సేశాననుకున్నారు. మళ్ళీ అప్పుడు దొరే అడ్డుపడ్డాడు. జేలుకెళ్లకుండా సేసాడు. అదంతా నాటకమని నాకు తెలుసనుకో. మరి మన మాటినేవోడెవడు ?''

''ఓర్నీ— నువ్వు నిజంగా దొంగతనం సెయ్యకపోయినా యింత సేసాడంట్రా దొర ?''

''ఒక్క దొంగతనమేంటే ఎర్రిమొకమా— ఎవుడో ఆల్లకి కిట్టనోణ్ణి ఆల్లేసంపేసి అది మన మెడకు సుట్టేగల్రీ దొరలు. ఆల్ళసేతికొక్కసారి సిక్కేమంటే మొసలిపట్టే ఆల్లది.''

''అయితే మన యీరిగాడి బతుకు కూడా యిలా తెల్లారి పోవలసిందేనట్రా ?'' నిస్పృహగా నిట్టూర్చింది చుక్కి.

నారిగాడు ఏమీ మాట్లాడలేదు. అయితే వీరిగాడి జీవుడు బానిసత్వం చెయ్యడానికి ఏ మాత్రం యిష్టపడలేదు. అర్థరాత్రి దాటేసరికి సంధి ప్రేలాపన మొదలయింది. ప్రక్కమీద ఎగిరెగిరి పడసాగాడు వీరిగాడు. నారిగాడు ఆదరా బాదరా దొరను నిద్రలేవగొట్టాడు. పరిస్థితి నంతా వివరించాడు. దొర మనసు కరగలేదు. పార్వతమ్మ బలవంతం చెయ్యగా నారిగాడి గుడిసెదాకా వచ్చాడు దొర. వీరిగాడివైపు తొంగి చూచాడు. దొర వెనుకనే వచ్చిన పార్వతమ్మకు పరిస్థితి పూర్తిగా అర్థమైంది. ఆమె మాతృ హృదయం ఆక్రోశించింది. దొర ఒక అడుగు వెనక్కివేసి నారిగాడి నుద్దేశించి అన్నాడు. ''ఏమీ ఫరవాలేదు. తెల్లవారాక వీణ్ణి ధర్మాసు పత్రికి తీసుకు వెళ్ళుదువుగానిలే'' అన్నాడు.

తన బిడ్డప్రాణం తెల్లవారే దాకా ఆగదని చుక్కి మనసుకు తోచింది. నీళ్ళు నిండిన కళ్ళతో బేలగా పార్వతమ్మ వైపు చూచింది. బండ రాయైనా కరుగుతుందేమోగాని కరుడు గట్టిన తన భర్త హృదయం కరుగదని పార్వతమ్మకు తెలుసు. భర్త ఎదుటనే తనకు తానుగా స్వతం త్రించగల శక్తి లేదు. 'అమ్మా! నువ్వా ఓ

## ప్రేమాభిషేకం

చల్లని జాబిల్లి చక్కదనమును చూసి
తారకా భామినులు దరహాస మొనరింప
పండు వెన్నెలకాంతి కడలి తరగల మెరిసె
జ్యోత్స్నాతటిల్లతలు వినువీధిలో మురిసె!
గుబురుగా పెరిగిన మహా వృక్షాలు
ఆనందం పంచుకుని తలలూచాయి;
ఎదుగుతున్న లేత మొక్కలు
ఆమూలాగ్రం ఆనందలాస్యం చేశాయి !
ఎదురుచూసి , యెదురుచూసి
కామనల బరువు కన్నుల నిలువగా
అపర్ణ తపస్సమాధిలా
అలివేణి నిదురించింది !
ఎదురుచూసినవాడు అప్పుడే వచ్చాడు;
నిదురించు ప్రియురాలి నిదుర కలచగలేక
తన్మయానంద కదుష్ణాశ్రువులతోడ
కావించె కోమలికి ప్రేమాభిషేకం !

— లతిక







తల్లివేగదా !' అని చుక్కి నిలదీస్తున్నట్టనిపించింది. ఆమెవైపు చూడలేక తల దించుకుంది. భర్త వెనుకనే బయలుదేరింది. వెనుక నిస్సహాయంగా నిలబడిపోయారు నారిగాడు, చుక్కి.

*   *   *

సాయంకాలం పిట్టలు గూళ్ళకు చేరే వేళ. వేటతుపాకీ భుజాన తగిలించుకుని పొలాల వైపు షికారు బయలుదేరాడు భుజంగరావు. నారిగాడు ఆయన వెనకనే నడువసాగాడు.

వీరిగాడు చనిపోయి ఆనాటికి రెండు రోజులే అయింది. అయినా నారిగాడికి యజమాని వెంట బయలుదేరడం తప్పలేదు. వాడికి అలాటి స్థితిలో కూడా స్వంత చాకిరీని పురమాయించడానికి ఏమీ ఎబ్బెట్టు అనిపించలేదు భుజంగరావుకు. నారిగాడు బానిస. బానిసలు మమత, అనుబంధం మొదలైన ద్వంద్వాలకు అతీతంగా ఉండాలి. అదీ భుజంగం లాంటి వాళ్ళ సిద్ధాంతం.

దిగులుగా అడుగులో అడుగేసుకుంటూ దొరననుసరిస్తున్నాడు నారిగాడు. ఊరు విడిచి పొలాల వైపు వెళ్ళే రోడ్డు మలుపు దాకా వచ్చారు ఆ యిద్దరూ. రోడ్డుమలుపులో ఊడలు దిగిన పెద్ద మర్రి చెట్టు ఉంది. చెట్టుకొమ్మల మీద కొంగలు గూళ్ళలో ఉన్న తమ పిల్లలకు ఆహారం అందిస్తూ సందడిగా ఉన్నాయి.

భుజంగరావు రోడ్డు మధ్య నిలబడి కొంగల వైపు తుపాకీ గురి చూస్తున్నాడు. అతడు వేట తమకంలో ఉన్నాడు. పరిసరాల స్పృహ అతడిలో ఏమాత్రం లేదప్పుడు. కొంచెం దూరంలో నిలబడి తన దొరవైపు తదేకంగా చూస్తున్నాడు నారిగాడు. ఏదో శబ్దం వస్తున్నట్టయి ఈ లోకంలోపడ్డాడు నారిగాడు. రోడ్డు మలుపుకు ఆవలినుండి బస్సువంటి పెద్ద వాహనం వస్తున్నట్టు అర్థంచేసుకున్నాడు చప్పుడుమబట్టి. దొరవైపుకు చూచాడు. అతని ఈ లోకంలో లేడు. అతడికి ఏమీ పట్టలేదు. అతడి దృష్టి కొమ్మలమీది కొంగలవైపే ఉన్నట్టు అర్థమైంది.

ఒక లారి దూసుకుని వస్తున్నట్టు చూచాడు నారిగాడు. "దొరా!" అని ఒక్క అరుపు అరచి దొరవైపు దూకి ఒక్క ఊపున దొరను ప్రక్కకు ఒక్కతోపు తోశాడు. భుజంగరావు రోడ్డు వారగాఉన్న తుప్పలలో పడ్డాడు. నారిగాడి ఆర్తనాదం చెట్టుకు గుద్దుకున్న లారీ చప్పుడులో కలిసిపోయింది. లారీ ముందు చక్రం నారిగాడి నడ్డిమీదుగా పోయింది. రెండు క్షణాల పాటు నారిగాడి కాళ్ళూ చేతులూ తపతపా కొట్టుకున్నాయి. తరువాత నిశ్చలమయిపోయాయి.

దుమ్ములకంటిన ధూళీ, ముళ్ళూ దులుపుకుంటూ లేచి నారిగాడివైపు చూచాడు భుజంగరావు. వెంటనే చెట్టుకు గుద్దుకుని ఆగిపోయిన లారీవైపు బయలుదేరాడు. చుట్టుప్రక్కల పొలాలనుండి పరుగెత్తుకుని వచ్చారు రైతులు. లారీని చుట్టుముట్టారు. లారీలోని వ్యక్తులకు పలాయనం చిత్తగించే సావకాశం లేకుండా చేశారు.

*   *   *

అమ్మగారిచ్చిన పాతకోక కట్టుకుని దొరతో పట్నం వెళ్ళింది చుక్కి. పోలీసుల సమక్షంలో చుక్కిచేత కాగితాలమీద వ్రేలి ముద్రలు వేయించాడు భుజంగరావు. లారీ కంపెనీవారు చుక్కి చేతిలో డబ్బుకట్ట ఉంచబోయారు. దొరవైపు భయం భయంగా చూస్తూ ఆ కట్ట నందుకుంది చుక్కి. వెంటనే ఆ కట్టను తన దొరకే అందించింది చుక్కి. భుజంగరావు కట్టను భద్రం చేశాడు.

**అంకితం**

నా చే కలం పట్టించిన మిత్రుడు శ్రీ యస్. వి. వి. సత్యనారాయణకు అంకితం.

— రచయిత

"నువ్వు వెళ్ళిరావే చుక్కీ." అన్నాడు భుజంగరావు.

చుక్కి బేలగా నోట్లకట్ట వైపు చూచింది.

భుజంగరావు కసురుకున్నాడు "తినేస్తానా ఏం ? పద యింటికి. నాకు పట్నంలో యింకా పని తగలడిందిలే."

చుక్కి మాట్లాడలేదు. వెనక్కి తిరిగింది. అడ్డదారిన నడక పుచ్చుకుంది. వెళ్ళేటప్పుడు బస్సెక్కించాడు దొర. వచ్చేటప్పుడు నడక. చుక్కి దారి పొడుగునా ఆలోచనలతో సతమతమవుతోంది.

*   *   *

టాక్సీ యింటి ముందాగింది. ఇంట్లోకి అడుగుపెట్టాడు భుజంగరావు. తిన్నగా ఇనప్పెట్టె ఉన్న గదిలో అడుగుపెట్టాడు. పార్వతమ్మ వెండి చెంబుతో అందించిన నీళ్ళు గటగటా త్రాగాడు.

ఇనప్పెట్టె తెరిచాడు భుజంగరావు. బ్యాగ్ నుండి రూపాయల కట్టతీసి అందులో పెట్టబోతున్నాడు.

"ఎంత దక్కిందేమిటి మృతి నష్టం." అడిగింది పార్వతమ్మ అసహ్యంగా.

నోట్ల కట్ట ఇనప్పెట్టెలో పెట్టి తాళం వేస్తూ, "పదివేలు". అన్నాడు నిర్లిప్తంగా.

"వద్దండీ ! ఆ డబ్బు మనకు వద్దు. ఆ సొమ్ము చుక్కిది. దాని డబ్బు దానికే యివ్వండి. దాని మానాన దానిని వెళ్ళనివ్వండి. కనీసం పుట్టబోయే బిడ్డకయినా బానిస బ్రతుకు తప్పించుకుంటుంది." ఆవేదనగా అంది పార్వతమ్మ.

అప్పటికే ఇనప్పెట్టె తాళం వేయడం ముగించిన భుజంగరావు ఆ గదిదాటి బయట కడుగుపెట్టాడు.

పార్వతమ్మ నిస్ప్రాణగా భర్త వెళ్ళినవైపు చూస్తూ నిలబడిపోయింది. ★



# విశ్వవిఖ్యాత మహేంద్రజాలికుడు ప్రొఫెసర్ పి.సి.సర్కార్ (సీనియర్)




ప్రొ॥ బి.వి. పట్టాభిరామ్

మేజిక్ పేరు చెప్పగానే అందరికీ స్ఫురణకు వచ్చేది ప్రొఫెసర్ పి. సి. సర్కార్ పేరు. ఒక్క భారత దేశంలోనే కాక యావత్ ప్రపంచమంతా తిరిగి ప్రతీదేశంలోనూ, పట్టణాల్లోనూ ఇంద్రజాల ప్రదర్శనలిచ్చి, ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచి, భారతదేశపు కీర్తి పతాకాన్ని నలుదిశల్లో ఎగురవేసిన విశ్వవిఖ్యాత మహేంద్ర జాలికుడు సర్కార్.

1913వ సంవత్సరంలో జన్మించిన ప్రతుల్ చంద్ర సర్కార్ తండ్రికూడా మెజీషియనే. వారి వంశంలో ఆరుతరాలనుంచి ఇంద్రజాల విద్యను అభ్యసించి ప్రదర్శనలు చేసేవారు. కానీ వారిలో ఏ ఒక్కరూ ప్రచారం చేసుకోక పోవటం వల్లనూ, ప్రతిష్టాకరమైన ప్రదర్శనలు ఇవ్వకపోవటం వలనూ వారి గురించి ప్రజలకు అంతగా తెలియలేదు. సర్కార్ చిన్నతనంలోనే తన తండ్రివద్ద ఇంద్రజాల రహస్యాలన్నిటినీ తెలుసుకుని, కొన్ని పురాతనమైన తాళపత్ర గ్రంథాలను సంపాదించి వాటిల్లో సంస్కృతంలో వివరింపబడిన ప్రాచీన ఇంద్రజాలం గురించి తెలుసుకుని ప్రదర్శనలు ఇవ్వసాగాడు. ఒక కళాకారుడు పైకి రావాలన్నా, అందరిచేత గుర్తింపబడాలన్నా కేవలం ప్రతిభ ఉంటే సరిపోదు, దానికి తగ్గ ప్రచారం, పరిశ్రమ, ఉండి తీరాలనేది సర్కార్ సిద్ధాంతం. అందుచేతనే తన ప్రదర్శనలో వచ్చిన ఆదాయంలో మూడు వంతులు ప్రచారానికి ఖర్చుపెట్టేవాడు. పత్రికలలో ఇంద్రజాలం గురించి వ్యాసాలూ, ప్రజలలో ఆసక్తి కలిగించటం కొరకు చిన్న చిన్న మేజిక్కులు ఎలా చెయ్యాలో వివరించి మేజిక్ కళకు అపారమైన సేవచేసి జీవం పోసారు.

పూర్వకాలంలోని రాజులు, రాజ్యాలు పోయిన తరువాత అప్పటి రాజాస్థానాలలో ఉండే ఆస్థాన ఇంద్రజాలికులు పొట్టచేతబట్టుకుని వివిధ వృత్తులు చేపట్టడం వలన ఇంద్రజాల కళ దాదాపు అంతరించిపోయింది. దాదాపు పద్దెనిమిదో శతాబ్దం నుంచి ఇరవయ్యో శతాబ్దం ఆరంభం వరకు ఇంద్రజాలంకు చాలా గడ్డురోజులు వచ్చాయి. కొంతమంది స్వార్థపరులు ఒకటి, అరా మేజిక్‌లు నేర్చుకుని, తమకేవో శక్తులున్నాయని అమాయక ప్రజలను మోసం చేసి, తమ వద్ద ఉన్న ఉంగరాలు, తాళ్ళను అమ్మి సబ్బంగడుపుకుంటూ మేజిక్‌ను ఒక నీచమైన స్థితికి దిగజార్చారు. ఆ రోజుల్లో, మేజిక్ తెలిసిన వాళ్ళకు దుష్టశక్తులతో సాంగత్యం ఉంటుందని, ప్రజలు గాఢంగా విశ్వసించేవారు. వారిని దూరంగా ఉంచేవారు. కొంతమంది ఔత్సాహికులు ఈ కళపై ఉన్న అభిమానంతో కేవలం స్నేహితులకు వినోదం కలిగించడానికి ఈ విద్యను అభ్యసించినా, ప్రదర్శించడానికి ఆ స్నేహితులే అభ్యంతరం తెలిపేవారు. అటువంటి పరిస్థితిలో సర్కార్ వంశస్థులు మేజిక్ పైగల అభిమానంతో తమ కుటుంబాల్లో వారి వద్ద తమ కళను ప్రదర్శించి తృప్తి పడేవారు.

ఇరవయ్యో శతాబ్ద ప్రారంభంలో మేజిక్‌కు తిరిగి మంచి రోజులు రావటం ప్రారంభమయ్యాయి. గోగియా పాషా, వకీల్, సర్కార్, కె. లాల్ వంటి ప్రముఖులు ఇంద్రజాల విద్యను కుణంగా అభ్యసించి ఈ ఇంద్రజాలంలో మంత్రాలు లేవు, తంత్రాలు లేవు, మాయలు అసలే లేవు ఇదంతా కేవలం హస్తలాఘవం వలనే చేయగలుగుతున్నాము అని ప్రజలకు నచ్చచెప్పి ప్రదర్శనలు ఇవ్వటం ప్రారంభించారు. ఈ విషయంలోసర్కార్, అకుంఠిత దీక్షతో ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగి, శారీరకంగానూ, ఆర్థికంగానూ ఎంతో నష్టపోయినా చివరకు 'ఇంద్రజాలం — ఒక లలితకళ' అని ప్రజలచేత ప్రేక్షకులచేత అంగీకరింపచేసారు.

సర్కార్ ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలలోనూ ప్రదర్శనలు చేసి ఒక కొత్త రికార్డు స్థాపించారు. జపాన్‌లో ఒకే ఆడిటోరియంలో ఒక సంవత్సరంపాటు అంటే అక్షరాలా మూడు వందల అరవై అయిదు రోజులూ వరుసగా హౌస్ ఫుల్ కలెక్షన్లతో ప్రదర్శనలిచ్చి అంతకు ముందు రికార్డులను బద్దలుకొట్టారు. జపాన్‌లోనూ, ఇంగ్లండులోనూ, రష్యాలోనూ, అమెరికాలోనూ ఆయా ప్రభుత్వాలచే సత్కరింపబడి ప్రతిష్టాకరమైన బిరుదులు పొందారు. మన భారతదేశ ప్రభుత్వం కూడా ఆయనలోని

"కళ"ను మెచ్చి పద్మశ్రీ బిరుదు సత్కారం చేసి రాజ్యసభలో స్థానం కలిపించారు. ఇంతేకాక ప్రపంచ మేజిక్ సంస్థ, సర్కార్ సృజనాత్మక శక్తికి, ప్రదర్శనకి మెచ్చి అత్యంత ప్రతిష్టాకరమైన బిరుదు "ది వర్ల్డ్స్ గ్రేటెస్ట్ మెజీషియన్"ను ఇచ్చారు. ఇంతకు ముందు ఆ బిరుదు ఒక్క హౌడినీకి మాత్రమే వచ్చింది.

మేజిక్ రంగంలో మార్గదర్శకుడిగా పేరొంది సమాజంలో ప్రముఖ వ్యక్తిగా గౌరవింపబడిన సర్కార్‌లో అణువంత గర్వం లేదు. తన తోటి మెజీషియన్లను, కొత్తగా నేర్చుకున్నవాళ్ళను సాదరంగా ఆహ్వానించి వారికి కావలసిన మేజిక్ రహస్యాలను దాచకుండా చెప్పేవారు.

సర్కార్ మేజిక్ ప్రదర్శనలో కళ్లకు గంతలు కట్టుకుని సైకిల్ నడపటం (లండన్ వీధులలో ఈ ఫీట్ మొదట చేసిన ఘనత ఈయనేకే దక్కింది) పెరిన్నియల్ వాటర్ ఆఫ్ ఇండియా (ఈ మేజిక్‌ని సర్కారే కనిపెట్టారు) ప్రేక్షకుని నాలుకను కోసి, తిరిగి అతికించుట, ఒక స్త్రీని రెండు ముక్కలుగా చేసినట్లు చూపి తిరిగి అతికించుట, ప్రేక్షకుని మనసులోని మాట చెప్పుట వంటి ఆసక్తికరమైన అంశాలు ఎన్నో ఉన్నాయి. వీనుల విందైన సంగీతం, మిరిమిట్లు గొలిపే లైటింగ్ ప్రదర్శన మరింత రక్తి కట్టిస్తాయి. ఊహకు కూడా అందనటువంటి, మహత్యాలుగా కనపడే ఈ అంశాలు చేస్తూ, సర్కార్ ప్రతీసారి ఇది కేవలం మాజిక్‌మాత్రమే మంత్ర తంత్రాలు లేవు అని నొక్కి వక్కాణించేవారు. తనకు దేవుడిపై నమ్మకం ఉందికానీ తన మేజిక్‌లో మంత్రాలు లేవని మరీ మరీ చెప్పేవారు.

ఇంద్రజాల రంగంలో ఒక "ఫెనోమినా"గా ఉండిపోయిన ప్రొఫెసర్ సర్కార్ 1971 జనవరిలో జపాన్‌లో స్వర్గస్తులయ్యారు. మన భారతీయులందరూ ఎంతో గర్వించదగ్గ విషయమేమంటే సర్కార్ జన్మదినమైన ఫిబ్రవరి 23వ తారీఖున ప్రపంచంలోని మెజీషియన్లందరూ "ఇంటర్నేషనల్ మెజీషియన్స్ డే"గా పాటిస్తారు. ప్రతీ దేశంలోని మెజీషియన్లు ఆ రోజును ఎంతో ఘనంగా జరుపుకొంటున్నారు. సర్కార్ స్వస్థలం అయిన కలకత్తాలో ఆయన మరణించిన తరువాత ఒక పెద్ద వీధికి పి. సి. సర్కార్ స్ట్రీట్ అని పేరు పెట్టారు. ఈనాటి ఇంద్రజాలికులుకు, ఔత్సాహికులకు సంఘంలో ఒక గుర్తింపు వచ్చిందంటే దాని క్కారణం సర్కార్ శ్రమే అనేది నిర్వివాదాంశం.

**(పైవారం :- వైద్య పరికరాలు లేకుండా వైద్యంచేసిన డా. అరిగో)**

సీరియల్

# తీగరాగానికందే తాళం

## చక్కిలం విజయలక్ష్మి

**26**

(గత సంచిక తరువాయి)

"నాకూ, శివానికీ బీరకాయ పీచు చుట్టరిక మేదో వుండేదట. దాన్ని మేమెప్పుడూ గుర్తు చేసుకోలేదు. మా మధ్య నున్నది పాల వంటి స్వచ్ఛమైన స్నేహం. అంతే. మా ఇద్దరికీ వివాహాలై సంసారా లేర్పడినా మీ అమ్మ మీ అత్తయ్యా కూడా సహృదయులు, స్నేహశీలురు కావటం వల్ల మా స్నేహానికి ఎలాంటి ఆటంకం కలుగలేదు.

నాకు మీ బావ లిద్దరు. మీ నాన్నకు నీవు. ఖర్చులు పెరుగుతున్నాయి. చాలీచాలని జీతాలు. ఆర్థికమైన అసంతృప్తి పెరుగసాగింది. ఇద్దరం కలిసి ఏదైనా వ్యాపారం చేయాలని అనుకున్నాము. మీ నాన్నకు పల్లెలో పాత ఇల్లొకటి వుండేది. అది అమ్మి, ఆ డబ్బు తెచ్చి నా చేతికిచ్చాడు. మీ అత్తయ్యకు పుట్టింటివారు పెట్టిన బంగారం కొంత వుండేది. అది అమ్మి రెండూ కలిపి వ్యాపారంలో పెట్టుబడి పెట్టాలని మా వుద్దేశం.

అలాంటి రోజుల్లో మీ నాన్న శివం మీ అమ్మను హత్య చేశాడని వార్త వచ్చింది. మరు క్షణమే నేను, మీ అత్తయ్య మీ ఇంటికి వెళ్ళాము. మీ అమ్మ గిరిజ చావు బ్రతుకుల్లో వుంది. శివం లేడు ! నీవూ లేవు ! 'శివం భార్యను హత్య చేయాలని ప్రయత్నించాడన్నారు. గిరిజ మరణిస్తే అది హత్యే అవుతుందన్నారు. ఆమె తప్పక మరణిస్తుందనీ అన్నారు. నా తల తిరిగిపోయింది. మీ అమ్మా నాన్నల్ది అనురాగ దాంపత్యం. అన్యోన్య దాంపత్యం. ప్రేమకు ప్రతీకలా, అనురాగానికి అద్దంలా వుండేవాళ్ళు. పెళ్ళయిన చాలా ఏళ్ళ తర్వాత నిన్ను అందించిన భార్య అంటే శివం మరీ ప్రాణం పెట్టేవాడు. అలాంటి శివం భార్యని హత్య చేయబోవటం ఏమిటి !! కానీ ఋజువులు, ఆధారాలు అలాగే వున్నాయి. సరే. మరి శివం ఏమయినట్టు ? నీవు ?

వారంరోజుల తర్వాత మరణ శయ్య మీద వున్న గిరిజకు స్పృహ వచ్చింది.

శివానికి వేట పిచ్చి వుండేది. లైసెన్స్ తీసుకున్న తుపాకీ ఇంట్లో వుండేది. ఆ రోజు తుపాకీ తీసుకుని వేటకు బయలుదేరాడట. ఆ రోజెందుకో గిరిజకు భర్తను పంపాలనిపించలేదు. ఒద్దంది. బ్రతిమాలింది. కోప్పడింది. అధికారికంగా శివం చేతుల్లోని తుపాకీ పట్టి లాగింది. ఇద్దరూ నవ్వుతూనే వున్నారు. పట్టుదలగా పెనుగులాడుతూనే వున్నారు. ఆ పెనుగులాటలో హఠాత్తుగా తుపాకీ పేలింది ! అంతే !

భర్త నిర్దోషిత్వాన్ని నిరూపించాలని గిరిజకు వచ్చిన స్పృహ అంతలోనే పోయింది... శాశ్వతంగా.

శివం ఏమయ్యాడో తెలీదు ! వాడితో పాటు నీవూ ! జీవితానికి వుత్సాహాన్ని కలిగించిన స్నేహ మాధుర్యం దూరం కావటంతో ఏదో నిస్పృహత్వ ఆవహించింది. ఇద్దరం కలిసి చేయాలనుకున్న వ్యాపారం ఒక్కణ్ణీ చేయలేకపోయాను. ఆ వుత్సాహం చచ్చిపోయింది. ఆ సమయంలోనే ఏదో పోరంబోకు పొలం చౌకగా అమ్ముతున్నా రంటే శివం డబ్బు వృధాగా వుండటం ఎందుకని అది కొనేశాను. అదృష్టవశాత్తూ అందులో సున్నపురాతి గనులు బయటపడ్డాయి ! మామూలు పంట పండించాలనుకున్న ఆ పొలం బంగారు పంట పండసాగింది ! సంపద పెరుగుతున్నా మీ అమ్మ మరణించిన దుఃఖం, నీవూ, మీ నాన్నా కనిపించని నిర్వేదం నన్ను కృంగదీసేది.

ఇలాగే పద్దెనిమిదేళ్ళు గడిచిపోయాయి. నాకు తర్వాత గీత పుట్టింది. నా ముగ్గురు పిల్లలూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు. చదువుకున్నారు. పెద్దవాడు హరికి పెళ్ళికూడా అయింది. నా సంసారం, నా సంపద ఎంతో సంతృప్తికరంగా వున్నాయి. కానీ సంపద వృద్ధి చేసినది నేనే అయినా పెట్టుబడి శివానిది. ఈ సంపద అనుభవించవలసిన ముఖ్య హక్కుదారులు శివం, అతని కుటుంబం. కానీ మీ అమ్మ ఏనాడో భవబంధాలు తెంచుకుపోయింది. నీదీ, శివానిదీ జాడ తెలియకుండా పోయింది. నేనేం చేయను ? నిరాశతో పూర్తిగా కృంగిపోయిన తరుణంలో ఇన్నేళ్ళ తర్వాత ఒకనాడు మీ నాన్న నుండి ఉత్తరం వచ్చింది !!!

రెక్కలు కట్టుకుని వాలాను. నన్ను చూసి వాడి కళ్ళలో వెలిగిన దీపాలు .. ఇన్నేళ్ళ మేము కోల్పోయిన మాధుర్యానికి భాష్యం చెబుతున్నాయి. దుఃఖంతో, ఆనందంతో నా గుండె పట్టేసింది. ఇన్నేళ్ళ తర్వాత వాడి ఉనికి తెలిసిన ఆనందం శాశ్వతం కాదని ఆ క్షణంలోనే అర్థమయింది మరి శివం చావు బ్రతుకుల్లో వున్నాడు.

నిన్ను పరిచయం చేశాడు, బుట్టగౌనులో రబ్బరు బొమ్మలా వుండే రెండేళ్ళ జ్యోతిని... ఇరవైయేళ్ళ జయంతిగా !!!

శివం... సాంబ అయ్యాడు !!!

ఎందుకీ అజ్ఞాతం !? ఏం తప్పు చేశాడని!?

అదే అడిగాను.

నీవు లేని సమయంలో అంతా చెప్పాడు శివా.

ఆ రోజు వేటకు బయలుదేరాడట శివం. ఎందుకో తెలీదు, ఎప్పుడూ ఆటంక పరచని మీ అమ్మ ఒద్దని అడ్డుకుందట. వేటమీద ఆసక్తిగల స్నేహితులతో అన్ని ఏర్పాట్లూ చేసుకున్న శివం ఆమె మాట వినిపించుకోలేదు. గిరిజ తుపాకీ పట్టుకుందట. తమాషాగా పెనుగులాడిందిట, తుపాకీకోసం. లోడ్ చేయబడిన తుపాకీ ఆ పెనుగులాటలో పేలింది. అదే క్షణంలో ఆ గదిలోకి వచ్చిన నౌకరు పెద్ద కేకతో విరుచుకు పడ్తున్న గిరిజను, శివం చేతిలోని తుపాకీని చూసి "హత్య, హత్య" అంటూ కేకలు పెట్టాడట!

"ఆ క్షణంలో నాకేమయిందో తెలియదు రఘూ. అంత ప్రాణ సమానంగా ప్రేమించిన గిరిజను గురించి నేనాలోచించలేదు. నా

**జరిగిన కథ — 8 :** గీతతో బజారుకెళ్ళిన జయంతిని పద్మిని అవమానిస్తుంది. గీత బర్త్‌డే రోజు జయంతి పాడిన పాట విన్న సుమిత్రమ్మ జయంతిని సంగీతం మాస్టారు దగ్గిర సంగీతం నేర్చుకోమని చెపుతుంది. జయంతి తనకిపుడు సంగీతంమీద ఆసక్తి లేదని చెపుతుంది. కారు యాక్సిడెంట్‌లో పద్మిని మరణిస్తుంది; హరికి కళ్ళు పోతాయి. యాక్సిడెంటులో గాయాలయిన మన్‌మోహన్‌కు తన రక్తం ఇస్తుంది జయంతి. జయంతి వ్యక్తిత్వం మన్‌మోహన్‌ను ఆకర్షిస్తుంది. జయంతి హరి సేవలలో కాలం గడుపుతూ ఉంటుంది. గీతను చూడవచ్చిన పెళ్ళివారు వాళ్ళ అబ్బాయికి జయంతి నచ్చినట్టు రఘునాధరావుకి ఉత్తరం రాస్తారు. జయంతి కథకు మొదటి బహుమతి వచ్చింది ఆమెను చూడను ఆమె అభిమానులు వచ్చారు. జ్వరం వచ్చి పడుకున్న జయంతిని మన్‌మోహన్ కిటికీలోంచి చూసాడు. మర్నాడు ఆ కిటికీ మూసి ఉండటం గమనిస్తాడు మన్‌మోహన్. జయంతి మన్‌మోహన్ ప్రేమను తిరస్కరిస్తుంది. జయంతి వివాహ ప్రసక్తి తెచ్చిన సుమిత్రమ్మతో తను హరి బావను పెళ్ళి చేసుకుంటానని చెపుతుంది. ఆ వార్త విని జయంతిపై మండిపడతారు రఘునాధరావుగారు.

కళ్లెదుటే నిలబడి ముఖమంతా కళ్లు చేసుకుని అమాయకంగా చూస్తూన్న జ్యోతిమీద పడింది నా దృష్టి. అంతే. దాని గురించి ఆలోచించాను. ఓ వైపు నౌఖరు ''హత్య, హంతకుడు'' అంటూ కేకలు పెడ్తున్నాడు. వాడి రూపంలో ఈ లోకమంతా నా వైపు వేలుపెట్టి అదే మాట అంటున్నట్లు భయం వేసింది. నేను హత్య చేశానా ? లేదు. నేను హంతకుణ్ణా ? కాదు. కానీ అలా ముద్ర వేయబడ్డవాణ్ణి !

మరుక్షణం జ్యోతిని తీసుకుని ఆ ఇంట్లోంచి బయటపడ్డాను. పోలీసుల కంట పడని చోట తలదాచుకున్నాను. పత్రికలన్నీ గిరిజ చావుబ్రతుకుల్లో వుందనీ, ఆమె మరణించటం ఖాయమనీ, నేనే హంతకుణ్ణనీ రాశాయి !

నా నవనాడులూ కృంగిపోయాయి. ప్రాణాధికమైన భార్య పోతూన్న దుఃఖం ఒక వైపు, ఆమెను నేనే హత్య చేశాననే అపవాదు కలిగించిన దుఃఖం మరోవైపు! బ్రతకాలనే ఇచ్ఛ నశించింది. కానీ జ్యోతి ? మా కంటి జ్యోతిగా, మా ఇంటి జ్యోతిగా మా జీవన జ్యోతిగా వెలసిన జ్యోతిని ఏం చేయను ? ఆమె కోసం నేను బ్రతకాలి. కానీ నేను నేమగా బ్రతకాలనే ఆశను వదలుకున్నాను. ఎందుకంటే నేను హంతకుణ్ణి. అన్యాయంగా నేను హంతకుడిగా ముద్ర వేయించుకున్నానన్న బాధ కంటే అభం శుభం తెలియని నా బిడ్డ జీవితమంతా ఓ హంతకుడి కూతురిగా హైన్యాన్ని అనుభవించాలే అన్నబావం నన్నమితమైన బాధకు గురి చేసింది. తండ్రిగా దానికి నేనేం చేయకపోయినా ఈ శిక్ష నుండి తప్పించటం నా కర్తవ్యం అనుకున్నాను. వెంటనే జ్యోతిని తీసుకుని తమిళదేశంలోని ఈ మారుమూల కుగ్రామానికి వచ్చి చేరుకున్నాను. నీకు గుర్తుండే వుంటుంది చిన్నప్పుడు మన ఎదురింటి మామ దగ్గర నేను సరదాగా తమిళం నేర్చుకున్నాను. అది ఈ విధంగా పనికి వచ్చింది. మొదట ట్యూషన్లు ప్రారంభించి రాను రాను చిన్న పాఠశాలగా అభివృద్ధి చేసి పొట్ట గడిచే మార్గం చూసుకున్నాను. పల్లెటూళ్లలో విద్య చెప్పే మాస్టారికున్న గౌరవం మరొకరికుండదు. ఆ కారణంగా ఏదో సుఖంగానే గడిచిపోయింది. గతానికి తెర వేసిన నేను జ్యోతిని 'జయంతి' అన్నాను. నేను 'సాంబ' అయ్యాను.

ఈ విషయాలేమీ జ్యోతికి తెలియవు. నేను హంతకుణ్ణని దానికి తెలియకూడదనే ఈ ఒంటరి అజ్ఞాత జీవితంలో కుమిలిపోయాను.'' అంటూ దుఃఖించాడు శివం.

''లేదు. శివా. నీవు హంతకుడివి కావు'' అన్నాను.

''ఆ మాట నీవూ, నేనూ అంటే సరిపోతుందా ?''






ఇటీవల శ్రీనివాస సాహితీ సమితి (హైదరాబాదు)వారి ఆధ్వర్యంలో డా. ఎల్లూరి శివారెడ్డి రచించిన 'పూలకారు' కావ్యావిష్కరణ సభ జరిగినప్పుడు తీసిన చిత్రం. శ్రీయుతులు డా. ఎల్లూరి శివారెడ్డి, కె. వెంకటేశ్వరరావు. డా.సి. నారాయణరెడ్డి, ఆవుల సాంబశివరావు, తుంగతుర్తి విశ్వనాథశాస్త్రిగార్లను చిత్రంలో చూడవచ్చు.

# ఈ రాగానికదే తాళం

''లేదు. నీవూ నేనే కాదు. లోకం కూడా అంది.''

''నిజమా !!!'' శివం ఆనందంతో వుక్కిరిబిక్కిరయ్యాడు.

''ఔను. గిరిజకు స్పృహ వచ్చేదాకా నీమీదే నేరం మోపబడింది. కానీ గిరిజకు స్పృహ తెలిసి నీవు నిర్దోషివని మరణ వాంఙ్మూలం ఇచ్చి చనిపోయింది. బహుశా తెలుగుదేశం విడిచాక నీవు ఆ తర్వాతి పత్రికలు చూడలేదేమో'' అన్నాను.

శివం సంతోషం మాటల్లో చెప్పలేనిది.

''పోనీలే రఘూ ఇన్నేళ్లూ బాధపడ్డా ఈ చివరి క్షణాల్లో ఈ విషయం నాకెంతో తృప్తి నిచ్చింది. కానీ నా బ్రతుక్కు, నా అజ్ఞాత జీవితానికి అర్థం, కారణం నా బిడ్డ జ్యోతి. కానీ దాని జీవితానికి సురక్షితమైన ఏ మార్గమూ చూపకుండానే నేను...! అందుకే నిన్ను పిలిపించాను. రఘూ, జ్యోతి...'' అంటూ కళ్ల నీళ్లు నింపుకున్నాడు శివం.

''శివా, మరచిపోయావా ? జ్యోతి ఎప్పటికైనా నా ఇంటికి రావలసిన పిల్లే. జ్యోతి నీ కూతురు కాదు. నా కోడలురా'' అన్నాను.

'' ఆ విషయం నీకింకా గుర్తుందా రఘూ !'' సంభ్రమంగా అన్నాడు శివం.

నవ్వాను.

''బాగుంది. మీ జాడ తెలియక ఆగానుగానీ లేకపోతే ఇద్దరు కొడుకులకూ ఒకేసారి పెళ్లి జరిపించి వుందును.''

''రఘూ, ఒకరోజు అనుకోకుండా ఓ ఆంగ్లపత్రికలో నీ ఫొటో చూశాను. 'ఆంధ్ర ప్రదేశ్ మైన్స్ ఓనర్స్ అసోసియేషన్' అంటూ ఏవో వివరాలిచ్చారు. ఆ విధంగా నీ అడ్రసు దొరికింది. నిజంగా నీ ఉనికి, నీ ప్రయోజకత్వం నాకెంతో సంతోషాన్ని కలిగించాయి. రఘూ, ఈనాడు నీవు లక్షలకు అధికారివి. ఇంత పేదవాడి కూతుర్ని ...

వాడి నోరు మూశాను.

''శివా ! ఈ లక్షలు నావి కావు. నీవి. నేను కేవలం వాని వుత్పత్తికి కారణమైన కార్మికుడి లాంటి వాణ్ణి. నా శ్రమకు ప్రతిఫలంగా నా కుటుంబం ఎన్నో భోగాలు అనుభవిస్తూనే వుంది. ఎప్పటికైనా ఆ సంపదంతా నీది. లేదా జ్యోతిది. ఎందుకంటే ఈనాటి ఈ సిరిసంపదలకు మూలం నీ పెట్టుబడి'' అన్నాను.

వాడిలో నే నాశించిన రియాక్షన్ రాలేదు. వాడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

''ఈ మాట అని నీ ఔదార్యాన్ని చాటుకున్నావు గానీ నీ మాటను నేనెలా అంగీకరిస్తాను రా ?''

''నీవు అంగీకరించినా, అంగీకరించకపోయినా నాకు బాధ లేదు. నీ కూతురుగా కాకపోయినా నా కోడలుగా ఆ సంపద మీద సర్వహక్కులూ జ్యోతివి.''

''రఘూ !!!'' సంతోషంతో తల మున్కలయ్యాడు మీ నాన్న.

''రఘూ, నీ కోరిక మంచిదే అయినా నీలోనే దాచుకో. ఎందుకంటే నా కూతురు నీ ఇంటికి సామాన్యమైన కోడలుగా రావాలనే నా కోరిక. 'ఈ సంపద నాది' అనే అహం పెంచుకునేకంటే 'సహృదయుల ఇంటి కోడలిని' అనే తృప్తిని నా కూతురు అనుభవించాలి.

ముఖ్యంగా నా గతం జ్యోతికి తెలియకూడదు. నేను నేరస్థుణ్ణి కాకపోయినా నేరస్థుడిగా ముద్ర పొడిపించుకున్న భయంతో పారిపోయి వచ్చిన పిరికివాడిగా నా తల్లి నన్నుచిన్న చూపుచూస్తే నేనుభరించలేను. ఆలోచితంగానో, అనాలోచితంగానో ఆ రోజు ఆ గాభరాలో అలా వచ్చేసినందుకు నా పిరికితనానికి నేనే సిగ్గుపడుతున్నాను. ఇప్పుడు నేను నిరపరాధినని జ్యోతికి తెలియజెప్పినా ఈ పిరికి ముఖం ఏమని జ్యోతికి చూపించను ?''

''మంచి అయినా చెడు అయినా కన్న కూతురి నుండి ఇలా దాచి వుంచటం మంచిది కాదు శివం. నీవేం నేరం చేశావని ? పిరికితనం నేరం కాదుకదా ? పైగా జ్యోతి శ్రేయస్సు కోసమే నీవు ఆలోచించావు'' అన్నాను.

''ఇప్పుడు ఆ విషయాలన్నీ జ్యోతికి చెప్పినందువల్ల జరిగే లాభమేముంది? చెప్పనందువల్ల నష్టం కూడా లేదుకదా ? నీ స్నేహితుడి కూతురిగా, నీ ఇంటి కోడలిగా జ్యోతి నీ ఇంట సుఖపడుతుందనే నమ్మకం నాకుంది. ఇవన్నీ తెలియకపోయినా ఫరవాలేదు. తెలియకూడదు కూడా.''

''తెలియజెప్పవలసిన పరిస్థితి వస్తే ?'' ప్రశ్నించాను.

నిట్టూర్చాడు శివం.

''పిల్లైనంతవరకూ ఆ స్థితి రానివ్వకు. అంతగా వస్తే . . కూతురి ముందు పిరికివాడిగా నిలబడలేని ఈ తండ్రి అభిమానాన్ని నా బిడ్డ సానుభూతితోనే అర్థం చేసుకుంటుందని నా నమ్మకం'' అన్నాడు.

ఆ మరునాడే నిన్ను నాకు అప్పగించి శివం కన్నుమూశాడు.

జయంతీ ! నా కోరికా, వాడి కోరికా కూడా నీవు ఈ ఇంటి కోడలివి కావడం. కానీ ఇలా మాత్రం కాదు. ఈ ఇంట్లో నీవు సుఖపడ్తావని మీ నాన్న నమ్మకం. సుఖపడాలని ఆశ. వాడి నమ్మకాన్ని, ఆశల్ని కూలదోయటం నాకిష్టంలేదు.

ఈ ఇల్లు నీది. ఈ ఆస్తి నీది. నీకెంతో అందమైన భవిష్యత్తు వుంది. మనూ నీకు తగినవాడుగానీ, జీవితంలో అన్ని అందాలూ, అన్ని ఆశలూ అడుగంటిపోయిన హరి కాదు.

ఇప్పుడు చెప్పు జయంతీ. హరిని ఎందుకొద్దన్నానో అర్థమైందా ? ఇంకా హరిని వివాహం చేసుకుంటాననే అంటావా ?''

'' ................ ''

''మాట్లాడవేమమ్మా ?''

''ఏం మాట్లాడమంటారు మామయ్యా. మా మామయ్యేనా ఇలా మాట్లాడుతున్నది అని ఆశ్చర్యంతో మాట రావటంలేదు.''

తెల్లబోయారు రఘునాథరావుగారు.

''ఎలా మాట్లాడాను ? అంటే .. అంటే ఇదంతా అబద్ధమనుకుంటున్నావా ? నేనేదో

ప్రతి వర్చస్సు రంగు వేరు వేరుగా ఉంటుంది

# లాక్మే క్యాలమైన్ మాత్రమే మూడు రంగులలో దొరుకుతుంది. మీవర్చస్సు కుసరిపోయేలాఅందు లోఒకటి.

**నేచురల్**
చామనఛాయవర్చస్సుకు




**లైట్**
తెల్లగా వుండేవారికి




**గోల్డు**
నల్లగావుండే వారికి




లక్మే క్యాలమైన్ మాత్రమే మూడు ఉజ్వలమైన రంగులలో వస్తుంది. నేచరల్, లైట్ మరియు గోల్డ్. ఈ రంగులలో ఒకటి మీకోసం... ఎందవల్ల నంటే లక్మేకు తెలుసు అన్ని వర్చస్సులు ఒకేలాగ వుండవని. లక్మేక్యాలమైన్ సులభంగా మృదు త్వాన్నిస్తుంది. ప్రీతియైన పరిమళము కలది. లక్మే క్యాలమైన్ ఎందవల్లనంటే మీ వర్చస్సుకు సరైన రంగు కావాలి మీ సానుకూల ముకొరకు చిన్న ప్యాక్‌లో దొరుకుతోంది.

## లాక్మే క్యాలమైన్

ప్రతి వర్చస్సుకు ఒక ఉజ్వలమైన రంగు.

L/120/TL/82

నిన్ను మభ్యపుచ్చాలని అసత్యాలు చెబుతున్నా నను కుంటున్నావా ?''

''లేదు. అది కాదు. ముందిది చెప్పండి. ఇప్పుడు, హరి బావను ఒద్దంటానని ఎలా అనుకున్నారు ?''

''ఇంత డబ్బూ, ఆస్తీ ... ''

అంతవరకూ గిగపట్టిన కన్నీరు వెల్లువలా బుగ్గల మీదికి వురికింది జయంతికి.

''ఏమిటి ! ఏమైందీ తల్లీ !?'' కంగారు పడ్డాడు రఘునాథరావుగారు.

''ఏమీ కాలేదు మామయ్యా. కేవలండబ్బు వల్ల మనుషుల విలువలు, మనసుల్లోని మమతలు మారిపోతాయని మీరు భావించటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. అంతే. మీరేనా ఇలా మాట్లాడేది ! నేను నమ్మలేకపోతున్నాను. బహుశా అది మీ అభిప్రాయం కాదు. నా అభిప్రాయమని మీరు పడే అపోహ. ఏ దిక్కూ లేని దాన్ననీ, పైసా గతి లేనిదాన్ననీ,కుంటో, గుడ్డో ఎవరో ఓ మొగుడు దొరికితే చాలనీ కక్కుర్తి పడ్డానని అనుకున్నారా మామయ్యా ? ఇప్పుడు నాకు లక్షలు రాబోతాయని తెలిసి, ఆ లక్షలకు తగిన మొగుడు ఈ గుడ్డివాడు కాడని కాల దన్నుతానని అనుకున్నారా మామయ్యా ! నన్ను సరిగ్గానే అంచనా వేశారు మామయ్యా ! నన్ను సరిగ్గానే అంచనా వేశారు.'' జయంతి గొంతుక కోపంతో దుఃఖంతో డగ్గుత్తిక పడింది.

''అది కాదు జయంతీ. నీకు నీ తల్లి దండ్రుల విషయం తెలపాలి...''

''నా తల్లిదండ్రుల విషయం నాకు తెలియ కూడదని ఆంక్ష వున్న విషయం మీరే చెప్పారు.''

రఘునాథరావుగారు గతుక్కుమన్నారు.

''నాన్న ఆజ్ఞ ప్రకారం మన్‌మోహన్‌కు కాబోయే భార్యగా అనుకుంటూ ఇంటికి వచ్చిన మాట నిజమే. కానీ తొందరలోనే అతనికి నా పట్ల ఏ మాత్రం ఇష్టం లేదని తెలిసింది. ఆ వివాహం ఎడల నాలో ఎలాంటి అనుభూతులూ ప్రారంభం కాకముందే ఈ విషయం తెలిసినందు

# ఈరాగాని కదే తాళం

వల్ల నేను పెద్దగా బాధపడలేదు. ఆ బంధం అలా ఆదిలోనే తెగిపోయింది. అంతలోనే పద్మిని అక్కయ్య మరణించింది. హరిబావ సహృదయం, సంస్కారం, నిరాడంబరత్వం, శ్రమ జీవనం నన్నెంతో ఆకర్షించాయి. బావకు ఇల్లాలినై, కళ్లనై నా జన్మ ధన్యం చేసుకోవాలని...

మామయ్యా మీరన్నట్లు నాకోసం ఎదురు చూస్తూ లక్షలుంటే వుండనీగాక. మీరు మరింత శ్రమించి నాకోసం కోట్లు కూడబెట్టనీ గాక. డబ్బుతో మభ్యపెట్టి నా మనసు మాత్రం మార్చలేరు.'' చటుక్కున లేచి మెట్ల వైపు చరచరా నడిచింది జయంతి.

''ఇదిగో, నీ ఆస్తితోపాటు నిన్నిక్కడినుండి పంపించనయినా పంపిస్తానుగానీ హరిని మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ...''

అప్పటికే జయంతి మెట్లు దిగిపోయింది.

## 27

మన్‌మోహన్ హఠాత్తుగా శాంతినికేతన్ వెళ్లిపోయాడు. అడిగినవాళ్లకు కొంత ప్రవేశం వున్న 'చిత్రకళ'లో కోచింగ్ తీసుకోవాలని చెప్పేడు. ''ప్రాక్టీస్ పెట్టబోయే ఈ సమయంలో చిత్రకళలో కోచింగ్ ఏమిటి ?'' అని అడిగిన తండ్రికి ''ప్రాక్టీస్ మొదలెట్టాక ఇలాంటివి కుదరవు. ఒక్క ఆర్నెల్లు. ఆ తర్వాత మీరు వెళ్లమన్నా నాకు కుదరదు'' అన్నాడు.

* * *

జయంతి మానసికంగా బాగా కృంగి పోయింది. నిరాశ ఆమె నరనరాన్నీ నిర్వీర్యం చేసింది. శ్రీహరి, రఘునాథరావుగారు జయంతి కోర్కెను మన్నించలేదు. ప్రేమ విషయంలో అనర్హతలాగే అధికృత కూడా ఒక అడ్డంకి అవుతుందా ? హరి బావ అంటే తన కెంత ఇష్టం ! అతని జ్ఞాపకమే తన హృదయానికి ఓ మధురభావ పీఠిక. అతనంటే తనకుండేది

### ఆ డ ది

సృష్టికి మూలం ఆడది
భుక్తికి మూలం ఆడది
కట్నం తీసుకోవద్దనే కన్య ఆడది
కట్నం ఇవ్వలేని తల్లి ఆడది
కట్నం కొసిరే అత్త ఆడది
ఈ కన్య, తల్లి, అత్త ఆడది
వర కట్నానికి మూలం ఆడది
ఇంటికి దీపం ఆడది
ఇంటిని పెంపు చేసేది ఆడది
ఇంటిని రెంటిని చేసేది ఆడది
ఆడది ఏడ్చిందంటేనే
ఇంకో ప్రపంచ యుద్ధానికి
శంఖం పూరించినట్లే !

— యన్మనగండ్ల సాయిరాం

జాలీ, సానుభూతీ కాదనీ ప్రేమారాధనలనీ అంటే ఎవరూ నమ్మరేం ! జాబిలి చుట్టూ వెన్నెలా, పూవు చుట్టూ పరిమళమూ వున్నట్లు 'ప్రేమ' చుట్టూ ఈ తీపి బాధలు తప్పవేమో !

ఒక విధంగా ఈ పరిణామం ఈ కుటుంబంలోని వ్యక్తుల ఔన్నత్యాన్ని చాటుతోంది. ఈ కుటుంబానికి తన అవసరం ఎంతో వుంది. అంధుడైన వ్యక్తికి భార్య లభించే అవకాశం వుంది. అయినా ఆ అన్నింటినీ ఎడం చేత్తోతోసేస్తున్నారు. తన భవిష్యత్తు చీకటిమయం కారాదని తన నిక్కడి నుండి అంపకం పెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఎంత సహృదయులు! వారి సహృదయత, ఉదాత్తత అర్థమయ్యే కొలదీ తన కోరిక మరింత బలీయం అవుతోంది. తన కోరిక బలీయం అయ్యేకొలదీ వారి పట్టుదల మరింత బిగిసిపోతోంది.

ఆ రోజు చివరిసారిగా పిలిపించారు రఘునాథరావుగారు.

"చూడమ్మా జయంతీ. ఆఖరుసారిగా అడుగుతున్నాను. ఈ కుటుంబం మీద నీ కింత అభిమానం వుండటం మా అదృష్టం. కానీ అది నీ శ్రేయస్సుకే భంగం కలిగిస్తుందంటే నీ అభిమానం మా కక్కర్లేదంటాను. హరి గురించి నీవేమీ విచారించకు. వాడికి మేమున్నాము. నీవు నీకు నచ్చిన మరో వ్యక్తిని చేసుకో. ఈ ఇల్లు నీది. మేము నీ వాళ్లం. నీకు ..."

"మామయ్యా"

జయంతి ముఖం చూసి ఆగిపోయారు.

"మామయ్యా, ఆ రోజు నాన్నకేం చెప్పారు ? నన్ను మీ కోడల్ని చేసుకుంటానన్నారు. ఈ ఇంటి ఇల్లాలిని చేస్తానని నన్ను తీసుకు వచ్చారు. ఇలా మాట తప్పటం ..."

"జయంతీ ! నీవు అన్నది నిజమే. కానీ మమ్మా భార్యగా ఈ ఇంటి కోడల్ని చేస్తానన్నాను గానీ ఇలా కాదు. ఏది ఏమైనా మీ నాన్నకు మాట ఇచ్చినా, నిన్ను ఈ ఇంటికి తీసుకు వచ్చినా అదంతా కేవలం నీ మంచి కోసమే. మాటకంటే నీ శ్రేయస్సు నాకు ముఖ్యం. నా మాట పోయినా ఫరవాలేదు. నీకు మంచి జరగడమే నాకు కావలసింది. అయినా ఇన్ని మాటలెందుకు ! నీకో సంబంధం చూశాను. అన్ని విధాలా నీకు తగినది. నిన్ను చూసు కోడానికి ..."

జయంతి లేచి వచ్చేసింది.

ఆరోజే జయంతి ప్రయాణం.

జయంతి కోర్కెను రఘునాథరావుగారు మన్నించలేదు. రఘునాథరావుగారి సలహాను జయంతి పాటించలేదు.

రఘునాథరావుగారు ఆస్తితోపాటు జయంతిని పంపదలచుకున్నారు. జయంతి ఆస్తి తీసుకోకుండానే వెళ్లడానికి సిద్ధమైంది.

ఆరోజే జయంతి ప్రయాణం.

జయంతి తన పాత ట్రంకు పెట్టె, దాన్లో తెచ్చుకున్న తన తాలూకు సామాను మాత్రం తీసుకుంది. తన కథలకు వచ్చిన పారితోషికాన్ని మాత్రం బ్యాంక్‌నుంచి డ్రా చేసుకుంది.

అంతవరకూ తటస్థంగా వుండిపోయిన సుమిత్రమ్మతో చివరి ప్రయత్నం చేసింది జయంతి.

"స్త్రీ హృదయం నాకు తెలుసు జయంతీ. కానీ నేను నిన్ను ప్రోత్సహిస్తే లోకం దృష్టిలోనే కాకుండా మీ మామయ్య దృష్టిలో, హరి దృష్టిలో కూడా స్వార్థపరురాలి నవుతాను. అంధుడైన కొడుకు నుద్ధరించటం కోసం ఓ అమాయకురాలి జీవితాన్ని నాశనం చేశానన్న అపవాదు నేను భరించలేను. అయినా జయంతీ, హరి తల్లిగా కాకుండా ఓ స్త్రీగా చెబుతున్నాను. నీ మనసును నేను అర్థం చేసుకున్నాను. కానీ ఆ నీ 'ప్రేమ భావన'లో తప్ప ఇక ఏ విషయం

# ఇవేమన పద్యాలు




## ఈ రాగాని కదే తాళం

లోనూ హరి నీకు తగినవాడు కాదు. ఎంతో ఉజ్వలమైన భవిష్యత్తు నీ ముందుంది. శ్రమపడి మనసును కొంచెం అదుపు చేసుకోగలిగితే నీకు సుఖపడే అవకాశాలు చాలా వున్నాయి."

జయంతి భారంగా నిట్టూర్చింది.

ఏ గూటి చిలుక ఆ పలుకే పలుకుతుంది. అత్తయ్య మాత్రం ఇంతకు భిన్నంగా మాట్లాడుతుందని ఆశించటం తన అవివేకం. అంతే.

జయంతి తయారైంది. తయారై తన గదిలోంచి బయటకు రాబోయింది. "ఉత్తరం" అంటూ తెచ్చి ఇచ్చాడు రంగా.

[ఇంకా వుంది]




## ఎ. ఎస్. – రాజమండ్రి

అక్కా. మీరు రాజకీయ రంగంలో రాణించగలరేమో ?

★ లేదు తమ్ముడూ నాకు పౌరుషం ఎక్కువ.

## పి. ఫ్లారెన్స్ – మోగల్లు

అమాయకుడు తన జీవితంలో ఎదురైన దురదృష్టం గురించి మీ సలహా అడిగితే– కోపంగా వున్న వాడిమీద కారం జల్లినట్లు సమాధానం యిచ్చారు (9–11–83) మీ సమాధానం– ఏడ్చేవారిని ఓదార్చినట్లుండాలి... కాని కుమిలిపోయేట్లు చేస్తే ఎలా ?

★ అలాగా పిల్లి ఫ్లారెన్సు సిస్టర్ ! ఏడ్చే వాడిని ఏడ్చి ఏడ్చి వూరుకోమనీ చెప్పవచ్చు. పిచ్చి ఏడుపాపు ! అని కసిరి నోరు మూయించి– పరిస్థితి అవగాహన చేసుకునేలాగా చేయవచ్చు. ఓదార్పు ఎక్కువైనకొద్దీ– బాధ కూడా ఎక్కువ అవుతుంది

## పి. ఎస్. వి. – నెల్లూరు

నా వయస్సు 18 సం. నేను చిన్నప్పటి నుంచి కథలు రాయడం అంటే ఇష్టపడతాను. మా పెద్దలకి కిట్టదు.

★ నీ కబుర్లు వింటూంటే విలియమ్ సారోయిన్ చిన్ని కథొకటి గుర్తుకొస్తూంది. ఓ ఇంజన్ డ్రయివరుకి ఓ తొమ్మిదేళ్లవాడు తగులుతాడు. పసివాడు మరీ దీర్ఘాలోచనా పరుడుగా వుండిపోవడం గిట్టక "పోనీ ఓ సిగరెట్టు కాలుస్తావేమిటి ?' అడుగుతాడు ఇంజన్ డ్రయివర్.

కుర్రాడు నిట్టూర్చి "మానేసి చాలా కాలమైంది !" అంటాడు. అలా వుంది– మీ కథానికా రచనా వ్యాసంగ పరిత్యాగ ధోరణి!!

## డి. బి. - విశాఖపట్నం

ప్రశ్నావళి పాఠకులందరిదీ. అంతా చదువుతారు. అంచేత ఆ శీర్షిక అందరి సమస్యలు తీర్చేదిగా వుండాలి. మీరు కేవలం స్త్రీ పక్షపాతిగా జవాబులిస్తూ మంచికి చెడ్డకి పురుషులని విమర్శిస్తున్నారు. తద్వార ప్రశ్నావళి పదానికర్థం లేకుండా చేస్తున్నారు. మీరెలాగూ స్త్రీ జనోద్ధరిణిలు కాబట్టి మీ శీర్షికను – స్త్రీ సమస్య–నా జవాబు అన్న పేరును సజెస్టు చేస్తున్నాను. మనస్ఫూర్తిగా ఆలోచించండి.

★ ఆలోచించాను. కాస్త విశాఖపట్నం నీటికి వేపకాయంత వెర్రెత్తించే గుణం వుందా అన్పించిందంతే ! ప్రశ్నావళి చిట్కా సలహాల శీర్షిక అని నేనెప్పుడూ అనలేదు. అడగండి ! చెప్తానన్నానంతే !!...మీరికపై అలాంటి సలహా శీర్షికలున్న వారి కాలమ్‌కే కార్డు కర్చు చేయండి.

## వి.జి.ఆర్; సి ఇ.ఎల్ – చేబ్రోలు

అక్కయ్యా, అమ్మాయిని ప్రేమించడం సులువంటాను. కాని అమ్మాయి చేత ప్రేమించబడడం కష్టం అంటాను. ఏమంటారు ?

★ కనిపెట్టావయ్యా సత్యాన్ని–కొలంబస్ అంటూ సంతోషపడి పోతున్నాననుకో.




## కె. బి. హెచ్. – భీవండీ

ఎవరినేనా ఏదేనా అడగాలన్నా మొహమాట పడడం, భయపడడం బాగా అలవాటై పోయింది. ఎంత ధైర్యంగా అడగాలనుకొంటాను సాధ్యంకాదు. దీనికి మార్గం చెప్పండి ?

★ ఎదుటివారి ముఖం చూస్తూ అడక్కండి ! వాళ్ల ముఖ భావాలు తక్షణం తెలియవు కనుక – అంత పిరికితనం అనిపించదు.

నెలకు నా సంపాదన రు. 500. ఎంత కర్చులు తగ్గించినా నయాపైస మిగలడం లేదు. డబ్బుకి విలువనిచ్చే తల్లి తండ్రులకి – దీనివల్ల దూరం అవుతున్నాను

★ రూపాయి విలువ ముప్ఫయి ఐదు పైసలుందని మీ తల్లి తండ్రులకి తెలియదా ?! తెలిస్తే అయ్యో 500ల్లో ఎలా బ్రతుకుతున్నాడో అనుకుంటారేగాని ఏం మిగిల్చాడని అడగరు...

## కె. డి. ఎస్. – గుంటూరు

ఆడవాళ్లకు మగవాళ్లతో సమాన హక్కులు కావాలని అంటున్నారు. అంటే, ఆడవాళ్ల మగవాళ్లతో తిరగడమే కదా ?

★ ఏం చదువుకున్నావయ్యా ధ్రువ శ్రీనివాసా–ఇలాంటి ఆలోచనలున్నాయి నీకు ?... మగవాళ్లట్టే తిరుగుబోతులనీ,ఆ హక్కు ఆడాళ్లకీ కావాలనీ కాదు, సమాన హక్కుల అర్థం. అలాంటి హక్కులు – కావాలంటే ఎవరికి వారే తీసుకోకలరు – ఆడదాన్ని సాటి మనిషిగా, సమవ్యక్తిగా గుర్తింపు కోసమే–సమాన హక్కుల ఆవస్యకత.

## బి. ఎస్. జి. – అర్మూరు

నేటి విద్యార్థులు తమ తమ ధర్మాలను మరిచిపోయి చెడు వ్యసనాల కలవాటు పడుతున్నారు. ఇలా అయితే దేశం ముందడుగు వేయడం అసాధ్యం కదా ?

★ దేశం సంగతలా వుంచండి మనుషులుగా వారి భవిష్యత్తు గుంట పువ్వులు పూసేస్తుంది. ఆ సంగతి వారికి గ్రహింపుకి రావాలని కోరుకోవాలంతే – మనం చేయగల్గినది.

## కళ్యాణి – బెండమూర్లంక

సీతాదేవి కొన్ని నెలలపాటు రామునికి దూరంగా వుందని, శీలవతినని రుజువు చేసుకోడానికి అగ్ని పరీక్ష పెట్టినప్పుడు – ఆమెకూడా రాముడిని - మీరూ శీలవంతుడినని రుజువు చేసుకొండి అని అంటే ? రాముడేం చేసేవాడు ?

★ కథేలేదు. అగ్గిలో దూకేవాడు;నోట్లో నాలుక వుండడం ఆ రోజుల్లో పతివ్రతల లక్షణం కాదు – అందుకే సీతమ్మగారు ఎదురు ప్రశ్న వేయకుండా - ఒళ్ళు మండుతున్నా, కిమ్మనక మంటలో దూకింది. ★






పరంధామయ్య కూర్చొని ఆలోచించు కొంటున్నాడు. భార్య కోరిక తీర్చలేని తన అసహాయతకు తన్ను తనే నిందించుకొంటున్నాడు. ఈ అసహాయతకు, ఈ దౌర్భాగ్యానికీ కారణం ఎవరో, ఎవరిని నిందించాలో తెలియడంలేదు. అతని ఆలోచనలు అయాచితంగా రెండు రోజులు వెనక్కు వెళ్ళాయి.

నవమాసాలు మోసి, కొడుకులను ప్రయోజకులుగా చేసిన పరంధామయ్య భార్య జానకి పరంధామయ్యతో ఇలా అన్నది —

"ఏమండీ ! మన కొడుకులు ప్రయోజకులైనారు కదండీ ! ఇంక మనకు పరవాలేదండీ ! కానీ నాకు ఈ వయసులో ఒకే ఒక్క కోరిక కలుగుతున్నాదండీ ? అన్నది."

"నీకా ! జానకీ! కోరికా! ఈ సంసారాన్ని ఇన్నాళ్ళబట్టీ నడుపుతూ, మన పరిస్థితులు తెలుసుకొనికూడా నీవు ఏనాడూ ఏ కోరికా కోరలేదు. ఈనాడు కోరుతున్నావు ఏమిటి ?" అన్నాడు పరంధామయ్య.

"అదికాదండీ! ఈ వయసులో పట్టుచీర కట్టుకొని, పండు ముత్తైదువలా ఉండాలని ఉందండీ. మన అబ్బాయిలను అడిగి నాకు చీర కొనిపెట్టండి చాలు" అన్నది ఆ రోజు.

తనా బడిపంతులుగా చేసి రిటయిర్ అయ్యి మూలన కూర్చున్నవాడు. కొడుకులను అడగాలంటే సిగ్గు! ఎలా? తన భార్యకోసం ఆఖరుకు పెద్దకొడుకు ప్రసాద్‌ను అడిగాడు. "ఓరే ప్రసాద్ మీ అమ్మ పట్టుచీర కావాలంటోందిరా! నేను కొందామంటే నా చేతిలో డబ్బుండదు. అందుకని నిన్ను అడగివలసి వస్తోందిరా" అన్నాడు.

"అమ్మకా! ఈ వయసులోనా! పట్టుచీరా! మీకేమైనా మతిపోయిందా నాన్నా! అయినా పట్టుచీరంటే ఎంత తక్కువ ఆయినా అయిదు వందలు లేనిదేరాదు. చూస్తూ ఎలాగకొనేది ? నాకూ పెళ్ళాం, పిల్లలు ఉన్నారు కదా! లేకపోతే కొందును. అయినా తర్వాత ఎప్పుడో చూద్దాంలే" అన్నాడు ప్రసాద్. రెండోకొడుకు సురేష్ వద్దకు వెళ్ళి అడిగితే అన్నాడు, "అదేంటి నాన్నగారూ! మా దగ్గరేదో ఉన్నట్లు మాటాడుతారు, మేమేదో దాచుకొన్నాం అన్నట్లుగా! మా వద్ద ఏమీలేదు. నా భార్య సంవత్సరం నుంచీ అడుగుతోంది తనకు "నెక్లెస్" కొనమని. కానీ డబ్బుల్లేక కొనలేదు. ఇప్పుడు అమ్మకు పట్టుచీరా! తర్వాత చూద్దాంలెండి అయినా" అన్నాడు.

కొడుకుల సమాధానాలతో బుర్ర తిరిగిన పరంధామయ్య మరి అడగడం మానేసాడు.

పెళ్ళాం, పిల్లలు అంటున్నాడు కదా పెద్దకొడుకు. వాళ్ళ చిన్నప్పుడు నేనుకూడా నాకు పెళ్ళాం అంటే ఇష్టమని, వీళ్ళ కోరికలు తీర్చడం మానేసి దాని కోరికలు తీరిస్తే ? వీళ్ళ

# పట్టుచీర

గతి ఏమిటి అవునో ఒక్కసారి ఆలోచించుకొంటే?

కన్నకొడుకు అంటే ఎంతో ప్రేమగా చూసి, తాను ఒకరోజు తింటూ, ఒకరోజు తినక వీళ్ళకు చదువు చెప్పించిన తరువాత, అమ్మ కోరిక తీర్చరా అంటే, నా పెళ్ళాంకీ కొనలేదు అంటాడా! అంటే వీడికి అమ్మ కంటే పెళ్ళాం ఎక్కువన్న మాట. వీళ్ళేదో ముసలితనంలో ఉద్ధరించేస్తారనుకోవడం పొరపాటు. ఈనాడు ఇద్దరు కొడుకులూ మంచి పొజిషన్‌లో ఉన్నారనుకొన్నా ఏమి ప్రయోజనం? ఒకడికి సంసారం, మరొకడికి పెళ్ళాం.

ఇలా ఆలోచిస్తూ ప్రక్కనున్న మంచంమీద నడుం చేరవేసాడు. ఈసారి అతన్ని ఆలోచనా లోకంలోకి పోనివ్వకుండా కోడళ్ళ సంభాషణ ఆపుచేసింది. వింటూ కూర్చున్నాడు.

"ఈ వయసులో పట్టుచీరలేమిటి? ఏ నారచీరో కట్టుకొని, జపమో, తపమో, చేసుకొంటూ మూలన కూర్చోక, పట్టుచీరలు కావలసివచ్చాయా వీళ్ళకు" చిన్నకోడలుతో అంటున్నది పెద్దకోడలు.

"ఇంకా నయం! పట్టుచీరతో సరిపెట్టే సారు. పోనీ, అత్తగారు అని కొన్నా, రేపు "నెక్లెస్" కావాలంటారు. ఇక్కడేమైనా డబ్బులు రాసులు పోసుకు కూర్చున్నామనుకున్నారో, ఏమో మరి" చిన్నకోడలు మాటలు ఇవి. ఆ మాటలు వింటూ తన భార్య జానకి కోరిన కోరిక ప్రభావం ఎలా పాకిందో ఆలోచించ సాగాడు. అతని ఆలోచన అతని పిల్లల చిన్నప్పటి నాటి మీదకు మళ్ళింది.

వాళ్ళు చిన్నపిల్లలుగా ఉండేటప్పుడు, తాను మాష్టరుగిరీ చేస్తున్నప్పుడు, తను తెచ్చే ముష్టి మూడు వందలుతో సంసారాన్ని ఎంతో గుట్టుగా నడిపి, పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించిన తల్లి వారికీనాడు అక్కరలేకపోయింది.

చిన్నప్పుడు తను నెలాఖరురోజులలో ప్రసాద్ పదవతరగతి పరీక్షకు ఫీజు కట్టడానికి డబ్బులేకపోతే, ఏ స్త్రీ తీయని మంగళసూత్రం తీసి తాకట్టుపెట్టి, వాడికి ఫీజు కట్టిన సంగతి వాడు మర్చిపోతున్నాడేమో? ఎంత కృతఘ్నులురా మీరు? అయినా తనదే పొరపాటు. అవసానదశలో కొడుకులు ఏదో ఉద్ధరించేస్తారనుకొని, ఒకరోజు తినక వీరికి పెట్టడమే తప్పు. ఇలా ఆలోచించుకొంటూ ఉండగా తలుపుకొట్టిన శబ్దం అయింది. అది విని గతంలోంచి వర్తమానంలోకి వచ్చి, గడియ తీసారు. ఆఫీసులు వదిలేసారు లాగుంది ప్రసాద్, సురేష్ వచ్చేరు.

పరంధామయ్య లోపలకు వెళ్ళి లాల్చీ తొడుక్కొని బయటకు బయల్దేరుతుండగా పెద్ద కొడుకు గదిలోంచి వినబడుతున్న మాటలు విని ఆగిపోయాడు.

"శుభా! మన అబ్బాయికి కాన్వెంట్‌లో సీటు వచ్చింది. అబ్బబ్బ! ప్రాణం పోయిందనుకో వాడికి సీటు వచ్చేసరికి. అయిదు వందలు "డొనేషన్" ఒకటి. ఏం చదువులో ఏమిటో? ఇదిగో ఈ వెయ్యిరూపాయలూ తీసుకొనివెళ్ళి బీరువాలో పెట్టు. ఎరియర్స్ డబ్బూ అవీ వచ్చాయి. సాయంకాలం నీకు కావలసినవి కొంటాను." అంటున్నాడు. సరేలే అనుకొని గడియ తీసాడు పరంధామయ్య బయటకు వెళ్ళడానికి. ఇంతలో ఇటుప్రక్క చిన్నకొడుకు గదిలోంచి వస్తున్న మాటలువిని ఆగిపోయాడు.

"ఇదిగో క్రిందటినెల అడిగావుగా "నెక్లెస్" ఇంద. ఏడువందల యాభై రూపాయలు అయింది దీన్ని చేయించడానికి" అంటున్నాడు చిన్నకొడుకు సురేష్.

"ఏమండీ! బజార్లోకి కొత్తరకం చీరలు వచ్చాయట కొనండీ!" గోముగా అంటోంది చిన్న కోడలు.

"అలాగేలే మళ్ళీ నెల చూద్దాం. అదిసరే గానీ నీవు త్వరగా తయారవ్. సినిమాకు పోదాం" అంటున్నాడు. మరింక వినడానికి మనస్కరించక వీధిలోకి నడిచారు పరంధామయ్య.

అతనికేమీ తోచడంలేదు. అయిదు వందలు పెట్టి భార్యకు పట్టుచీర కొనడం ఎలా? పోనీ తనేమైనా ఉద్యోగం సంపాదిద్దామంటే, తనకు శక్తులన్నీ హరించి మూలాన పడ్డాడు. తనకు ఎవడు ఇస్తాడు ఉద్యోగం? ఇలా ఆలోచిస్తూ వెళ్ళిపోతున్నాడు. మనశ్శాంతికోసం బయటకువస్తే ఇక్కడా ఈ ఆలోచనలే అని ఇంటికి తిరుగుముఖంపడుతూ అనుకొన్నాడు. రాత్రి పడుకొనే ముందు జానకి అడిగింది మళ్ళీ—

"ఏమండీ! మన అబ్బాయిలు ఏమంటున్నారు" అని.

చెప్పడానికి తడబడిపోతున్నాడు పరంధామయ్య.

"అలాగే కొంటాను అన్నారే, మీరు చూసుకొని" అన్నాడు.

"అయినా వాళ్ళను మరి అడగకండి. కొంటేకొంటారు లేకపోతే లేదు. వాళ్ళ అవసరాలు వాళ్ళకుంటాయి. ఒక తల్లిగా వాళ్ళచేత లేదనిపించుకోవడం అవమానంగా ఉంటుంది" అంది.

"లేదు జానకీ! ఈనాడు వాళ్ళ ఈ స్థితికి కారణం నీవే అన్న కృతజ్ఞత వాళ్లకు ఉంది. తప్పక కొంటారు" అన్నాడు ముఖం ప్రక్కకు తిప్పుకొని.

"సరేలెండి" అని అటు ప్రక్క తిరిగి పడుకొంది జానకి.

ఎలాగయినా వాళ్ళను అడిగి కొనాలని నిర్ణయించుకొన్నాడు. పెద్దకొడుక్కు ఏరియర్స్ డబ్బూ అవీ వచ్చేయంటున్నాడు కదా అందులోవి అడగాలి అని నిశ్చయించుకొని నిద్రపోయాడు.

మర్నాడు అడిగితే పెద్దకొడుకు "నా పిల్లాడికి కాన్వెంట్‌లో సీటువచ్చింది. వాడికి డబ్బుకట్టాలి. ఆ ఏరియర్స్ డబ్బు దానికి సరిపోతుంది. అయినా ఈ వయసులో పట్టుచీర లేమిటి నాన్నా! అడిగిన దానికి బుద్ధుండకపోతే మీకైనా ఉండొద్దా?" అడిగాడు ప్రసాద్.

రెండ్రోజులు అలా గడిచిపోయాయి. ఎక్కడ ఏ ఆధారము దొరక్క ఇంటికి వచ్చి జానకికి తన అసహాయతను వెళ్లడిద్దామనుకొన్నాడు పరంధామయ్య. జానకి వద్దకు వెళ్ళి "జానకీ" అని పిల్చాడు. లేవలేదు. వంటిమీద చేయివేసి చూస్తే చేయి చురుక్కుమంటోంది. వెంటనే పెద్ద కొడుక్కు కబురు పంపి, వెళ్ళి డాక్టర్‌ను తీసుకు వచ్చాడు. డాక్టర్ వచ్చి "ఇంజక్షన్" చేసి మాత్రలు ఇచ్చి వెళ్ళాడు. పెద్దకొడుకు వచ్చి డాక్టర్ వ్రాసి ఇచ్చిన మాత్రలు తేవడానికి వెళ్ళాడు. తెచ్చేడు. సాయంత్రం దాకా స్పృహలో లేని జానకి సాయంకాలం కన్ను తెరిచింది.

"ఏమండీ! నాకేదో భయముగా ఉందండీ", తన బాధను చెప్పి బాధతో కనులు మూసుకొంది.

"జానకీ! నేను అశక్తుణ్ణి. నీ కోరిక తీర్చలేకపోయాను" అందామనుకొన్న పరంధామయ్య జానకి ముఖంలోకి చూసాడు. ఇందాక మూసిన కన్ను మరి తెరువబడలేదు.

"జానకీ! నన్ను వదిలి వెళ్ళిపోయావా?" అన్న పొలికేక వినిపించింది ఇంట్లో వాళ్ళకు. ప్రసాద్, సురేష్ వచ్చి ఆమె అంత్యక్రియలకు సన్నాహాలు చేసే పనిలో ఉండిపోయారు. ఆ సందడిలో ఎవరికీ కనిపించని పరంధామయ్యను ఎవరూ పట్టించుకోలేదు. అన్ని సన్నాహాలు పూర్తిచేసి పరంధామయ్య కోసం ఎదురు చూస్తుండగా, చేతిలో పాకెట్‌తో వచ్చాడు పరంధామయ్య. పాకెట్ విప్పి అందులోంచి "పట్టుచీర" తీసి పాడిమీద ఉన్న జానకి "శవం" మీద కప్పాడు. కప్పి, బాధ నిండిన హృదయముతో "జానకీ! ఇన్నాళ్ళూ నీ కోరిక తీర్చలేనందుకు క్షమించు. నీవు ఆనాడు ఏ తాళిబొట్టు తాకట్టు పెట్టి నీ కొడుక్కు విద్యాబుద్ధులు నేర్పించావో, అదే తాళిబొట్టు అమ్మి, నీకు ఈ "పట్టుచీర" తెచ్చాను. నాకు నీ శవం మిగిల్చావా జానకీ! ఇదిగో నీవు అడిగిన పట్టుచీర. చూడు జానకీ" అన్నాడు.

కానీ, పట్టుచీర చూసేందుకు ఆమె ఉంటేగా.





## డా॥ శివాజీకి 'జాన్‌దాల్వీ' అవార్డు

ప్రజలను చైతన్యం గావింపడానికై జరిపిన ఉత్తమ కృషికి గుర్తింపుగా తెలుగుదేశం పార్టీ నాయకులు డా॥ యలమంచలి శివాజీకి ప్రతిష్టాకరమైన సంస్థ నుండి అవార్డు లభించింది. ప్రజాస్వామ్య పరిరక్షణకొరకై శిక్షణా కార్యక్రమాలు నిర్వహించే లెస్లీషానె కార్యక్రమాల నిర్వాహక సమితి ''జాన్‌దాల్వీ'' అవార్డును ఆయనకు ఇవ్వాలని నిర్ణయించింది. గత పలు సంవత్సరాలుగా శిక్షణా కార్యక్రమాలలో పాల్గొనిన 10 వేల మందిలో ఈ అవార్డుకై ఆయనను ఎంపిక చేశారు. వీరి శిక్షణా కార్యక్రమాలలో 1969 మేలో డా॥ శివాజీ శిక్షణ పొందారు. మహారాష్ట్ర గవర్నర్ శ్రీ లతిఫ్‌నుండి అవార్డును మే 16 వ తేదీన బొంబాయిలో స్వీకరిస్తారు. అవార్డు నిర్ణయక కమిటీలో శ్రీ పాల్కీవాలా, శ్రీ మసానీ, శ్రీ జె. ఆర్. డి. తాతా, శ్రీ ఎం. ఆర్. పాయి వంటి ప్రముఖులున్నారు. ★









# స్వప్నభంగం

## సీరియల్

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

( గత సంచిక తరువాయి )

చిలకలూరిపేటకు బస్సు ప్రయాణం —

రామానుజస్వామీ పేరిందేవీ కూతురిని అల్లుడినీ ఆదరంగా చూచారు —

సంప్రదాయానుసారం వైష్ణవ పూజలూ వగైరా జరిపించి శ్రీమంతానికి ఊళ్లో అందరినీ పేరంటానికి పిలిచారు. రేపు శ్రీమంతమనగా అకస్మాత్తుగా హైదరాబాదు నుండి లక్ష్మణ మూర్తీ, వైదేహి వచ్చారు.

పేరిందేవి పరమానంద భరితురాలైంది.

తిరుపతి వెళ్లినప్పుడు కూడా పేట మీదుగా వెళ్తూ ఆగలేదు.

లక్ష్మణమూర్తయితే అసలు రానేరాడు.

ఈసారి కూడా వచ్చేవాడు కాదనీ గుంటూరులో వైన్ కాంట్రాక్ట్ ఒకటి వుండి బయలుదేరాడనీ చెల్లెలి శ్రీమంతం వార్త, జాబు చేరి వుండటం వల్ల తను కూడా వస్తానని పట్టుబట్టిందనీ చెప్పింది వైదేహి.

"నీవు రావడంతో నిజంగా ఇది నాకో పండగయింది అక్కయ్యా" అన్నది మంగతాయారు.

రామానుజస్వామి శ్రీనాథుడితో ఆత్మీయునిలా వ్యవహరించాడు. కవిత్వాన్ని గూర్చి వేదాంతాన్ని గూర్చి చర్చలు జరిపాడు కాని లక్ష్మణమూర్తితో ఒక ఆఫీసరుపట్ల చూపినట్లు గౌరవం చూపాడు. ఒక అధికారికి జరిపిన లాంఛనాలు జరిపాడు.

ఆ భేదం గమనించింది మంగతాయారు.

మంగతాయారు మనస్సును మాటల్లోకి అనువదించుకున్నాడు శ్రీనాథుడు.

గౌరవింపబడటం కన్నా ప్రేమించబడటం గొప్పదన్న విషయం తాయారుకెలా తెలుస్తుంది? అనుకున్నాడు.

లక్ష్మణమూర్తి పెద్ద చదువుకున్నవాడు కాదు— అలాంటప్పుడు ఆయనతో శ్రీ భాష్యం వగైరా తనతో ముచ్చటించినట్లు మామగారెలా ముచ్చటిస్తారు ? పైగా లక్ష్మణమూర్తి ధనవంతుడు.

డాబూ దర్పం కలవాడు —

కొంచెం ముక్కోపి కూడాను —

కాబట్టే తదనుగుణంగా ప్రవర్తించవలసిన బాధ్యత అత్తమామలపై వుందని శ్రీనాథుడికి తెలుసు.

కాని మంగతాయారుకు తెలియదు.

మర్నాడు గాజులు వేయించారు.

తొమ్మిది రంగుల గాజులూ నవరసాలను పలికించాయి — తొణికించాయి శ్రీనాథుని ఎదలో —

'నా బిడ్డ రసస్వరూపుడు కావాలి — శబ్ద బ్రహ్మోపాసకుడు కావాలి' అని సంకల్పించాడు ఆ ముహూర్తాన.

ఆ రోజు సాయంత్రం ఉన్నట్టుండి సుడిగాలి వచ్చింది — పేటలోని పొగాకు కేంద్రాలలో పరదాలూ రేకులూకూడా కొట్టుకొనిపోయాయి.

అందువల్ల పేరంటం అనుకున్నంత వైభవంగా జరుగలేదు — ఎక్కువమంది పేరంటాండ్రు రానేరాలేదు — పైగా వైదేహికి చేసిన సీమంతంలా ఇది లేదని ఎందుకో అనిపించింది తాయారుకు.

అదే ఆత్మీయత అదే అనురాగం —

కాని ఆ అంతస్సువేరు ఈ అంతస్థువేరని తోచింది — 'అక్క పెద్దది - పైగా మొదటి సారి — అప్పుడు నాన్నకు సంపాదన ఇంకా బాగుండేది' అని తృప్తిపడాలని ప్రయత్నించినా తాయారుకు మనస్సు కుదటపడలేదు. సమాధాన పడలేదు - 'నా భర్త మా బావకన్నా తక్కువ అంతస్థు కలవాడు. అందుకే ఈ తేడా' అని ఆమె హృదయంలో ఏదో ఒక శక్తి ప్రతిధ్వనించడం మొదలుపెట్టింది. తమ ఆర్థికమైన న్యూనత వల్లనే సీమంతం వైభవోపేతంగా జరగలేదనే ఒ భావం సుడిగాలిలా ఆమెలో చెలరేగింది.

సుడిగాలి పెరిగి పెరిగి తుఫానుగా పరిణ మించింది. లక్ష్మణమూర్తి ఆ రాత్రే తన కారులో బయలుదేరి తెల్లవారేలోపల హైదరాబాద చేరాలనుకున్నాడుగాని వానవల్ల గత్యంతరంలేక ఆ పోయాడు.

మామగారిదగ్గర అల్లుళ్లిద్దరూ కూర్చు న్నారు.

లక్ష్మణమూర్తి తన ఘనతనూ, పట్టణ జీవితాన్ని, నగరంలోని వాననూ వివరిస్తున్నాడు-

తాను బొంబాయి వెళ్లినప్పుడు వర్షం ఎల వుండేదీ చూచినట్లు చెప్పాడు— కలకత్తాలో వర్షం విచిత్రంగా వుంటుందట. అందులోనూ హౌరా బ్రిడ్జి దగ్గర సాయంకాలం వాననుచూ తీరాలిట— వర్షాకాలం రాత్రి బెంజారాహిల్స్ ఎల వుంటుందో వివరించాడు—త్రీ ఏసెస్ సౌందర్యం రిడ్జ్ మాధుర్యం వానలో ఎలా ద్విగుణీకృతమూ త్రిగుణీకృతమూ అవుతుందో చెప్పాడు—

శ్రీనాథుడు అంతా విన్నాడు—

రామానుజస్వామీ నిశ్శబ్దంగా సాక్షి మాత్రంగా కూర్చున్నాడు. అంతావిని శ్రీనాథుడ అన్నాడు "అన్నయ్యగారూ మీరు, కవికావలసింద పొరపాటున సారాయి దుకాణం పెట్టారు' శ్రీనాథుడు చాలా సరళంగా అన్న ఈ మాటకు లక్ష్మణమూర్తి ఎంతో అవమానంగా భావించాడు

కావాలని తన్ను కించపరచాలని శ్రీనాథుడ ప్రయత్నిస్తున్నాడని అనుకున్నాడు—

దానితో చిరెత్తిపోయాడు—

వానలా విజృంభించాడు—

"కవిత్వమేమిటయ్యా కవిత్వం—అదేం పెద్ద విద్యనుకున్నావా ? మాటలను నిలువునా అడ్డంగ నవారు మంచంలా అల్లడం— జనపనారలా పేనడం— ప్రతి ముష్టివాడూ కవే ఈనాడు— ఏమన్నా శ్రమ పడాలా ? తెలివితేటలుపయోగించి డబ్బు సంపాదించాలా ? తిని తిరిగే సోమరిపోతు లంతా కవులమని చెప్పుకుంటూరు— అందుకే కొన్ని దేశాల్లో కవిత్వాన్ని బహిష్కరించారు— అంతా ఒళ్లువంచి చాకిరీ చేయాల్సిందే—కష్టపడి ఏదో ఒక పని చేసుకొని బతకాల్సిందే— కవిత్వం వ్రాస్తామంటే కాల్చేస్తారు వాళ్లు"

"అన్నగారూ— మీ నగరంలోని వర్షవర్ణన ద్రాక్షపాకంలా సాగింది— అందుకని అలా అన్నాను" శ్రీనాథుడు మరికొంచెం వివరించాడు.

"ఛీ— ఇక మాట్లాడకు" చివాలున లేచి లోపలికిపోయాడు లక్ష్మణమూర్తి—

వైదేహి ఈ సంఘటనలో తల్లడిల్లి పోయింది— మంగతాయారు కళ్లు బయట మేఘాలకు అక్కలుగా మారాయి—

**జరిగిన కథ—3 :** శ్రీనాథుడు సాహిత్య పిపాసి. ఆయన కవిత్వం అంటే భార్య తాయారుకు మొదట్లో సరదాగానే ఉండేది. కాని క్రమంగా విసుగు బయలుదేరింది. శ్రీనాథుడు, తాయారు కాలిబాటన తిరుపతి కొండ ఎక్కను ప్రారంభించారు. దారిలో అక్క వైదేహి బావ లక్ష్మణమూర్తి కారులో కొండపైకి పోతూ వీరిని కలుస్తారు. లంచం ఇచ్చి దైవ దర్శనం చేసుకోడం పాపమని మంగతో చెపుతాడు శ్రీనాథుడు. క్యూలో నిల్చునే ధర్మదర్శనం చేసుకొంటారు. తీర్థయాత్ర సఫలమై మంగ గర్భవతి అవుతుంది.

రామానుజస్వామి శ్రీనాధుణ్ణి ఏదో సముదాయించబోయాడు—

శ్రీనాధుడు ఏమీ అనలేదు—అనుకోలేదేమో కూడా!

వైదేహి మాత్రం అన్నది "ఎవరి పని వారికి గొప్పది— శ్రీవైష్ణవులమై వుండి వైన్‌షాప్ నడుపుతున్నామనేకదా మా మరిది ఇలా 'సారాయి దుకాణం' అని ఎగతాళి చేశాడు—ఎవరి అంతస్థుల్లో వాళ్లుంటే ఇలా గొడవలే రావు—"

మంగతాయారుకు రోషం పొడుచుకొచ్చింది. "ఇంకా సిగ్గులేక ఆ దూర్వాసుణ్ణి వెనుకేసుకు వస్తున్నావా అక్కయ్యా— నీ మొగుడైతే నీకు గొప్ప— నాకేం గొప్ప! నలుగురు పెద్ద మనుషుల్ని పిలిపించి మా ఆయన అన్నమాట వినిపించు. అందులో ఏదైనా తప్పుంటే నా నోట్లో గడ్డి పెట్టు— 'ద్రాక్షపాక'మంటే నీ అనాబోషాహీ తోటలు కావు— కవిత్వంలో ఒక శైలి— అది తెలియాలంటే చదువు రావాలి — ఆ విషయం అర్థంచేసుకోకుండా 'ఛీ — మాట్లాడకు' అంటే ఏమిటి — మేమేం మీ ఇంటి కుక్కలమనుకున్నావా? ఏం చూసుకుని ఆ బోడి గర్వం — హిమాయత్ నగర్‌లోని మేడ చూచుకునేనా?"



తాయారు మాటలతో వైదేహి కంపించి పోయింది — ఆమె కళ్ళు సజలాలైనాయి.

పేరిందేవి తాయారును కసురుకున్నది —

'అంతరం లేకుండా మాట్లాడకు' అన్నది పేరిందేవి.

'ఏం అంతరమే— డబ్బు అంతరమే నా' తాయారు రెట్టించింది.

పేరిందేవి వయస్సు అంతరాన్ని ఉద్దేశించి ఆ మాట అన్నది — కాని తాయారుకు డబ్బు అంతరమే స్ఫురించింది.

లోపలినుంచి లక్ష్మణమూర్తి వచ్చాడు 'అవునమ్మా — డబ్బు అంతరమే. కష్టించి



ఇటీవల పాండిచ్చేరిలో రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల ఆధ్వర్యంలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో తమిళ, తెలుగు, హిందీ, ఇంగ్లీషులో మిమిక్రీ, మ్యాజిక్ ప్రదర్శించిన శ్రీ చిల్లర సుధాకర్ (హైదరాబాదు)ను పాండిచ్చేరి ప్రధాన న్యాయమూర్తి శ్రీ డేవిడ్ అన్నుస్వామి సత్కరిస్తున్న దృశ్యం.

---

రాత్రింబవళ్ళు తోటలువేయించి బేరాలుచేసి డబ్బు సంపాదించాము — బఫూనులా తిరిగితే డబ్బు రాదు — అంతరాలు తెలియవు.'

'బఫూను' అన్నమాట తన మనస్సులోని ట్లలదొర అన్న మాటకు పర్యాయపదంగా తాయారుకు గోచరించింది. తాయారు ఏడుస్తూ అన్నది' నా భర్త అసమర్థుడు కాబట్టే ఇన్ని మాటలు పడవలసివస్తున్నది — నా బంగారం మంచిదైతే ఇతరులననుకొనే పనేమిటి ? బ్రాహ్మడై పుట్టి సారాయివ్యాపారం చేస్తూవుండే అడ్డమైన తాగుబోతులచేతా మాటలు పడవలసి వచ్చింది నా బ్రతుక్కి.'

పేరిందేవీ రామానుజస్వామీ ఈ అకాల పుష్కలావర్తాల ప్రళయ ధ్వనికి తట్టుకోలేక పోయారు.

భర్త ఆజ్ఞానుసారం మరో పది నిమిషాల్లో వైదేహి బట్టలు సర్దుకొని కారులో కూర్చున్నది.

లక్ష్మణమూర్తి వెళ్ళి ముందు సీటులో కూర్చున్నాడు.

జోరున వాన— అయినా,

వాళ్ళని ఆపగలిగే ధైర్యం అత్తమామలకు లేకపోయింది.

శ్రీనాథుడు దగ్గరికి పోయాడు —

''క్షమించండన్నయ్యగారూ నేను వాచ్యవ్యంగ్యాలలో ఏదైనా తెలిసో తెలియకో ప్రయోగించినట్లయితే — రేపు వెళ్ళవచ్చు — దయచేసి ండి.''

ఓ చీమనో దోమనో చూచినట్లు చూచాడు లక్ష్మణమూర్తి శ్రీనాథుణ్ణి.

బురద చిమ్ముకుంటూ కారు బయలు దేరింది.

# స్వప్న భంగం

శ్రీనాథుని పై బురదనీళ్లు చిందాయి ... చూస్తూండగానే చీకట్లో కలిసిపోయింది.

ఆ రోజు రాత్రి ఎవ్వరికీ భోజనాలు లేవు. పేరిందేవి శ్రీనాథుణ్ణి భోజనానికి పిలిచింది కాని రాలేదు.

రాకరాక వచ్చిన బిడ్డ ఇలా అవాంతరంగా వెళ్లడంతో రక్తపోటు మనిషి పేరిందేవి తట్టుకో లేకపోయింది. తెల్లవార్లూ సణుగుతూనే వుంది. ''ఈ శ్రీమంతం లేకపోయినా నా బిడ్డ ఇలా వానలో వరదలో వెళ్లవలసి వచ్చేది కాదు.''

శూలాలతో కుమ్మినట్లనిపించింది తాయారుకు. మర్నాడే ఈమని ప్రయాణం కట్టింది. రామానుజస్వామి నివారించాడు.

కాని కట్టలు తెగిన ఉద్రేకాలను గరికపోచలు ఆపగలవా ?

* * *

అత్తగారింట్లోనే మంగితాయారు పురుడు పోసుకున్నది—

మగ బిడ్డను కన్నది—

శ్రీనాథుడు ఉప్పొంగిపోయాడు.

తిథీ వారం నక్షత్రం అన్నీ బ్రహ్మాండంగా ఉన్నాయి— మహా ధనవంతుడూ కీర్తివంతుడూ అవుతాడు. ఆ ముహూర్తాన పుడితే జాతక ప్రకారం—

''మరి కవిత్వం మాటేమిటి ??'' అన్న ప్రశ్నకు జ్యోతిష్యం సమాధానం చెప్పలేదు —

దొరువుల్లో నుండి ఇన్ని కలువపూలు కోసుకొని వచ్చాడు శ్రీనాథుడు—

తల్లినీ పిల్లనూ చూచి నవ్వాడు.

తాయారు సిగ్గుతో తల వంచుకుంది—

తాను తెచ్చిన కలువపూలు పిల్లవాడిపక్కన పెట్టాడు—

''ఏమిటివి?'' తాయారు ప్రశ్నించింది సూటిగా—

''ప్రకృతి ఈ శుభముహూర్తాన పంపిన కానుక'' తాయారు శ్వేతకమల నేత్రాలు అరుణ కమలాల్లా కనిపించాయి—

కలువలను పక్కపైనుండి నెట్టివేసింది -

శ్రీనాథుని హృదయం చివుక్కుమన్నది—

''ఇదిగో చూడండి— మీరింకా పసిపిల్లలు కారు— మీకొక పసిపిల్లడు కూడా పుట్టాడు— ఇలా తేనెటీగలమూ సీతాకోకచిలుకలమూ పట్టుకొని తిరిగితే భుక్తికూడా గడవదు— ఈ పూలరంగడి వేషాలు ఇక మానివేయండి— నన్నిక నలుగురిలోనూ తలెత్తుకొని తిరగనివ్వండి''— కసురుకుంది ఆమె.

ఆమె నేత్ర కమలాలనుండి రెండు మూడు మంచుబొట్లు రాలి శ్రీనాథుడు తెచ్చిన చలువ కలువను వేడెక్కించాయి.

శ్రీనాథుని గుండె బరువెక్కిపోయింది.

తనొక అసమర్థుడు —

పనికిమాలినవాడు — పిచ్చికవి!

కవిత్వంపేర లోకంలో అవమానాలకూ అనాదరణకూ అవహేళనకూ ప్రతినిధిగా తయారైనాడు.

కలకంఠి కంట కన్నీరు తరుచు ఒలికించి సిరిని ఇంట నిలువకుండా చేసుకుంటున్న మూర్ఖుడు తాను.

సమాజం చాలా విస్తృతమైంది -

అందరూ ఒకే వృత్తి చేయడం సాధ్యపడదు.

కొందరు తాజమహల్లు కడితే మరికొందరు మాటల మందిరాలు నిర్మిస్తారు.

కాని తన భార్య దృష్టిలోనేకాదు లోకం దృష్టిలోకూడా ఇంజనీర్లు గొప్పవారు డాక్టర్లు అవతారమూర్తులు — అటమిక్ ఎనర్జీ మహా విద్య — అవన్నీ కాదననడంలేదు తాను — కాని శబ్దాలు సృష్టించే విద్యుత్తు అణు విద్యుత్తు కన్నా గొప్పదని నిరూపించదలచాడు — కాని విఫలమౌతున్నాడు.

ఆదర్శ శిఖరాల అంచులు అందుకోకముందే, అంబరాన్ని చుంబించకముందే పదవిహీనుడౌతున్నాడు.

చ్యుతిని పొందుతున్నాడు —

''బిడ్డణ్ణి అన్యాయం చేయకండి— బిడ్డణ్ణి అన్యాయం చేయకండి — బిడ్డణ్ణి అన్యాయం చేయకండి— సమాజంలో నలుగురిలా నన్నూ తలెత్తుకొని తిరగనివ్వండి— బిడ్డణ్ణి అన్యాయం చేయకండి— అన్యాయం చేయకండి— అన్యాయం చేయకండి— అన్యాయం .........''

* * *

''ధన— ధన— ధన— ధన— ధన— ధన— ధన'' ప్రింటింగ్ మిషన్ మోత.

''గురో గుర్— గుర్— గుర్— గుర్— గుర్— గుర్— గుర్''చక్రాల శబ్దాలు.

'ఛున్‌న్‌న్‌న్‌న్‌న్‌న్‌న్‌–న్' బెల్టు ధ్వని—

ఆనందవర్ధనుడి ''ధ్వని''ని నేటివరకు ఉపాసించే శ్రీనాథుడు తెనాలిలో ప్రింటింగ్ ప్రెస్ పెట్టాడు.

మొదట్లో కొన్నాళ్ళూ రోజూ ఉదయం తొమ్మిది గంటలకు ఈమని నుండి బయలుదేరి తెనాలి చేరి పని ముగించుకొని తిరిగి రాత్రికి ఇల్లు చేరేవాడు. కాని క్రమంగా పని ఎక్కువ కావడం మొదలుపెట్టింది. లంక ఈతకూ ఏటి మేతకూ కుదరదని తెనాలిలోనే ఓ ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.

తొలిసారి మురికినీటి వాసనలకు గురి అయినాడు— కొడుకు ముద్దుకృష్ణతో బాటు ప్రెస్ కూడా దినదిన ప్రవర్ధమానంకాజొచ్చింది.

మొదట్లో చిన్న చిన్న జాబ్ వర్క్సు మాత్రమే తీసుకునేవాడు— పెండ్లి శుభలేఖలు, కరపత్రాలూ ఇత్యాదులు. రాత్రింబవళ్లు కష్టపడి లాభాలు సంపాదించి ఒక ట్రెడిల్

# సాంప్రదాయక గతవైభవాన్ని ఆప్కోవస్త్రాల్లో ప్రతిబింబించండి

ఆప్కో వస్త్రాల అందాలు గత వైభవ స్మృతులను ప్రతిబింబింప జేస్తాయి.
ఆప్కో వస్త్రాల విస్తృత శ్రేణి –

- షర్టింగులు
- డ్రస్ మెటీరియల్స్
- చీరలు
- తయారీ వస్త్రాలు
- గృహోపకరణ వస్త్రాలు



**చేనేతలు**



ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోపరేటివ్ సొసైటి
లిమిటెడ్
హైదరాబాద్–500 029.

KIRON/APCO/84 G

కొన్నాడు. దానిమీద వారపత్రిక ఒకటి కాంట్రాక్టుకు ముద్రించడం మొదలుపెట్టాడు—

అలివేలిమంగా ప్రెస్ చూస్తుండగానే స్థిరపడిపోయింది— పని విషయంలో మంచి నైపుణ్యం ప్రదర్శిస్తారనే పేరు వచ్చింది—

ఎవరైనా శుభలేఖలు తెచ్చి ఇస్తే శ్రీనాథుడు వెంటనే ముద్రించేవాడు కాదు—

పిల్లగూర్చీ పిల్లవాని గూర్చీ వివరాలు విచారించేవాడు— వారి శరీర వర్ణాలూ అభిరుచులూ కనుక్కొని ''వారికి ఆరంజ్ అట్ట వుండి పైన శివపార్వతుల బొమ్మవున్న కార్డులు తెచ్చుకోండి. అచ్చువేస్తాను'' అనేవాడు—

''మీవాడి అభిరుచికి విఘ్నేశ్వరుడి బొమ్మ గల కార్డులు చాలా శ్రేష్ఠం—''

''మీ అబ్బాయి రాధాకృష్ణుడయ్యా—పోయి రాధాకృష్ణులున్న చిత్రం తీసుకురా బాబాయ్'' ఇలా వరుసలు కలిపి వర్ణ ఔచిత్యాన్ని రసంతో సమన్వయించి ముద్రణ దగ్గర శ్రద్ధ తీసుకునే వాడు.

శ్రీనాథుడు తానీ లౌకిక ప్రపంచంలో ఎలా నెగ్గుకురాగలనా ? అని చాలా భయపడ్డాడు కాని ఇంత లౌక్యంతో బేరం నిర్వహించటం బాగా స్థిరపడ్డ పెద్ద పెద్ద ప్రెస్సులవారికే ఆశ్చర్యాన్ని కలిగించింది— శ్రీనాథుడు కవి కావడంతో మరి కొన్ని సౌకర్యాలు పెరిగాయి—

ఎండాకాలం మూడు నెలలూ గుంటూరు జిల్లాలోని పెండ్లి పత్రికలు సగానికి సగం అలివేలుమంగా ప్రెస్‌కే వచ్చేవి. కారణం తన దగ్గర పెళ్లి శుభలేఖలు వేయించుకున్న ప్రతీ వధూవరులమీదా పంచరత్నాలు వ్రాసి ఉచితంగా నూస్‌ప్రింట్‌మీద అచ్చువేసి పంపించేవాడు— శ్రీనాథునివాక్కు అమృతవాక్కనీ అతని దీవెన పురోహితుడు పెట్టిన ముహూర్తం కన్నా దివ్యంగా పనిచేస్తుందనీ ఒక నమ్మకం వ్యాపించింది.

ఎలా వ్యాపించింది — ఎవరు వ్యాపింపజేశారు ? ఈ రహస్యాలేవీ తెలియవుకాని ఒక విశ్వాసం ప్రబలంగా అందరిలోనూ నాటుకున్నది.

పెండ్లి శుభలేఖలయితే అలివేలిమంగా ప్రెస్‌కు పోవలసిందే !! రాజకీయ మిత్రులందరికీ శ్రీనాథుడు తక్కువరేట్లకే కరపత్రాలు వేసి పెడతాడు.

శ్రీనాథుని ప్రెస్‌లో ముద్రణ అయిన పుస్తకం నెల తిరగకముందే పునర్ముద్రణకు వస్తుంది.

పాఠకులు పకోడీల్లా కొనుక్కొంటారు— ఫలానా పుస్తకం అచ్చుకాకముందే ప్రీ పబ్లికేషన్ ప్రతులే రెండు వేలు అమ్ముడుపోయాయి.

శ్రీనాథుడు ప్రయోగించిన మహా మాయ జగన్మోహినిగా నర్తించింది.

గల గల గల గల కనకవర్షం కురిసింది —

# స్వప్న భంగం

'అంతా నా ముద్దు కృష్ణుడి అదృష్టం' అనుకున్నది మంగతాయారు.

ఆదాయంతోబాటు ఖర్చులు పెరిగాయి —

ప్రెస్ పెరిగింది —

ఇంటిస్థలం ఒకటి కొన్నాడు —

స్థలం కొన్నాక ఇటుకలు —

ఆ పైన సున్నం —కలప—ఇనుపసామాను— పని పెరగడంతో దగ్గిర బంధువు నరసింహాచారిని మేనేజరుగా పెట్టుకున్నాడు.

'నరసింహంగాడి బుద్ధి మంచిదికాదు — తినేస్తాడు' అన్నది తాయారు.

''తింటే తిన్నాడు— మనవాడేగా— అలాగని పని ఇవ్వలేదనుకో. మనకు ఐశ్వర్యం కలిసి వచ్చిందం, వచ్చి తిష్టవేసి ఇంట్లో కూర్చొని తింటుంటే ఊరికే, అప్పుడేమయింది ?'' అన్నాడు శ్రీనాథుడు— నిజమే ననిపించింది తాయారుకు.

డబ్బుతోబాటు తాయారుకు బంగారంమీద మోజు పెరిగింది.

ఎన్ని యుగాలు మారినా విలువ తరగని బంగారం ఒక్కటేనని కాసులుకొని సొమ్ములు చేయించాడు శ్రీనాథుడు. ఈమనిలో ఇల్లును బాగు చేయించుకున్నాడు.

ఇంకొంచెం పొలం —

మరికొంచెం ఆస్తి —

''ఈ ముష్టి పొలంతో నాకు తృప్తిలేదు. మలక్‌పేట కవతల ఆనాబ్‌షాపీ తోట తీసుకోవాల్సిందే ! పోటీగా పంట పండించి 'కృషి పండిట్' అనిపించుకోవాల్సిందే— లక్ష్మణమూర్తి కళ్లు కిందికి దిగితే తప్ప నాకు మనశ్శాంతి లేదు'', అని ద్రౌపదిలా ప్రతిజ్ఞ పట్టింది తాయారు.

## నెత్తు నేత్రి

ఈ తోటలో
చిగుళ్లన్నీ క్రోధారుణ నేత్రాలై
రేపటి పువ్వులై
నవ్వాలని ఎంత తహ తహ
ఈ గుండెల్లో
అక్షరాన్ని మంటగా రగిలించి
ఈ వ్యవస్థపై
గురిపెట్టిన పాటల చూపులే
రేపటి ఉగాదికి
ఆశల పునాది !!!

— రామసూరి

శ్రీనాథుడు చిరునవ్వు నవ్వాడు.

ఇప్పుడు పూర్వంలా శ్రీనాథుడు సకాలానికి భోజనాకి రాడు— వచ్చినా తీరికగా రుచులు రుచులుగా భోంచేయడు. గబగబా నాలుగు ముద్దలు తిని లేస్తాడు.

''మరికొంచెం మోర్‌కొళంబు వడ్డించుకోండి'' అంటే ''వీర్లేదు అవతల రచయిత ఆవిష్కరణ తేదీ ఫిక్స్ చేసుకున్నాడు రాత్రికి రాత్రి ఇంకా రెండు ఫారాల పని ముగించి కటింగ్, బైండింగ్ ముగించాలి'' అని ఓ పంచె బుజాన వేసుకొని పరుగెత్తుతాడు.

ఒక్కొక్కప్పుడు అన్నం ముందు కూర్చుంటే తమాషాలు ఏవో చెపుతాడు— ఆ తమాషాలన్నీ ప్రెస్ గూర్చే— 'క్షామ నివారణ' అని అచ్చు కొడితే మిషన్ ప్రూఫ్ తర్వాత, అందులో 'ష' వత్తు రాలిపోయి 'కామ నివారణ' అని అచ్చు పడిందట — 'సకుటుంబ సపరివార సమేతంగా' అనడం తప్పయ్యా' అంటే ఒక రైతు వినవేవినడట ! వాళ్ల వూళ్లో పురోహితుడు పసుపు పూసిన కాగితంమీద అలాగే వ్రాసి ఇచ్చాడట— 'అబ్బ మిషను వాడివి— నీకేం తెలుసు మా పురోహితుడికన్నా' అని దెబ్బలాడుతాడట !

ఒక రాజకీయ నాయకుడికి బాగా సుస్తీ చేసిందట— ముందే సంతాప సందేశమూ జీవిత చరిత్ర కలిపి ఒక సంస్థవాళ్లు గతరాత్రే అచ్చు వేయించారట—

''అవి ఆయన పోయేవరకూ ప్రెస్ నుండి బయటకు పోకూడదు— పోయినయ్యో ఈ సంస్థ వాళ్లని ప్రజలు చితకబొడుస్తారు సున్నంలోకి ఎముక లేకుండా'' ఫక్కున నవ్వాడు శ్రీనాథుడు.

''ఏమేయ్—'' అరుస్తూ వస్తాడు శ్రీనాథుడు వీధిలోనుండే.

''నరసింహంగాడు నిన్న రాత్రి సినిమాకు చెక్కేశాడు— ఓవర్‌టైం ఉండాలిరా అంటే వినలేదు— ఏం చేయాలి వెధవను— మేనేజరు ఉంటేనే అంతంత మాత్రం వాళ్లు— లేకుంటే ఇక చెప్పేదేముంది ?? మళ్లీ ఈ రాత్రికూడా ఓవర్‌టైం పెట్టాల్సిందే— ఖర్మ— గ్రహచారం ఏం చేస్తాం.''

''అసలు ఓవర్ టైం ఎందుకండీ.''

''ఎందుకా నా అదృష్టం బాగుండక— ఆ నరసింహంగాడు కంపోజిటర్లచేత సరిగ్గా పని చేయించక— పుల్లయ్య లేడూ పుల్లయ్య అదే, పాపమని తిండికి లేకపోతే పనినేర్పి ముందు 'గాలీ'కి ఇంతని 'పే' చేసి తర్వాత పర్మినెంటు వర్కరుగా తీసుకున్నాను చూడు వాడు నిన్న ఇంత టైపు జేబులో పోసుకు పోయాడు. వాడి బొందె— ఇన్ని 'ల'లు ఇన్ని 'య'లు కొట్టేశాడు. వాడు 'లయం' కావడానికి—''

(ఇంకా ఉంది)

## తగిన శాస్తి!

భోపాల్ మెడికల్ కాలేజి ఆడవారి హాస్టలులోని విద్యార్థినులు హోలీ పండుగ నాడు తమ హాస్టలు ఆవరణలో సంతోషంమీరా పాడుతూ డ్యాన్సులు చేస్తూంటే వూళ్ళోని వో పెద్ద హోటలు యజమాని కొడుకులిద్దరు మస్తుగా తాగి ఆ హాస్టలు వద్దకు వెళ్ళి గోడెక్కి గలాటా చేసేసరికి ఆ విద్యార్థినులు వారిని సగౌరవంగా లోపలకు పిలిచి, తక్కున వారిని పట్టుకుని, బట్టలు పూర్తిగా వూడదీసి, ఆ బట్టలు హోలీ మంటలో వేసేశారట — ఆనకే మయ్యింది ! ... హయ్యయ్యో !!

## ఒకే పత్ని - ఒకే గూడు !

గ్రద్ద తన జీవితకాలంలో ఒకే భాగస్వామిని ఎన్నుకుంటుందట. మగ గ్రద్ద తన జీవిత భాగస్వామిని [?] ఎన్నుకుని, ఆమె వొప్పుకున్నాక సంసార మారంభించడానికి ఎత్తయిన చెట్టు చిట్టచివర చక్కగా గూడు కట్టుందట. ఆనక ఆ ఆడగ్రద్దతో జీవిత మారంభించి, తన గూడు కూడా మార్చుకోక, దానిని రిపేర్లు చేసుకుంటుందట.

## సిగరెట్ పొగవల్ల కాన్సరు వ్యాధి!

సిగరెట్టు కాల్చేవారి సరసన కూర్చుంటే వాళ్ళొదిలే పొగ తప్పనిసరిగా పీల్చడంవల్ల కూడా సిగరెట్ కాల్చేవారికొచ్చే వ్యాధులు వస్తాయని సైన్సు అంటోందట. నికొటిన్, కార్బన్ మోనాక్సయిడ్, కాన్సరు క్కారణమయిన బెంజో ఫయిరిన్ సమృద్ధిగా ఆ పొగలో వుంటాయని, అటువంటి పొగ ఒక్క గంట పీలుస్తే, వో సిగరెట్టు కాల్చినదానితో సమానమనీ సైన్సు వుద్ఘాటిస్తోందట.






## ప్రాణం తీసిన విచ్చలవిడితనం !

సేలం అలివాగ వుండన్‌పట్టికి చెందిన 20 ఏళ్ళ అమ్మాయి 24 ఏళ్ళ గణేశన్ అనే అతనితో, అతని స్నేహితుడు 23 ఏళ్ళ రాజా అనే అతనితో కూడా విచ్చలవిడి శారీరిక సంబంధం పెట్టుకుని, చిట్టచివరికి మీ యిద్దరిలో ఎవడో ఒకడు నన్ను పెళ్ళి చేసుకోపోతే నా తడాఖా చూపుతానని తమిళంలో బెదిరించిందట. గణేశన్ తనకు ఇదివరకే పెళ్ళయినందువల్ల ఆమె యిష్టం మేరకు ఆమెతో సరదాగా గడిపానని తప్పిచ్చుకోజూస్తే, ఇంత పబ్లీకున ఇద్దరితో రంకు సాగించినదాన్ని యిల్లాలు చేసుకో ముడియాదు అని రాజా అన్నాట్ట. చివరికి గణేశన్ వొప్పుకుని, ఆమెను, రాజాను తీసుకు ఆత్తూరు వెళ్ళి అక్కడో గుడిలో పెళ్ళిచేసుకుని ఆ రాత్రి వో తోటలో మొదటి రాత్రి ''ఇదివరకే ఎరిగిన సుఖాన్ని''మళ్ళి చవిచూసి, అర్ధరాత్రి లేచి, తన స్నేహితుడు రాజా సహాయంతో ఆ వసంత బుర్ర వో రాయితో పగలేసి, ఆమెను చంపి, చక్కాపోయారట.

## క్లోరిన్ సిలిండర్ల మధ్య పసివాని శవం !

గోదావరిజిల్లా కొవ్వూరు ''ఆంధ్రా సుగర్స్'' నుంచి మెట్టూరుకు (తమిళఘం) క్లోరిన్ సిలెండర్లను తీసుకువచ్చిన లారీలో ఆ సిలెండర్ల మధ్య వో గోనెచుట్టలో ఒహ పసివాని శవం వున్నదట. ఈ శవం కోవూరు లోనే లోడు చేయబడ్డదా, మధ్యలో ఎక్కడో ఎవరైనా ఎక్కించారా అని పోలీసారాలు తీస్తోందట.

## మొండి పిల్లల్లో అధిక తెలివితేటలు!

పసిపిల్లలు పెద్దవారయేటపుడు వారి వాదనల్లోను, మొండి పట్టుదలల్లోను, మారాంతోనూ వారి తెలివితేటలు అభివృద్ధవుతాయని, ఆనక స్కూళ్ళలో ప్రసంగపోటీల్లో పాల్గొనడంలో, తాము తల్చుకున్నది వాదించి గెలుచుకోడంలోను, తమ అభిప్రాయాలను నిక్కచ్చిగా చెప్పగలిగి వ్రాసే వుత్తరాలవల్లనూ వారి తెలివి రెట్టింపవుతుందనీ జర్మనీ విజ్ఞుల భిప్రాయమట.

## గుంజీళ్లు తీసిన ఘనులు !

మహోహర్‌పూర్‌లో వో రెండు పార్టీల పెద్దలు పోట్లాటలో కేశాకేశీ, ముష్టాముష్టి వరకూ వెళ్ళాక పోలీసు కేసు రిజిష్టరుచేసిందట పోలీసు. ఆ మర్నాడు ప్రిసైడింగ్ ఆఫీసరు వచ్చి, స్టేషనుకు యిద్దర్నీ పిలిచి గదమాయించి, చెరిపది గుంజీళ్ళు తీసి, లెంపలేసుకు, స్నేహితుల్లా కరచాలనం చేసుకుపొండి అని గదమాయిస్తే వారిద్దరూ ఇట్లు విధేయులు అన్నట్టులాగే చేశారట— ఏమాశ్చర్యము !




## రాజావారి భవంతికి తుది మెరుగులు !

సౌది అరేబియా రాజావారు నీటిలో తేలియాడి వో 450 అడుగుల హర్మ్యాన్ని నిర్మించుకున్నారట. దీనికే 45 కోట్ల రూపాయలు ఖర్చయిందట. ఈ భవంతికి ''అబ్దుల్ అజీజ్'' అని ముద్దు పేరు పెట్టాడటాయన. దంతనగిషీలో స్నానపు గదులు, పడగ్గదికి బంగారు రేకు తాపడాలూ వున్నాయట. ఆయనకు అభిరుచి మరింతై, యీ 45 కోట్లు ఖర్చయిన భవంతికి మరో 21 కోట్లు ఖర్చు చేస్తున్నాడట — అందుకే డబ్బుకొద్దీ వన్నెలు, మొగుడుకొద్దీ చిన్నెలు అంటారు — అంతేకదా !

## అరచేతిలో ఇమిడే పసితందు !

ఇటలీ రోమ్ టిరామొ నగరంలో ఒక గర్భిణి స్త్రీ ఆరోనెల కూడా రాకుండానే మొన్న 1983 మే నెలలో పిల్లను కన్నదట. ఆ పసికందు 490 గ్రాముల బరువుతో అరచేతిలో ఇమిడె అంతే వున్నదట. ఈ పసిబిడ్డను ఇన్క్యుబేటరులో పెట్టితే ఎంచక్కా, ఆశ్చర్యకరంగా బ్రతికిందట. ★

**"కిరాయి అల్లుడు"లో కోరిన పిల్ల**

పంతులు ఇచ్చిన రాధ (జయసుధ) ఫోటోను పరంధామయ్య (సత్యనారాయణ), సుభద్ర (అన్నపూర్ణ) చూశారు.

"పిల్ల లక్షణంగాలేదూ ?" అన్నాడు పరంధామయ్య.

"–అని మెల్లగా అంటారేమిటండీ – మహాలక్ష్మిలా ఉంటేనూ !" అంది సుభద్ర.

"చదువు, సంస్కారం ఉన్న పిల్ల," అని పంతులు చెప్పేసరికి పరంధామయ్యకు కాస్త అనుమానం కల్గింది. "అది సరేలేవయ్యా ! కొంపతీసి ఈ కేసు మావాడే రెకమెండ్ చేశాడేమిటీ ?" అన్నాడు.

పంతులు కుండ బద్దలు కొట్టినట్లు "అబ్బాయిగారికి ఈ విషయం బొత్తిగా





తెలీదండి," అన్నాడు.

ఇంతలో రమేష్ (కృష్ణ) అటు వచ్చేసరికి "రమేష్ !" అంది సుభద్ర.

"ఏమిటమ్మా, తొందరగా చెప్పు. నేను ఫాక్టరీకి వెళ్తున్నాను," అన్నాడు రమేష్ హడావిడిగా కనిపిస్తూ.

"ఈ అమ్మాయి నీకు నచ్చిందేమో చెప్పు," అంటూ సుభద్ర ఫోటో ఇచ్చింది.

"ఇప్పుడు నా పెళ్ళికేంటమ్మా తొందర?"

"నీకు లేకపోవచ్చు. మాకుందిగా తొందర ?"

రమేష్ ఫోటోవంక అదోలా చూసి, "ఏదో షుమారుగా ఉందిలే. మీకు నచ్చితే నాకూ నచ్చినట్టే," అని నిర్లక్ష్యం నటిస్తూ పోయాడు.

పుటుక్కున "నాకు పూర్తిగా నచ్చలేదురా," అన్నాడు పరంధామయ్య.

రమేష్ ఖంగారుగా "నాకు పూర్తిగా నచ్చింది. దీన్నే ఖాయం చేయండి," అంటూ వెళ్లిపోయాడు.

పరంధామయ్య, సుభద్రమ్మ నవ్వుకుంటూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ఇక పంతులి సంతోషం వర్ణనాతీతం.

పద్మాలయా స్టూడియోస్ సమర్పించే అమృతా ఫిలిమ్స్ "కిరాయి అల్లుడు" చిత్రాన్ని ఎం. బాలయ్య కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అలపర్తి సూర్యనారాయణ, మన్నన వెంకట్రావు నిర్మిస్తున్నారు. కృష్ణ జన్మదినోత్సవ సందర్భంగా మే 31న విడుదలవుతుంది.



## "ఆడపులి"

"అందర్నీ ఆలోచింపజేసి, ఆశ్చర్యపరచే ఒక ఆడపడుచు కథ," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వం నెరిపే ఎస్. ఆర్. ఫిలిమ్స్ వారి చిత్రంలో మోహన్‌బాబు, జయసుధ ప్రధాన పాత్రధారులు. "మే, జూన్ నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత ఎస్. రామచంద్రరావు.





రాధ "వసంత గీతం"



జయమాలిని "మెరుపు దాడి"

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

రత్నా మూవీస్ "తల్లిని మించిన తనయులు" కేతినేని పిక్చర్స్ "పల్నాటి సింహం," వినయ్ ఆర్ట్ క్రియేషన్స్ "చిరంజీవి", శ్రీ బాల బాలాజీ క్రియేషన్స్ "ఆక్రందన", "రాయలసీమ రౌడీ", కోనార్క్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "శివగంగి సింగమ్మ", సిసి కళా కేంద్రం ప్రొడక్షన్స్ "సారంగు సాంబయ్య", "రావణ ప్రతిజ్ఞ", శ్రీ విజయ కళామందిర్ "రుద్రవాగు", శ్రీ వెంకట కృష్ణా ఫిలిమ్స్ "బొబ్బిలి సింహం", స్నేహాలయా మూవీస్ "డిస్కో డిస్కో", మనోరంజనీ క్రియేషన్స్ "కలియుగం", "అత్త కావాలి", శ్రీ బి. ఆర్. మూవీస్ "ఊరికి ఉపదేశం". "ప్రతాప రుద్రుడు", ఈశ్వరి చిత్ర మూవీ మేకర్స్ "నిఘా", రాశి మూవీస్ "పేరంటాలు", సమతాలయా "ప్రేమయుద్ధం", శ్రీ క్రాంతి చిత్ర "స్వాతి", తారక ప్రభు ఫిలిమ్స్ "బ్రహ్మముడి", శ్రీ సాయిరాం ఆర్ట్ ఫిలిమ్స్ "చైతన్యరథం", దేవికళామందిర్ "కల్లోలం", శ్రీనివాస ప్రొడక్షన్స్ "కేడీ—రౌడీ", జగపతి ఆర్ట్ పిక్చర్స్ "పవిత్రమూర్తి", గరుడా ఆర్ట్ ప్రొడక్షన్స్ "ప్రళయజ్వాల", త్రిమూర్తి ప్రొడక్షన్స్ "దొంగాడొచ్చాడు", "మహా గురుడు", వైజయంతీ మూవీస్ "అగ్ని పర్వతం," శ్రీ యామినీ మూవీస్ "చట్టం మా చుట్టం కాదు", యూనివర్సల్ క్రియేషన్స్ "దివ్యవాణి" శ్రీ భ్రమరేంద్ర ఆర్ట్ ఎంటర్‌ప్రైసెస్ "హల్లో లైలా చలో మజ్నా", ఇంటర్నేషనల్ ఎంటర్టైన్‌మెంట్స్ "నరహంతకులు", విద్యా ఎంటర్‌ప్రైసెస్ "నేటి పాండవులు", "పాలేరు", శారద ఆర్ట్ పిక్చర్స్ "తెగబుట్టిన నాడు", శిల్ప ఆర్ట్స్ "రాక్షసుడు", స్వాతి క్రియేషన్స్ "శ్రీకాకుళం చిన్నది", రాఘవేంద్ర ఆర్ట్ మూవీస్ "టక్కరి దొంగ", జయభారతి ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఉగ్రరూపం".




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి...మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilpi DM 2/83 Tel.

# నాసిరకం దారాలు తెగిపోవచ్చు.
# కోట్స్ సూపర్‌షీన్ తెగేది కాదు!

చెప్పడం మరవకండి-'సూపర్‌షీన్‌తో కుట్టండి'

సూపర్‌షీన్ ఎన్నుకోండి.

సూపర్‌షీన్ సులభంగా జారేలా ప్రత్యేకించి తయారుచేయబడిన 3 పొరల మెర్సిరైజ్డ్ దారం. ఇది దృఢంగా ఉండి కుట్టుపనిలో గట్టి సౌకర్యాన్నిస్తుంది.

షర్టులు, జాకెట్లు, ఫ్రాకులు వగైరాలకు సూపర్‌షీన్ ఎన్నుకోండి. అన్ని తేలిక బట్టలకూ సూపర్‌షీన్ శ్రేష్ఠమైనది.

మధురా కోట్స్ ఉత్పాదన

కోట్స్
## సూపర్‌షీన్




కోట్స్ - ఉత్తమ దారాల ఉత్పత్తిదారులు.

CHAITRA-B MCL 2A TEL R



''అదిగో అల్లదిగో''లో మహేష్, అత్రి లక్ష్మి, గుమ్మడి

## ఏరంజీవి, మాధవి నాయకా నాయికులుగా "శాంతి నివాస్"

.''నాగరికతా వ్యామోహంలో ఆడంబరాలకు, ఆర్భాటాలకు పోయి ఎన్నో కుటుంబాలు పతన మవుతున్నాయి. అర్థం, కామం, క్షుద్రవిద్య మానవ జీవితంపై చూపే ప్రభావాన్ని విమర్శ నాత్మకంగా రూపొందించబడిన కుటుంబ గాథా చిత్రం.'' అన్నారు యు. వి. బాబు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన శ్రీ లక్ష్మి సినీ చిత్రావారి ''శాంతినివాస్''లో చిరంజీవి, మాధవి, నాగభూషణం, జయంతి, రాజనాల, ప్రసాద్‌బాబు, ప్రతిమ, నరసింహరాజు, సుందరి (శశిరేఖ), హరిప్రసాద్, లక్ష్మీకాంత్, కే. కే. ఎం. ఆర్. ఆర్. వాసు, మనోరమ, జయ విజయ, మాడా, చిట్టిబాబు, జింబో పాత్ర ధారులు. జయశ్రీ రామారావు కథకు పాటిబండ్ల విజయలక్ష్మి మాటలు రాశారు. చంద్రశేఖర్ సంగీతం, దిలీప్‌సింగ్ శిల్పం, అంకిరెడ్డి కూర్పు, రణధీర్ నృత్యాలు, నందనవనం రాధాకృష్ణ మూర్తి నిర్వహణలో శాయి ఫిలిమ్స్ కంబైన్స్ సమర్పించే ఈ చిత్రం మే విడుదల.

## శ్రీ సాయి ఆర్ట్ క్రియేషన్స్ తొలి చిత్రం

''నాయికా నాయకులుగా కొత్త వారికి అవకాశం ఇవ్వాలనుకుంటున్నాం,'' అన్నారు వై. బి. ప్రసాద్. ఈయన నిర్మించే తొలి చిత్రానికి ఏప్రిల్ 12న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. రమేష్ నాయుడు స్వరకల్పనలో రెడ్డి శ్రీనివాసరావు, ఈ చిత్ర సహ దర్శకుడు టి. ఎస్. రామారావు రాసిన ఐదుపాటలు ఆ తర్వాత రికార్డయ్యాయి. డి. వెంకటరత్నం సంకలనకర్త. కథను వరలక్ష్మి సమకూర్చారు. ''కాకినాడ, అన్నవరం ప్రాంతాల్లో మే మొదటి వారంనుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగిస్తాం,'' అన్నారు ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కిరణ్. ఈయన లోగడ ప్రసాద్ స్టూడియోస్‌లో ఇంజనీరింగ్ శాఖలో, వాహినీలో లేబరేటరీలో, విన్సెంటు వద్ద సహాయ ఛాయ గ్రాహకుడుగా, శ్రీధర్ వద్ద దర్శకత్వ శాఖలో, ప్రస్తుతం దేవర్ ఫిలిమ్స్ స్టోరీ డిపార్ట్ మెంట్‌లో పని చేస్తున్నారు.

## దాసరి, శోభన్ కాంబినేషన్‌లో యువచిత్ర కంబైన్స్ చిత్రం

''మే 15 నుంచి షూటింగ్ ప్లాన్ చేశాం,'' అన్నారు కె. మురారి. ఈయన ''సీతామాలక్ష్మి, గోరింటాకు, త్రిశూలం'' లాంటి విజయవంతమైన చిత్రాల అనంతరం దాసరి నారాయణరావు రచనా, దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో శోభన్‌బాబు, రాధిక, విజయ శాంతి, సిల్క్‌స్మిత ముఖ్య భూమికలు నిర్వ హిస్తారు. ఆత్రేయ గీతాలు, కె. వి. మహదేవన్ సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పంతో కె. నరసింహం నాయుడు సమర్పిస్తారు.




## పి.ఆర్. — మద్రాస్

'లెప్రసీ' ప్రారంభదశలోనే కనుక్కొని మందులువాడితే తగ్గుతుందా? మందులు ఎన్ని రోజులు వాడాలి? ఎన్ని రోజులు వాడితే పూర్తిగా తగ్గుతుంది?

★ తప్పకుండా వాడాలి. నాన్ లెప్రొమాటస్ రకానికి వరుసగా మూడేళ్ళు, బార్డర్ లైన్ రకానికి అయిదేళ్ళు, లెప్రొమేటస్ రకానికి ఏడునుంచి పదేళ్ళపాటయినా మందులు వాడవలసి ఉంటుంది,

వైద్యులు పరీక్షించి ఇక మందుల అవసరం లేదని చెప్పేదాకా వాడటం చాలా అవసరం.

## జె. బి. — నర్సరావు పేట

నాకు 5 సంవత్సరముల వయస్సు గల అమ్మాయి వున్నది. అది ప్రతిరోజూ రాత్రి నిద్రలో పళ్ళు కొరుకుతున్నది. దీనికి కారణ మేమిటి? దీనికి ఏమి చెయ్యాలి?

★ మానసిక ఉద్విగ్నత వల్ల ఇలా పళ్ళు నూరటం (టీత్ గ్రైండింగ్) చేస్తారని నిపుణుల అభిప్రాయం. అతిగారాబం, అధిక కట్టుబాట్లు, తీరని కోరికలు వీటికి కొంత మేరకు కారణాలవుతాయి.

కారణాన్ని తొలగించటమే దీనికి చికిత్స.

## పి. సి. బి. — దువ్వ

నేను ఒక విద్యార్థిని. నాకు నత్తి వున్నది. కొత్తవాళ్ళతో మాట్లాడేటప్పుడు అది చాలా ఎక్కువగా వచ్చేస్తుంది. దీనివల్ల నేను ఎన్నో అవకాశాలు పోగొట్టుకున్నాను. దీనికి మీ సలహా ఏమిటి?

★ మీరు మైసూరులోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్‌కి వెళ్ళి అక్కడి స్పీచ్ తేరపిస్టులని సంప్రదించండి.

## డి. ఎస్. ఆర్. — మంగళగిరి

నేను మలవిసర్జన చేసినప్పుడు మలంలో తెల్లగా క్రిములు వుంటాయి. ఇవి 2,3 సెంటీ మీటర్లు వుంటాయి?

★ వీటిని ఆక్సీయూరిస్ వెర్మికు లారిస్ అని అంటారు. నులి పురుగులని మనం వీటిని వ్యవహరిస్తాము.

ఈ పురుగులు కుటుంబంలోని సభ్యులలో చాలామందికి ఒకేసారిగా ఉండే అవకాశం ఉంది. అందరూ మందుని ఒకే సమయంలో వాడటం అవసరం!

పైపరజీన్ . సిట్రేట్ అనే మందుని రోజుకి రెండు, మూడు స్పూన్ల వంతున వరుసగా వారం పాటు వాడటం మంచిది.

ప్రస్తుతం మెబెక్స్ అనే మాత్రలు లభ్యమవుతున్నాయి. రోజుకిరెండువంతున వరుసగా మూడురోజులపాటు ఈ మాత్రలను వాడవలసి ఉంటుంది.

## జి. పి. ఆర్. — ఆలూరు

'మారేడు' ఆకువలన 'కాన్సర్' ను తగ్గించ వచ్చునా?

★ తగ్గించ వచ్చునేది శాస్త్రీయంగా పునః పరిశీలన వల్ల తేలవలసిన విషయం.

## పి.బి.ఎస్.ఎల్.ఎన్ — శ్రీకాకుళం

నా వయస్సు 13 సంవత్సరములు. నాకు మలబద్ధకము కలదు. రెండు రోజులకొకసారి వేళలేకుండా విరోచనము అవుతుంది. ఒక్కొక్క రోజు 2. 3, సార్లు వెళ్తాము. రోజూ టైముకి విరోచనము అవుటకు ఏమైనా మందులు వున్నాయా?

★ ఆకుకూరలు ఎక్కువగా వాడటం, నీరు సమృద్ధిగా తాగటం, అరటిపళ్ళు వాడటం మొదలయిన వాటివల్ల చాలామటుకు మలబద్ధకం తగ్గుతుంది. మందులు అలవాటు చేసుకోవటం మంచిదికాదు. అలవాటు 'చేసుకోవటం' అనేది చాలా ముఖ్యం.

## కె. వి. — రూర్కెలా

మా అమ్మాయి వయస్సు 10 సంవత్సరములు. రెండు సంవత్సరముల క్రితంనుండి ఎడమకాలుమీద కొద్దిభాగము తెల్లగా మచ్చ లేర్పడినవి. ఆ భాగములో స్పర్శగూడాలేదు. సంవత్సరమునుండి మందులు వాడుతున్నాము. ఏమీ ప్రయోజనము కన్పించలేదు?

★ ఈ రోగానికి కనీసం మూడు సం॥ల కాలం మందులు నిర్ణీత క్రమం ప్రకారం వాడవలసి ఉంటుంది. అప్పుడుకూడా నిపుణులైన లెప్రాలజిస్టులకి చూపించి వారు ఇంకా మందు వాడవలసి ఉందని చెపితే అలాగే చేయవలసి ఉంటుంది. 






సూర్యుడికి వృద్ధాప్యం వచ్చేసింది.

ప్రొద్దున్న పుట్టి పదిగంటలంకల్లా ఎదిగి, మధ్యాహ్నానికి మహారాజుగా మారిన మార్తాండుడిని సాయం సమయంలో ముసలితనం చుట్టేసింది.

అందుకేనేమో చూపుల్లో పగటి అందమూ లేదు. మధ్యాహ్నపు తీవ్రతాలేదు.

అలల్లా చుట్టుముట్టిన ఆలోచనల తీరుకి నవ్వుకుంది శాంతమ్మ. సూర్యచంద్రులకి వృద్ధాప్యమేమిటి ? వాళ్ళు నిత్యవసంతులు. కిటికీలోంచి చూడసాగింది.

"ఎంత అందమైనది సంధ్యాసమయం ! మరెంత ఆనందమయం !"

పగటిపూటంతా ప్రతీ ఇంట్లోనూ వచ్చేంత యాంత్రికత ఉంటుంది. ఈ సమయానికీ ఆ సమయానికీ ఎంతో తేడా ఉంటుంది. తన వయసుకీ చిన్న వయసుకీ కూడా ఎంతో తేడా ఉంది.

ప్రకృతిలోని తొందర, ప్రజలలోని తొందరా తిరుగుముఖం పట్టి నిదానంగా ఆలోచించుకునే నిముషాలివి.

పగటి అనుభవాల మూటలు విప్పి తీరిగ్గా పంచుకుంటారీవేళల్లో! అలాగే పసితనంలో చేసిన పెంకిపనులూ, యవ్వనంలో ఎదుర్కొన్న అనుభవాలు, అవి అందజేసిన అనుభూతులు నెమరు వేసుకుంటూ గడిపే వృద్ధాప్యపు ప్రశాంత జీవనానికి ఎందుకని ఇన్ని అవరోధాలు ?

శాంతమ్మ దృష్టి పార్కుమీదికి మళ్ళింది. వాళ్ళ ఇంటికి ఎదురుగా ఉన్న పార్కు చూస్తూ గడపడం ఆవిడ సాయంత్రపు అలవాటు.

ఎప్పటిలాగే పార్కు సందడిగా ఉంది. అందరినీ దాటి ఓ చోట నిలచిపోయింది ఆవిడ చూపు.

తెల్లగా సన్నగా పొడుగ్గా ఉన్న వ్యక్తి సిమెంటు సోఫాలో కూర్చుని ఉన్నాడు. అతి పల్చటి జుట్టు వెండిరంగులో పోటీ పడుతోంది.

లోతుకుపోయిన కళ్ళు, చప్పిగా వేళ్ళాడుతున్న దవడలు, కాస్త వంగిన నడుము క్రమసాయంతో అడుగులు ముందుకువేసే శరీరం ఆయన సొత్తు.

రోజా ఈ వేళప్పుడు వచ్చి కూర్చుంటాడు ఆదేస్థలంలో! చేతిలో పుస్తకం ఉంటుంది. అది ఆరంభిస్తాడు. దానితోబాటే ఆలోచనలు కూడా ఆరంభమవుతాయి కాబోలు పేజీలు త్వరగా కదలవు. ఒకోసారి అసలు మొదటి పేజీయే కదలదేమోనని శాంతమ్మ అనుమానం!

శూన్యంలోకి ఏదో వెతుకుతున్నట్లు చూడడం, ఆడుకుంటున్న పిల్లలలో తన పసితనపు జ్ఞాపకాలను పరికించడం జరిగినట్లు అనిపిస్తుంది శాంతమ్మకి!

'తనలాంటి మరో దురదృష్టవంతుడు'

దురదృష్టం ఆలోచనల్లోకి రాగానే పగటి విషయం దాని పక్కనే చేరుకుంది.

'కొడుకు తనని అపశకునం' అని కదూ అన్నాడు నవమాసాలూ మోసి కన్నందుకు! ఆ మాటని ఊరుకున్నాడా? ఊహూ! ఆ మధ్య ఎప్పుడో తాను ఎదురుపడినప్పుడు కార్యం సర్వ నాశనమైందని చెప్పి, వెధవముండలు వీధి వైపుకు రాకూడదు. వస్తే ఇలాగే జరుగుతుంది అన్నాడు. వాడికి వత్తాసు పలికింది కోడలు.

తన అవసరం వాళ్లకి చాలా ఉంది. పని మనిషిగా పాచిపని అంట్లపనితో ఆరంభమయ్యే తన దినచర్య వంటమనిషిగా కొనసాగి మళ్లీ రాత్రి అన్నీ శుభ్రం చేయవలసిన పని ఉంటుంది కనక వంట మనిషిగా వీడ్కోలు తీసుకుని పనిమనిషిగా ముగుస్తుంది.

అవన్నీ చేసినా ఫలితం పూజ్యం!

విధవకి ఉప్పకారాలున్న తిండి పెట్టకూడ దన్న పద్ధతి తన విషయంలో ఇరవయ్యవవత్సరం రాకుండానే ఆరంభమై కొనసాగుతోంది.

కాఫీ, టీల రుచి ఎరుగదు తన నాలుక!

చిరిగి పేలికలవుతున్నాయి చీరలు. పట్టించుకునేదెవరు? ఏ జ్వరమో వచ్చినా దిక్కులేదు. 'లంఖణం పరమౌషదం' అని పస్తుచేస్తారు. అలాగని విశ్రాంతైనా ఇస్తారా అంటే అదీలేదు.

కరువుదీరా కబుర్లాడేందుకు, కమ్మగా భోంచేసేందుకు వీల్లేదు.

అంతెందుకు? దినపత్రిక చదివే స్వాతంత్ర్యంకూడా తనకిలేదు. చాకిరీ చేస్తూనే చావాలి. అదే తనకి మోక్షం!

''అమ్మా!''

''అమ్మా నిన్నే!''

''ఏమిటి?'' వెనక్కి తిరిగి అడిగింది శాంతమ్మ.

''పిల్లలేదో అంటున్నారు విను!'' అన్నాడు కొడుకు రఘు.

పిల్లలవైపు తిరిగింది శాంతమ్మ.

''పార్కులో నీకో మగ స్నేహితుడి ఉండి ఉంటాడు అంటున్నాను బామ్మా!'' కన్నుకొడుతూ చెప్పాడు ప్రవీణ్.

శాంతమ్మ నివ్వెరపోయింది.

''అందుకే ఒళ్ళంతా కళ్ళు చేసుకుని అలా చూస్తూంటావని అన్నాడు. సెంట్ పర్సంట్ కరెక్ట్ అన్నాను నేను.'' అన్నాడు కొడుకు.

కొడుకూ,కోడళ్ళవైపు చూసింది శాంతమ్మ.

కొంగుచాటున కిసుక్కుమంది కోడలు. పక పకా నవ్వాడు కొడుకు.

పిల్లలిద్దరినీ మందలించవలసిన ఆ తల్లి తండ్రులవైపు తేరిపారా చూసి ముఖం తిప్పుకుంది.

మగపిల్లల్ని మహారాజుల్లా పెంచడం ఆ ఇంటి పద్ధతి. అధికారం చెలాయించడం, చిన్నంతరం, పెద్దంతరం అన్నది లేకుండా ప్రవర్తించడం వస్తోందేతప్ప చదువూ సంధ్య లలో కళాకాంతుల్లో సంస్కారంలో మాత్రం ఎదుగుదల రావడంలేదు ఆ మహారాజులకి!

''తప్పు వాళ్ళది కాదు నీది.'' అంది కొడుకుతో అతి నెమ్మదిగా!

''మా ఎవ్వరిదీ తప్పుకాదు. నీదే తప్పు!'' రెచ్చగొడుతున్నట్టు అన్నాడు కొడుకు.

గబగబా ఏదో పని ఉన్నట్లు పెరటివైపుకు నడిచింది శాంతమ్మ.

కన్నీళ్ళు కాల్వలు కట్టసాగాయి. కష్టం ఏదైనా వస్తే చనిపోయిన భర్త గుర్తుకు వస్తాడుట వితంతువులకి!

తనకలాకాదు. తనకి పూర్తిగా ఆ రూపమే గుర్తులేదు. ఎలా గుర్తుంటుంది?

ఎనిమిదవ ఏటే పెళ్ళయినా పదమూడో ఏడు వచ్చేదాకా కాపురానికి పోలేదు. అత్త వారింట్లో మాత్రం ఆయన ముఖాన్ని సావధా నంగా పరికించినదెపుడు? ఆయనగారి పలుకులు విని పరవశించినదెపుడు? పగటిపూట ఎదుట పడకూడదు. రాత్రయినా తనతో నోరారా మాట్లాడినవేమీ లేవు. ఆయన చాలా ముభావి!

అది మాత్రం ఎన్నేళ్ళు సాగిందని? ఇరవై ఏళ్ళకే తాను విధవ.

అసుర సంధ్యవేళ కన్నీళ్ళతో ఆలోచిస్తూ ఉండిపోయింది శాంతమ్మ.

* * *

సిమ్మెంటు సోఫాలో కూర్చుని ఆలోచనల్లోకి చాలా దూరంగా సాగిపోయిన భార్గవయ్య వెళ్ళి పొమ్మన్న హెచ్చరిక రావడంతో తప్పనిసరిగా లేచాడు.

క్రమ సాయంతో నెమ్మదిగా ఇంటివైపుకు అడుగులేసాడు.

ఆకలి అధికం కాసాగింది. అయినా ఇంటికి వెళ్ళాలని లేదు. ఇంట్లో ఏముంది కొడుకు కోపం, కోడలి రుసరుసలు, మనవల సణుగుడు తప్ప!

ముసలివాళ్ళు పసివాళ్ళతో సమాన మంటారు. అందుకే కాబోలు తనకి కోరికలు కలుగుతున్నాయి. ఏవేవో తినాలని, చూడాలని ఎవరితోనైనా కబుర్లు చెబుతూ కూర్చోవాలని!

తన స్నేహితులెవరైనా ఇంటికి వస్తే వాళ్ళని అనరాని మాటలని అతిగా అనందిస్తారు. అలా చేస్తే ఎవరు మాత్రం గుమ్మం తొక్కుతారు? వాళ్ళ ఇంటికి తాను ఏ ముఖం పెట్టుకుని వెడతాడు?

ఏదైనా వండిపెట్టమంటే వినదు కోడలు. పోనీ తనే కొనుక్కుని తిందామా అంటే డబ్బు ఉండదు. ఓ రోజు ధైర్యంచేసి పెన్షన్‌గా ఆ పూటే వచ్చిన పచ్చకాగితాలలో ఒకదాన్ని ఖర్చుచేసి తృప్తితీరా భోంచేసి, నాగయ్యగారి పాత సినిమా ఎక్కడో ఆడుతోందని విని, అది చూసి ఇల్లు చేరాడు.

అప్పుడు ఇంటిల్లిపాదీ ఎంత గొడవచేసారో! బుద్ధులు ముసలివి కాలేదని, 'కృష్ణారామా' అనుకుంటూ కూర్చోక పాతికేళ్ళ కుర్రాడిలా ప్రవర్తించాడని, ఇలాంటి వారుండబట్టే ఆశ్రమ





విశాఖపట్నం మేయరు శ్రీ ఎన్. ఎస్. ఎన్. రెడ్డి 55వ జన్మదినోత్సవ సందర్భంగా శ్రీ టి. సుబ్బరామిరెడ్డి (దక్షిణ భారత సెన్సారు బోర్డు సభ్యులు) ప్రముఖ పత్రికా ఫొటోగ్రాఫరు శ్రీ వాసును సన్మానిస్తున్న దృశ్యం.

## తోడొకరుండిన...

ధర్మాలు ప్రవేశపెట్టారని అంటూ ఎంతగా సాధించారో!

తనకి పుట్టిన ఒక్కగానొక్క కొడుక్కి అన్యాయం చేయబుద్ధికాక, భార్య పోయినా పెళ్ళి చేసుకోలేదు తను. అప్పుడు తన వయసు నలభయ్యే! తను ఊ అంటే ఇరవై ఏళ్ళ పిల్లని పెళ్ళి చేసి ఇవ్వడానికి ఎందరో పెద్ద మనుష్యులు సిద్ధంగా ఉన్నారప్పుడు.

ఆలోచనలు వేగంగా సాగుతున్నాయి.

అడుగులు నిదానంగా పడుతున్నాయి.

ఇల్లు చేరి తలుపు తట్టాడు పరధ్యానంగా! జవాబులేదు. మరోసారి ప్రయత్నించినా ఫలితం రాలేదు.

ఆశ్చర్యంగా తలుపు వైపు చూసాడు. పెద్ద తాళం కప్ప వేళ్ళాడుతోంది.

ఎంత ఆలోచించినా ఎటు వెళ్ళివుంటారో అంతుపట్టలేదు.

ఎన్ని నిముషాలను నిశిరాత్రి బలిగొందో!

ఎప్పటికో అంతా ఇల్లు చేరారు.

"మీరు వెడుతున్నట్లు నాకు చెప్పలేదేంరా?" కొడుకుని ఉద్దేశించడిగాడు.

"నిన్న నేను చెప్పాను కదా! మీరు తల ఊపారు కూడాను! ఇప్పుడు కొత్త విషయంలాగ మాట్లాడతారేమిటి?" అంది కోడలు.

"నువ్వు చెప్పావా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అంటే మీరు వినలేదన్నమాట!"

"వినే ఉంటానమ్మా! పెద్దవాడిని కదా మరచిపోయానేమో!"

"చూసారా ఎలా అంటున్నారో! నా మాటలు ఆయన మరచిపోగాలేనిది ఆయన అవసరాలు మాత్రం నేను ఎందుకు మరచిపోకూడదో అడగండి."

భార్గవయ్య పొడిగించలేదు.

సినిమాకి వెడితే హోటల్లో భోంచేసి వస్తారు. వెళ్ళాలని నిర్ణయించుకున్న రోజున ప్రొద్దున్నే ఓ గుప్పెడు బియ్యం ఎక్కువగా పోస్తుంది కోడలు. ఇవాళలిలాగే చేసినట్లుంది మేకుల్లా ఉన్నాయి మెతుకులు. ఏదో కతికాననిపించాడు.

రోజూ ఆఖరున భోంచేసేది ఆపైన వంట గది సర్దేదీ ఆయనే! ఇవాళ కూడా ఆ పని పూర్తి చేసి పక్క ఎక్కాడు.

బజారుపనులు మునుపటిలాగ ఓపికగా చేయలేకపోతున్నాడు. అయినా కోడలు ఊరుకోదు. రేషన్ క్యూలోనూ, ఎలక్ట్రిక్ బిల్, వాటర్ బిల్ వగైరాలు కట్టడంలోనూ ఆయన రోజులు గడిచిపోతున్నాయి. ఓపికలేదన్నా కోడలు విడిచిపెట్టదు. కూరగాయలు హోల్‌సెల్ మార్కెట్‌నుండే తేవాలి. పప్పులూ వగైరాలు సూపర్ బజార్ నుండి! ఇలాంటి బాధ్యతలన్నీ ఆయన్ని శారీరకంగా అలుపుకు గురిచేస్తే, ఒంటరితనం మానసికంగా దెబ్బతీయసాగింది.

తనకి తోడు కావాలి. సేవలు చేయడానికి కాదు. సేద దీర్చడానికి! అది అసాధ్యమని తెలుసు. అందుకే నిట్టూర్చి నిద్రకు ఉపక్రమించాడు.

*   *   *

ఆ రోజు రాత్రి టీవీలో చిలూ చేలూ కార్యక్రమం పూర్తయ్యాక 'కనబడుటలేదు' అన్న ప్రకటనలు చెబుతూ ఫోటోలు చూపించారు. అందులో ఓ అయిదేళ్ళ పిల్లాడి వివరణ అయ్యాక ఓ ఫోటో చూపించి క్రింది విధంగా తెలియజేసింది అనౌన్సర్.

"ఈ ఫోటోలోని వ్యక్తి పేరు భార్గవయ్య. ఇతను ఈ నెల తొమ్మిదవ తేదీ నుండి కనబడటంలేదు. పచ్చని శరీరఛాయ. సన్నగా పొడుగ్గా ఉంటాడు. నడుము కొద్దిగా వంగింది. వయసు డబ్భై సంవత్సరాలు. తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషలను అనర్గళంగా మాట్లాడగలడు. తప్పిపోయిన రోజు తెల్లటి లాల్చీ, తెల్లటి ధోవతి ధరించి ఉన్నాడు. ఆచూకీ తెలిసినవారు ఈదిగువ అడ్రస్‌కి తెలియజేయండి."

*   *   *

తర్వాత టీవీలో వాన పడుతున్నగా గీతలు అడ్డదిడ్డంగా పడి ఆగాయి. క్షణం గడిచాక 'మన్నించాలి ప్రసారంలో అంతరాయం' అన్న స్లైడ్ చూపించారు. ఆ తర్వాత 'మూడు పువ్వులు ఆరుకాయలు' అన్న కుటుంబ సంక్షేమ సంబంధితమైన నాటిక చూపించారు. ఆ తర్వాత మరో ప్రకటన—'శాంతమ్మ అనే అరవై మూడేళ్ల స్త్రీ కనబడటంలేదు. ఆవిడ ఫోటో ఏదీ లేకపోవడంతో పంపడం కుదరలేదని తెలియజేస్తున్నారు. పొట్టిగా, సన్నగా చామన ఛాయగా ఉంటుంది. గడ్డం మీద పుట్టుమచ్చ ఉంటుంది. తప్పిపోయినరోజు తెల్లటి ధోవతి అదేరంగు రవిక తొడుక్కుని ఉంది. ఆచూకీ తెలిసిన వారు ఈ క్రింది అడ్రస్‌కు తెలియజేయండి.'

*   *   *

మర్నాడు ప్రొద్దున్న—

కాలింగ్ బెల్ మ్రోగింది.

తలుపు తీసిన శాంతమ్మ కొడుకు కొయ్యబారిపోయాడు.

శాంతమ్మ టీవీలో నిన్న చూపించిన వ్యక్తి పక్కన నిలబడి ఉంది. నుదుట రూపాయి కాసంత బొట్టు చేతుల నిండా గాజులూ తల్లో పూవులు. అన్నింటికంటె ముఖ్యంగా మెడలో సూత్రాలూ, నల్లపూసలూ కాళ్లకి మెట్టెలు. వీళ్లిద్దరి వెనకా భార్గవయ్య కొడుకు, కోడలు, ఇద్దరు పిల్లలు ఉన్నారు. శాంతమ్మ ఇంట్లోని వారు అంతా గబగబా ముందుగదిలోకి వచ్చి నోట మాట రాక నిలబడిపోయారు.

"మేమిద్దరం పెళ్లి చేసుకున్నాం!" ఆ ప్రదేశాన్ని ఆక్రమించిన నిశ్శబ్దాన్ని నరిపేస్తూ అన్నాడు భార్గవయ్య.

అంతా కూర్చున్నాక ఆరంభించాడు భార్గవయ్య.

"మీకెవరికీ నమ్మేలా లేదీ విషయం అని నాకుతెలుసు! మీకే కాదు ఏ ఇతర భారతీయుడికీ నమ్మశక్యం కాని అంశమిది!"

మేమీ నిర్ణయానికి రావడానికి ముందు చాలా రోజులే ఆలోచనల్లో గడిపాము. ఇద్దరం జీవన సంధ్యాసమయానికి చేరుకున్నాం! ఈ వయసులో తప్పనిసరిగా 'నా' అనే వ్యక్తి ఉండితీరాలి. లేకపోతే బ్రతుకు దుర్లభమవుతుంది.

మీకు మరీ అంత కష్టం ఏమొచ్చింది? అంటారేమో! అది అనుభవించిన వాళ్ళకే తెలుస్తుంది. భార్యపోయి చాలా ఏళ్ళే అయింది నాకు. భర్తపోయి శాంతమ్మకి చాలా ఏళ్ళే జరిగాయి. అప్పుడులేని అవసరం ఇప్పుడు అధికంగా కనబడడంతో ఈ పనికి తలపడ్డాము.




తనకు కష్టమైన పనులను గురించి చెప్పతూ ఒక కవి, ఎన్నడో వ్రాసిన చాటు పద్యం ఒకటి ప్రసిద్ధంగా ఉన్నది– "శీతజల స్నానంబును, భూతల శయనంబు పూటశనంబున్– నాతిగల బ్రహ్మచర్యము, నా తరమా రావువారి నౌకరిసేయన్" అనేదే ఆ పద్యం. అతనికి కష్టసాధ్యాలయితే కావచ్చును కాని, వీటిలో చాలావరకూ కష్టాలని అనిపించవు. అలవాటు పడిన వారికి వేన్నీళ్ళకంటె చన్నీళ్ళే బాగు అనిపిస్తాయి. చల్లని నేలపైని పడుక్కోవడం కొందరికి చాలా ఇష్టం. అంచేత ఇలాటివాటిని కష్టాలకింద లెక్కించరు.

అనేక విధాలుగా శ్రమపడుతున్న వానిని చూచి "పాపం! అతడు అష్టకష్టాలూ పడుతున్నాడు" అని జాలిపడడం సర్వ సాధారణం. ఆ యెనిమిది కష్టాలూ ఏవో తెలుసుకోవాలని చాలామందికి ఉంటుంది. అవి– దేశాంతర గమనం, భార్యా వియోగం, కష్టకాలంలో బంధువులను చూడడం, ఉచ్ఛిష్టం తినడం, శత్రువులతో స్నేహం, ఇతరుల తిండికయి ఎదురుచూడడం, మోసపోవడం, దారిద్ర్యం అనేవి. కొందరి అభిప్రాయం ప్రకారం–ఇతరులను సేవించడం, లేమి, భార్యను విడిచి ఉండడం, స్వయంగా వ్యవసాయం చెయ్యడం, ఇతరులను యాచించడం, ఋణం చెయ్యడం, అడిగినవారికి లేదని చెప్పడం, దారిలో ఒంటరిగా నడచిపోవడం – అనేవి అష్టకష్టాలు. మరి కొందరి మతంలో ఋణం చెయ్యడం, ఇతరులను యాచించడం, ముసలితనం, జారత్వం, దొంగతనం, దారిద్ర్యం, రోగం, ఉచ్ఛిష్టం అష్టకష్టాలు.

ఎవరు ఏవిధంగా చెప్పినా, పయిని చెప్పిన వన్నీ కష్టాలనే అనుభవజ్ఞులకు తెలియకపోదు. దారిద్ర్యం ఎంత కష్టమైనదో, ఋణబాధ మానవులను ఎలా పీడిస్తూ ఉంటుందీ, ఇతరులను యాచించడం ఎంత హీనమో, జారత్వం, చోరత్వం మానవుణ్ణి ఎంత హీనుడిగా చేస్తాయో తెలియనివారుండరు. పైవాటిలో ఒక్కొక్కటే ఎంతో కష్టాన్ని కలిగిస్తుంది. అట్టిస్థితిలో ఇవి గుంపుగా చేరితే మానవుడి సంగతి ఎలా ఎంటుందో ఊహాతీతం. అందువల్ల వీని అన్నింటినీ తన శత్రువులుగా భావించి వీటికి దూరంగా ఉండడానికి సర్వవిధాలా ప్రయత్నించాలి.

మీరు, మనవలూ పదే పదే ఏడిపించటానికి శాంతమ్మని అన్నమాటలే ఆవిడని ఆలోచింప చేసాయి.

ఇక నా విషయానికి వస్తాను" అంటూ కొడుకూ కోడలు, పిల్లల వైపు చూసాడు. అన్నట్లు మీకు పరిచయం చేయనేలేదు కదూ! వీళ్ళు నా కొడుకూ, కోడలు, పిల్లలూ! సరే వినండి నాగోడు! తోడు కావాలని తపించిన నా మనసు నాలాంటి మరో మనస్సును చాలా తేలిగ్గా గుర్తించింది. పార్కులో కూర్చునే ఎన్నోసార్లు ఆవిడని పరికించాను. పదే పదే కళ్ళు తుడుచుకుంటూ ఉండేది. ఆవిడ వృద్ధ మనసుని నా వృద్ధమనసు అర్థం చేసుకుంది.

ఇద్దరం అలా చాలాసార్లు పరిశీలించుకున్నాం! ఆ తర్వాత ఎప్పుడో అనుకోకుండా గుడిలో కలుసుకుని గుండెలు విప్పుకున్నాం!

నేను ఆవిడతో మాట కలపడానికి ఎంత అవస్థపడ్డానని? పాతికేళ్ళ యువకుడు కూడా నేను పడిన పాట్లుపడి ఉండడు.

తను గుడికి రావడం ఎలా గగనమవుతోందో ఆవిడ వివరించిన తీరుకి విస్తుపోయాను. అరవైఏళ్ళ ఆవిడకి అన్ని కఠిన నిబంధనలున్నాయని, అవి పాటించకపోతే ఫలితాలు తీవ్రరూపాన్ని దాలుస్తాయని విన్న తర్వాత అనిపించింది నేను పడుతున్న బాధ ఆవిడ బాధ ముందు చాలా చిన్నదని!

సంకోచిస్తూనే చాలా కాలం స్నేహంగా గడిచాక వివాహ ప్రసక్తి తీసుకు వచ్చాను. 'ససేమిరా' అంది శాంతమ్మ. చాలాసార్లే ఆ విషయంలో విఫలమయ్యాను. ఓ రోజు తనంత తానే ఆ ప్రసక్తి తెచ్చింది ఆ రోజు ఆవిడ ఎలా ఉందని చెప్పను? నీటికుండలా ఉంది. 'చాలా భయంకరమైన అవమానం జరిగింది' అంది. నేను రెట్టించి బాధ పెట్టదలచుకోలేదు.

ఆవిడ సుముఖంగా ఉందని సంతోషించాను. ఆలస్యం చేయక ఆ రోజే ఆ పూటే పెళ్ళి చేసుకున్నాం! మంచి రోజో కాదో ఆలోచించలేదు. అసలు ఇంకేమీ ఆలోచించలేదు. ఆలోచిస్తే ఏముంది? అన్నివైపులా మాకు అవరోధాలేగా కనబడేది!

అంతా వినండి! వయసులో ఉన్న యువకులకి పెళ్ళి చేయాలని త్వర పడతారు అంతా! అది మంచిదే! ఏ తప్పటడుగు వేయక ముందే జాగ్రత్త పడడం అవసరం!

కానీ మా వయసు అలాంటిది కాదు. ఈ వయసులో తప్పనిసరిగా తోడుకావాలి లేకపోతే బ్రతుకు దుర్లభం!

అందుకే మేమీ పనిచేసాము!

పరువు ప్రతిష్ఠల పేరిటో, లజ్జ ఆవహించో, పిల్లలేమనుకుంటారో అని నేను వెనకంజవేయలేదీ విషయంలో! కనీసం పుస్తకాల్లో కూడా ఈ రకమైన వివాహ ప్రసక్తి కనబడదు. నేను చెప్పేది మనదేశం గురించి మాత్రమే!

ఏమైతేనేం ఇంక నాకు కర్ర అవసరం లేదు. రుచులకి ముఖం వాచనక్కరలేదు. మాట్లాడే మనిషి కోసం తపించిపోయే పనిలేదు" అన్నాడు భార్గవయ్య.

'అడుగడుగునా అవమానాలు, ఆంక్షలు ఇక నన్ను పీడించవు. శకునం ప్రసక్తేలేదు. నా విలువ నాకుంటుంది' అని శాంతమ్మ చెప్పలేదు. ఆవిడ కళ్ళే ఆ విషయం వివరించాలని తెగ తాపత్రయపడుతున్నాయి.

వింటూ కూర్చున్నవాళ్ళకెవరికీ మాటలు దొరకలేదు.

'ఆశలు తీరని ఆవేదనలో
ఆశయాలలో ఆవేశములో
చీకటి ముసిరిన ఏకాంతంలో
నీ వ్యథ తెలిసి
నీడగా నిలిచే
తోడొకరుండిన
అదే భాగ్యమూ అదే స్వర్గము'

వినిపిస్తోంది సినిమా పాట పక్కవాళ్ళ రేడియోనుండి, అక్కడి వ్యక్తులందరినీ ఆలోచింపచేస్తూ! ★

మంథా వెంకట రమణారావు సీరియల్

# ఉదయసంధ్య

( గత సంచిక తరువాయి )

రామం ఒక్క పావుగంట విశ్రాంతి తీసుకొని, ఇంగ్లీషు ఎస్సే రాసుకుందాం అనుకున్నాడు. కాని ఇప్పుడు వెంకటేశ్వరులు సోది... తరవాత బియ్యం పిండి ఆడించుకరావడం... రెండుకల్లా ఆదినారాయణ రమ్మన్నాడు. వాడికి ఇంగ్లీషు ఎస్సే రాసిపెట్టాలి. రాసిపెట్టననడానికి వీల్లేదు. వాడు స్కూలంతటికి రౌడీ. మాష్టర్లకి వాడంటే భయం. అందరికీ మొట్టికాయలు ఇచ్చే లెక్కల మాష్టారు ఆదినారాయణని అసలు లెక్కలు చేసేవా అని అడగే అడగరు. ఒకవేళ పొరపాటున అడిగినా "లేదు మాష్టారూ" అని చెప్తాడు. వాడు ఎన్నో దండయాత్రలు చేసి ఈ క్లాసుకి చేరుకున్నాడు. వెంకటేశ్వరులు రెండు దండయాత్రలు జరిపేడు. అందుకే ఇద్దరూ ముదిరేరు. ఆదినారాయణ పద్దెనిమిది దాటేడు. నల్లగా కాకిలా ఉంటాడు. పొడుగ్గా దిష్టిబొమ్మలా కనిపిస్తాడు. వాడికెప్పుడూ ఒకటే ధ్యాస. ఫుట్‌బాల్ ఆట. వాడు డ్రిబ్లింగ్ చేస్తే బంతి ఎవడికీ అందదు. వాడు కిక్ కొడితే సెంటరునుంచి, బంతి గోల్ పోస్ట్ దగ్గర పడుతుంది. వాడు ఫార్వర్డు. గోల్ కొట్టడంలో నిపుణుడు. వాడు ఎస్సే రాయకపోయినా వాడిని ఎవరూ అడిగేవాళ్లులేరు. కాని వాడికి రాయాలని ఉంది. వాడి 'ఏంబిషన్ ఇన్ లైఫ్' వాడు చెప్తాడు రామానికి. రామం రాయాలి. వాడి ఏంబిషన్ ఇన్ లైఫు కలకత్తా వెళ్లిపోయి బి. ఎన్. ఆర్. క్లబ్‌కి ఫార్వర్డ్‌గా ఆడడం. వాడి మావ, అంటే పిల్లనిచ్చేసిన తండ్రి సింత్రాగచ్‌లో రైల్వేలో ఫిట్టర్‌గా ఉన్నాడు. ఔను... ఆదినారాయణకి పెళ్లయింది, వాడు నాలుగోఫారం చదువుతున్నప్పుడే. ఇప్పుడు వాడు పెళ్లాంతో కాపురం పెట్టేడు. ఒక ఆడపిల్ల. వాడి తల్లి పాలు అమ్ముతుంది.. నాన్న మోటారు మెకానిక్‌గా ఉన్నాడు... అన్న బస్ డ్రయివరుగా ఉన్నాడు... అందరూ కలిసి ఉంటున్నారు. అక్కలకి పెళ్ళిళ్లయిపోయేయి. ఒకే ఒక చెల్లెలుంది... దాని వయస్సు పదిహేను... చదివేది ఆరోక్లాసు.. పాఠాలు సరిగా రావు... తెలుగు అసలే రాదు... దానినెవరూ ఏ మాటా అనరు స్కూల్లో... రత్నం క్లాసులో అందరికన్నా పెద్ద... హెడ్‌మాష్టరుగారి కదొక ప్రాబ్లమ్ అయిపోయింది... తక్కిన పిల్లలందరిమీదా దాని ప్రభావం పడుతోంది. అది స్కూల్లో చేరడమే ఆలస్యం. చేరేక ప్రతి స్టేషన్‌లోనూ ఆగుతూ వెళ్తోంది. "ఆదినారాయణ చెల్లెలు!"అంటారు అబ్బాయిలు. దాంతో నోరు బంద్. ఎవ్వరూ దాని జోలికి వెళ్లరు. వెళ్తే ఆదినారాయణ పాతేస్తాడు. దానికింక పెళ్లిచేద్దాం అనుకుంటున్నారు. సింత్రాగచ్‌లోనే ఒక కలాసీ ఉన్నాడుట.. ఇప్పుడు ఆదినారాయణ ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసయితే వాళ్ల మామ మంచి ఉద్యోగం ఒకటి రెడీగా ఉంచేరు. టి.టి.సి. ఉద్యోగం. అందుకు శ్రమపడుతున్నాడు ఆదినారాయణ. వాడి జీవితాశయం కలకత్తా వెళ్లడం. అది నెరవేరడానికి ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసవాలి. అది ప్యాసవడానికి సాధనం రామం... అందుకు రామాన్ని పట్టుకున్నాడు వాడు...

విశాల గదిలోకి తొంగిచూసింది..."ఏరా వెంకూ...రామాన్ని వదుల్తావా లేదా ?" అని అడిగింది విశాల. "మేం పిండి ఆడించుకు రావాలి..." "ఒసే విశాలా నువ్వాతలు పెయ్యి.

**జరిగిన కథ — 3 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు. దుర్గమ్మ కూతురు మీనాక్షి రామాన్ని ఆదరిస్తుంది. పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. ప్లీడరు సీతారామయ్యగారి మేనకోడలు నిర్మలకు రామం అంటే ఇష్టం. శాంతమ్మగారి నడిగి వాళ్లింట్లో గదిలో ఉండడానికి నిశ్చయించుకుంటాడు రామం. వెంకటేశ్వరులు రాసిన ప్రేమ పద్యాలు చదివి లత రామంమీద విరుచుకుపడి అతనిని అవమానిస్తుంది. శాంతమ్మ రామంను తమ ఇంటికి వచ్చి ఉండమని చెపుతుంది. రామం మాటలను పెడచెవిన పెడతాడు వెంకటేశ్వరులు.

నీకూ అమ్మకీ ఎప్పుడూ బియ్యంప్పిండీ అప్పడాలూ...ఆవూ ... పేడా ... ఛీ! అంత 'అగ్లీ థింగ్స్' గురించే ఆలోచన...అందమైన వస్తువుల గురించి ఎప్పుడూ ఆలోచనలేదు."

విశాల తలుపుతీసి గదిలోకి వచ్చింది.. "పద రామం...అన్నతో ఏమిటి. మళ్లా మిల్లు కట్టేస్తాడు" అంది. విశాలకి రామంతో కబుర్లు చెప్పడం అలవాటు. ఎన్నో సంగతులు మాట్లాడవలసినవి ఉన్నాయి. అన్నతోనూ, నాన్నతోనూ, అమ్మతోనూ మాట్లాడలేని ఎన్నో సంగతులు రామంతో స్వేచ్ఛగా మాట్లాడొచ్చు. మూడేళ్లయింది రామం ఈ ఊరొచ్చి. పల్లెటూరులో మిడిల్ స్కూలుంది. అదయాక ఇక్కడికొచ్చేడు. వచ్చిన దగ్గర్నించీ మాష్టారింట్లో ఉంటున్నాడు. విశాల అయిదో క్లాసుకి వచ్చినప్పట్నించీ. విశాలకి రామంతో గురువూ—శిష్యురాలి బాంధవ్యముంది. ఏం తెలియకపోయినా రామాన్నడుగుతుంది. పాఠాల సారాంశం రామం ముందుగానే ఆమెకు చెప్పేస్తాడు. క్లాసులో మాష్టారు చెప్పేది వింటూ ఉంటే పాఠం మనస్సులో పేరుకుపోయేది. రామంలా దస్తూరీ ఉంచుకుందుకి విశాల ప్రయత్నం...రామంలా క్లాసుకి ఫస్టు ఉండడానికి ఎప్పుడూ తాపత్రయం...రెండింటిలోనూ సఫలం పొందింది...వచ్చే ఏడు రామం మరి ఇక్కడుండడు. పరీక్షలు ఇవ్వగానే వాళ్ల ఊరు వెళ్లిపోతాడు. ఏదో ఉద్యోగం చూసుకుంటాడు...విశాలకి ఇప్పట్నించీ బెంగ పట్టుకుంది. రామం వెళ్లిపోతే తన గతేమిటి?...తనకి పాఠాలు చెప్పేవారెవరు...ధైర్యం ఇచ్చేదెవరు? తనకి కాలేజీలో చదవాలని ఉంది...డాక్టరవాలని ఉంది...స్టెతస్కోపు మెడలో వేసుకొని, తెల్ల డ్రస్‌తో ... "డాక్టర్ మిస్. విశాల... ఎం. బి. బి. యస్..." అన్నబోర్డు ఇంటి ముందు ఉంటుంది. ఒక కారు ... నౌఖర్లు...ఇన్ని కలలున్నాయి నెరవేరడానికి.

సంచీ రామానికిచ్చింది. "నే వెళ్లి ఆడించుకు వస్తాలే...నువ్వెందుకు?" రామం అన్నాడు. "పిండి ఏ మాదిరిగా ఆడాలో చెప్తాను. నువ్వొత్తి మొరుమే ఆడించుకొస్తావ్." వెంకటేశ్వరులు గొడవనించి బయటపడ్డాడు. దారిలో అడిగింది విశాల..."ఎవర్ని ప్రేమిస్తున్నాడు అన్న ?" ఆశ్చర్యంగా అడిగేడు రామం. "విన్నావా ?" "ఏదో కొంత..." "మరి నన్ను అడగడం ఎందుకు ?" "నీ నోటంట వినాలని..." పెంకెగా చూస్తూ అంది.

"నాకీ గొడవలేమీ తెలీవు విశాలా. ఇందులో పడడం నాకిష్టం లేదు. మీ అన్న ఇంకా అల్లరి చేస్తే నేను మరో ఇల్లు చూసుకోవాలి. నాకిందులో సంబంధం ఉందనుకుంటున్నారందరూ. నిర్మల అక్కడికి వచ్చీమంటోంది...."

విశాల ముఖం పాలిపోయింది..."నిర్మల... దాని మాటంటే నీకెక్కువా? ఆ ఇంట్లో దానిదే

నేమిటి రాజ్యం ? ఒచ్చీమందా ... ఆ ఇల్లు దానిదా ? అది నీకు వండి పెడుతుందా ఇంక?''

కళ్లల్లో కోపం. నిర్మల తనకన్నా పొట్టి. తనకన్నా నలుపు. తన తెలివితేటలు దానికి లేవు. దాని మాటలంటే వీడికి గురి. అన్నకి భయపడి పారిపోతాడా ? రామం మాట్లాడక పోవడంతో కసిగా అడిగింది...''నాకన్న ఆ నిర్మలంటే నీకు ఎక్కువ ఇష్టం ... అంతేకద.''

విశాలకేసి చూసేడు రామం. విశాల సాధారణంగా కన్నీళ్లు పెట్టుకోదు...కాని ఇవాళ కళ్లు చెమ్మగిల్లినట్టున్నాయి. నిర్మల అంటే దీనికి పడదు. క్లాసులో పక్క పక్కని కూర్చున్నా సరిగా మాట్లాడుకోరు. కారణం తను. నిర్మలకి నోట్సురాస్తే విశాలకి చూపిస్తుంది. విశాలకి ముందుగా పాఠాలు చెప్తే తన ప్రావీణ్యం నిర్మల ముందు చూపిస్తుంది, దాంతో ఇద్దరికీ తగువు. చిన్నప్పుడు బొమ్మల కోసం తగువులాడుకున్నట్టు తగువు. తన ఇష్టాయిష్టాలతో ఎవరికి ప్రమేయం. అలాటి పని చెయ్యకు నాకిష్టంలేదంటే వెంకటేశ్వరులు విన్నాడా ? నాకా కవిత్వంతో సంబంధం లేదంటే లత నమ్మిందా? ఇప్పుడు తను ఏం చెప్పినా విశాల నమ్మదు. తము అనుకుంటున్నదానికి అనుగుణంగా లేకపోతే ఎవరూ ఇష్టపడరు ఏ మాట చెప్పినా.

''నా ఇష్టంతో ఎవరికి పని ?'' మిల్లు చేరుకున్నారు. మిల్లువాడికి పప్పు బియ్యం కలిపిన సంచీ ఇచ్చేరు. ఐదు నిముషాల్లో పిండి ఆడీసేడు. డబ్బులిచ్చేసి పిండి తీసుకొని ఇంటి ముఖం పట్టేరు. అప్పుడు విశాల జవాబిచ్చింది. ''నీ ఇష్టంతో నాకు పనుంది'' నిశ్చయంగా గొంతు.



తెలివి తేటలున్న మనిషి. ఇంట్లో దానిమాటకి తిరుగులేదు. పెద్ద కబుర్లు చెపుతుంది. ఇరుగు పొరుగు అమ్మలక్కలొచ్చినప్పుడు వాళ్లకీ తనకీ వయసు భేదం లేదన్నట్టు మాట్లాడుతుంది. కాని ఇవాళ, ఈ క్షణం విశాల అన్న ఈ వాక్యం చాలా వింతగా ఉంది. ఆ మాటల్లో దృఢత్వం. "అంటే?" అన్న ప్రశ్న వేసేడు. దానికొచ్చే జవాబు తెలీదు. తన ఇష్టాయిష్టాలని కూడా నిర్ణయించే మనుష్యులున్నారని తెలుసుకోడం ఇదే మొదటిసారి ...

విశాల నడక వేగం తగ్గించింది ... "నువ్వంటే నాకిష్టం. అందుకు నీ ఇష్టంతో నాకు పనుంది ..." గొంతు బరువుగా మార్చి, మెల్లిగా మత్తుగా ధ్వనించేలా అంది ఆ మాటలు. నువ్వంటే నాకిష్టం, అని ఆడపిల్ల కాదు, ఎవరూ ఇప్పటికి తనతో అనలేదు. అనవలసిన అవసరం ఎవరికీ పడలేదు, నాన్నకాని అమ్మకాని అనవలసిన అవసరంలేదు. తమ్ముళ్లు, చెల్లి ఆ మాట తను అనాలని ఎదురుచూస్తారు. ఇక్కడ వారాలు చేసుకుంటున్న నాలుగిళ్లలోనూ ఎవరికీ తనంటే ఇష్టం ఉన్నట్టు మాత్రం తనకనిపించలేదు. తనొక అంతరాయంలానే కనుపించేడు ... "తయారయిపోయేడా ... తిండికి... !" అన్న భావమే ముఖంలో అగుపడుతుంది. విశాల ఆ మాటలు అనేసరికి రామం గుండె ఉద్ధృతంగా కొట్టుకుంది. ఆ మాటలు ఎంతో తియ్యగా వినిపించేయి. తనకి సహాయంగా ఒకమనిషి తన ప్రక్కకొచ్చి నిల్చోబోతోంది.



# ఉదయ సంధ్య

నేనంటే ఇష్టమంది ... ఆ మాట అనీసేక తనని ఏం చెయ్యమంటుంది? తనమీద ఒక అధికారం సంపాదించుకుంటోందా? నువ్వంటే నాకిష్టం కాబట్టి, ఆ ఇష్టం పోకుండా నువ్వు చూసుకో. నాకిష్టమైన పనులే చెయ్యి. అని దాని అర్థం కావొచ్చు ...

"విశాలా! నాకందరూ ఇష్టమే. నువ్వూ, వెంకూ, నిర్మలా, సావిత్రీ, లతా ..."

విశాల రామం చేతిమీద కొట్టింది గట్టిగా. "ఒరే మొద్దూ ... నీకు చదువు తప్ప మరే సంగతీ బుర్రలో కెక్కదా? నీకందరూ ఇష్టమే. కాని నువ్వంటే ఎవరి కిష్టంరా? నిర్మలకి ఇష్టమా? అది చెప్పిందా నీకు? చెప్పదురా... నీ చేత నోట్సు రాయించుకుంటుంది. నిన్ను వాడుకుంటుంది. నిర్మలకి నువ్వంటే ఇష్టం లేదురా ... దానికి దాని బావ ... సుబ్బడంటే ఇష్టం. ఇప్పటికన్నా అర్థమయిందిరా ..."

రామానికి గొంతు ఎండిపోతున్నట్టనిపించింది. విశాల అంటున్నదేమిటి? అయితే ఇష్టం అంటే ఏమిటి? నిర్మలా ... సావిత్రీ ... చంద్రం ... ఎవ్వరూ తనని అయిష్టంగా చూడరే ... విశాల మాటలు వింతగా ఉన్నాయి. "నాకేం అర్థంకాలేదే నీ గొడవ ..." అన్నాడు విసుగ్గా.

"అయితే విను ... నువ్వు ఇల్లు వదిలి ఆ నిర్మల ఉన్న ఇంటికి వెళ్లడానికి వీల్లేదు, నువ్వు ఈ ఊళ్లో ఉన్నంతకాలం" ఆమె గొంతు బొంగురుపోయింది ... "మార్చిలో మీ ఊరు వెళ్లిపోతావు ... నా చదువెలా అవుతుంది? నాకెవరు పాఠాలు చెప్తారు? నువ్వు కాలేజీలో చేరు రామం... ఇప్పట్నించీ ఏం ఉద్యోగం చేస్తావు?"

"సరేలే... అంటే ఇల్లు వదిలి వెళ్లన్లే ... కాని వెంకూ నన్ను చదవనిస్తాడా? పరీక్షలు మూడు నెలలు లేవు ..."

"అది నేను చూసుకుంటాను ..." ధైర్యంగా అంది...

"సరే... నీ ఇష్టం ..." నిరుత్సాహంగా అన్నాడు రామం. అవూ ... గేదే... వాటి సంరక్షణ... ఇంట్లో చిల్లర మల్లర పనులు మాత్రం తప్పవు ... డిసెంబర్ తరవాత సెలెక్షన్స్‌వుతాయి. అదయేక శెలవలు. స్కూలుకి పోయి పగలక్కడ కూర్చొని చదువుకోవాలి...

## 5

ఆదినారాయణ ఇల్లు చేరుకోడానికి కొన్ని మురికి కాలువలు, ఏన్నో సందులు, కోళ్ల గుంపుల్ని దాటవలిసి వచ్చింది. ఆ వీధిలో కాళింగుల మగ్గాల చప్పుడు ఎప్పుడూ వినిపిస్తుంది. వీధంతా తమదైపోయినట్టు, నేయబోయే బట్టకి నూలుని వీధిలో కుదురుస్తారు. ఒక పూరిల్లు ముందు ఆగేడు రామం. గోడలు సున్నంవే. ఇంటి గడపలో ఒక నులక మంచం ఉంది. ఇంటి ముందు, వీధి మధ్యకి ఒక రావి చెట్టుంది. రావి చెట్టుచుట్టూ సిమ్మెంటు చప్టాకట్టేరు. రామం వెళ్లి ఆ సిమ్మెంటు చప్టా మీద కూర్చున్నాడు. ఆదినారాయణ రెండేళ్ల కూతురు రామం దగ్గరికి పరుగెత్తుకు వచ్చింది. మొలకి వెండి బిళ్ల, రక్షరేకు. చేతులకి బంగారు మురుగులు .. మెడలో పులిగోరు కాశీతాడుకి వ్రేలాడుతూ. దాని కోసం రామం పిప్పరమెంట్లు కొని తెచ్చేడు. రామం కనిపించగానే అది నవ్వుతూ పరుగెత్తుకొస్తుంది చెయ్యిజాచి. దానికి కావల్సినది దొరికిపోగానే అమ్మని పిలిచింది...

ఆదినారాయణ భార్య వరలక్ష్మి బయటకు వచ్చింది. రామాన్ని చూడగానే నవ్వుతూ పలకరించింది... "ఏం తమ్ముడూ... యెక్కడా కనిపించడం లేదు... మావేఁడి... అని ఇదొకటే గోల.. యెలాగున్నావు ... మీ యమ్మా నాన్న కూలాసగున్నారా?" అని తాను చాలా పెద్దదయిపోయినట్టు అడుగుతోంది వరలక్ష్మి. ఆదినారాయణకీ ఆమెకీ వయసు భేదం ఉంటే ఒక ఏడుంటుంది. ఆదినారాయణకి పదిహేడు వెళ్లేయి. ఈమెకి పదహారు వెళ్లేయి. పద్నాలుగో ఏట కాన్పు. ఇంటెడు పనీ, ఈమె, అత్తగారూ కలిసి చేస్తారు. క్షణమన్నా తీరుబాటుండదు. పెద్దతోటి కోడలు కాన్పుకి పుట్టింటికి వెళ్లిపోయింది. ఆ ఇంట్లో లోపుల పోపుల సారగల్లా గదులున్నాయి. పెద్ద కొడుకూ కోడలూ, పిల్లలూ ఒక గది, ఆదినారాయకీ భార్యకీ ఒక గది, తండ్రికీ ప్రత్యేకంగా ఒక గది... అందులో రత్నం కూడా ఉంటుంది. తల్లి వీధిలోని నులక మంచంమ్మీద పడుకుంటుంది. ఇది వాళ్ల స్వంత ఇల్లు ... ఇంతలో ఆదినారాయణ తల్లి కూడా వచ్చి కుశల ప్రశ్నలు వేసింది. "ఈడిప్పుడే యాడకో పోనాడు. నువ్వొస్తే ఉండమన్నాడు ... ఇది కదా పొంస్తాడు..." అంది. "వొరం...మీ తమ్ముడికి టిఫినెట్టే..." అని చెప్పింది. ఆదినారాయణ తల్లి పాతకాలపు మనిషి. రవిక వేసుకోదు. ఒళ్ళంతా చీరే కప్పేలా కట్టుకుంటుంది. ఇంటి యజమాన్యం అంతా ఆవిడదే. భర్తా, పెద్ద కొడుకూ రోజువారీ, నెలవారీ ఆర్జించే డబ్బు తెచ్చి ఆమెకిస్తారు. వాళ్ల ఖర్చులకి కొంత డబ్బిచ్చి తక్కినది ఈవిడ తీసుకుంటుంది. పెద్దకొడుకు లారీ డ్రయివరు. లైనుమీదకి వెళ్లి వస్తే పది రూపాయలకి తక్కువ ఇవ్వడు భర్తకి చిన్న గేరేజుంది. అక్కడ ఇద్దరు కుర్రాళ్ల సాయంతో ట్రక్కులు, కార్లు రిపేరు, ఓవర్‌హాలింగు, ఇంజను బోరింగు పనులు చేస్తాడు. ఇంజను రీ బోరింగులో నిపుణుడు. ఇంజను శబ్దాన్ని బట్టి, బండికేంరోగంవచ్చిందో చెప్పేగలడు. రోజుకి ఇరవైకీ తక్కువలేకుండా ఉంటుంది ఇతని ఆదాయం.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తిగల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL

# ఉ ద య స ం ధ్య

ఈ డబ్బులోంది మిగిల్చి ఆ వీధిలోనే వడ్డీలకిస్తుంది అంకమ్మ, అంటే ఆదినారాయణ తల్లి. కోళ్లని పెంచి గుడ్లు అమ్ముతుంది. నాలుగు గేదెలున్నాయి. వాటి పాలు వాడిక్కిస్తుంది హోటళ్లకి. వాళ్లే వచ్చి పట్టుకపోతారు.కాబట్టి మొగ్గలు తొడిగిన పళ్లచెట్టులా ఉందా సంసారం. పువ్వులు పూచి, కాయలు కాచి, అవి పళ్లు అవాలని కలలు కంటోంది అంకమ్మ. ఇప్పుడామె కలలకి కొన్ని కొన్ని అడ్డు ఏర్పడుతున్నాయి. ఆదినారాయణ్ని స్కూల్ఫైనలు పాసయి మామ గారింటికి పోతానంటున్నాడు. అది ఆమె కేమాత్రమూ ఇష్టం లేదు. వాడు ఈ వూరు వదిలి పోడానికి వీల్లేదు. గేరేజ్ పెద్దదౌతుంది. తన విద్య నేర్పి తనకి అసిస్టెంట్‌గా చేసుకుందామని చూస్తున్నాడు తండ్రి. ఇప్పుడే ఇంట్లో చిన్న క్రయిసిస్ వచ్చింది.

"లోపలికి రా తమ్ముడూ... వీధిలోనే కూచుండిపోనావు..." అని ఆహ్వానించింది వరలక్ష్మి. రామం లేచి లోపలికి వెళ్ళేడు. కోళ్లని దాటుకుంటూ ఆదినారాయణ గదిలోకి వెళ్లేడు. గదికొక కిటికీ వుంది. ఆ కిటికీలోంచి పెరట్లోని పశువుల సాల, గుమ్మిడిపాదు, ములగచెట్టు, నుయ్యీ కనిపిస్తున్నాయి... గది శుభ్రంగా ఉంచింది వరలక్ష్మి. పెద్ద, నల్ల పందిరిమంచం కిటికీకి ఆనుకొని వుంది. దానిమీద పరుపు, తలగడలు... నీలి దుప్పటీ. ఒక మూలకి డ్రాయర్లతో టేబిలు. దానిమీద ఆదినారాయణ పుస్తకాలు. దానిమీదే టేల్కంపౌడరు డబ్బా, కాటిక, నూనెసీసా, గోడకి పెద్ద అద్దం. ఆ టేబిలు ఇద్దరికీ ఉపయోగపడుతోంది. ఒక మూలకి దండెం ఉంది... దానిమీద, చీరలు, రవికెలు, ఆదినారాయణ బట్టలు వేలాడుతున్నాయి.

రామం గదిలోకొచ్చేక, వరలక్ష్మి అతని చెయ్యి పట్టుక కుర్చీలో కూర్చోపెట్టి అంది... "తమ్ముడూ...నీతో ఒక సంగతి మాట్లాడాల" గొంతు తగ్గించింది. "మీ బావ సంగతి..." వరలక్ష్మి ముంగుర్లు కళ్లలోకి పడుతున్నాయి. నుదుట చెమటబిందువులున్నాయి పని ఒత్తిడి వల్ల. నల్లగా ఆమె కళగా ఉంది. ఆరోక్లాసు వరకూ చదివిన వరలక్ష్మి చదువుకున్న పిల్లలా ఉందామని ప్రయత్నిస్తుంది. లేటెస్ట్ ఫేషన్లో రవికలు కుట్టిస్తుంది. చీరలు అలానే కడుతుంది. మొగుడితో కలిసి సినిమాలకి వెళ్లి పక్కనే కూర్చుంటుంది, ఆడవాళ్లవేపు వెళ్లక. యాస మాని సినిమాలోని హీరోయిన్‌లాగ మాట్లాడదామని ప్రయత్నిస్తుంది.

రామం ఆశ్చర్యపోయేడు. తనతో మాట్లాడవలసిన ముఖ్యమైనసంగతులు ఎదిగిన మనుష్యులకి ఉన్నాయంటే వింతగా అనిపించింది.

''చెప్పండ...'' ఆమె కళ్లలోకి పరికిగా చూస్తూ అన్నాడు. వరలక్ష్మి టేబిల్ ఫేన్ ఆన్ చేసింది. ''ఉండు... ముందు నీకు తినడానికి తేనీ... మాంసం కాదులే... నువ్వు మా యింట్లో తినవు... నీకోసం యేరేగా కూరలుజేసి వొండి పెడతానంటిగా... అలాగ ముట్టోడిలా యీ డింటా... ఆడింటా ఏల తినాలి చెప్పు నువ్వు... నీ జాతి పోద్దా ? నీ కెవుడూ బామ్మళ్ల పిల్ల నిచ్చి పెళ్లి చెయ్యడా ?...'' మాయమయింది వరలక్ష్మి...

రత్నం ఎక్కడికి పోయింది చెప్మా... ఈ పాటికి పసికట్టేసి వచ్చేసును.

పూతరేకులు, జంతికలు, చక్కిలాలూ, ఒక విస్తరాకులో పెట్టి తెచ్చింది వరలక్ష్మి.

''ఇవన్నీ నేను తినలేనండీ...'' అన్నాడు రామం. ఇక్కడికెప్పుడు వచ్చినా తినడానికి ఏదో ఒకటి పెడతారు. ''ఏమున్నాయి ... తిను... బాపనోడివి ఆపాటి తిన్లేవా ?'' బ్రాహ్మడికి తిండితప్ప మరో ధ్యాసలేదని ఆమె అభిప్రాయం.. రామం తింటూఉంటే ఎదురుగా నిల్చుంది... కొంతసేపయేక గొంతు తగ్గించి చెప్పింది... ''నీ స్నేహితుడు యెలా పేసవుతాడో మరి స్కూల్ పైనలు... అది నీ పూచీ తమ్ముడూ... నువ్వే సాయపడాల... నువ్వు తల్చుకోపోతే అవడు. నా కెందుకింత యిదంటావ్ ?'' గొంతు బాగా తగ్గించింది రహస్యం చెప్తున్నట్టు. ''తమ్ముడూ.. నేనీ యింట్లో ఉండలేను... యీడుండి పని చెయ్యలేను. యీ ఊరొదిలిపోవాలి... కలకత్తా పోవాలి... మా అయ్య రెయిల్ వేలులో ఉద్యోగం రెడీగా ఉంచినాడు. స్కూల్ పైనల్ పాసవాలి... కలకత్తా చూసినావా ? సూడ్లే దలా ?... సాంత్రిగచ్ లో మా అయ్య ఇంట్లో ఉంటాము.. మీ బావ రైల్లో యెల్లి సాయంత్రాని కొచ్చేస్తూ ఉంటాడు... ఆడేంపని సెయ్యక్కర్లేదు... బంతి అడ్డమే... యీ ఇల్లు చూసినావా ? పొద్దున్న కాడ్నుంచి పనే... నేనే వొండాలి... ఇల్లు సుబ్రం సెయ్యాలే... గేదెల్ని సూడాలి... అంకమ్మ సాయంసేస్తాదనుకో ... కాని నేనుచెయ్యలేను బాబూ !''

రామం ఏమీ అనలేదు. ఆదినారాయణ ఎలానూ ఇక్కడుండడు. వాడు ఫుట్ బాల్ వెంట పడి పరుగెత్తి వెళ్తాడు, అది ఎక్కడికి తీసుక వెళ్తే అక్కడికి... పూతరేకులు చాలా బాగు న్నాయి. నెయ్యి ఎక్కువగా వేసేరు... ఊరు వెళ్లినపుడు ఇంటికి తీసుకెళ్లాలి. ''పూత రేకులు చాలా బాగున్నాయి... ఎవరు చేసేరు ?'' ''అత్త చేసింది. బాగున్నయ్యా...? అంకమ్మా! నీ యల్లుడుకి పూతరేకులు బాగున్నాయంట !'' అని కేకేసింది. ''మరో రెండెయ్యే... అల్లుడు అల్లూరెల్లినపుడు ఒట్టుకెల్లమను ..'' అని అంకమ్మ ఎక్కడినుంచో కేకపెట్టింది.

రామం అన్నాడు... ''అలాగె. ఏ ప్రశ్న లొస్తాయో లిస్టుచేసి, వాటికి జవాబులుకూడా తయారుచేసి ఇస్తాను, అవి చదువుతే చాలు... ఆది పాసవుతాడు.''

''మా బాబే !'' అని సంతోషంతో రామం బుగ్గ ముద్దుపెట్టుకుంది వరలక్ష్మి. పైటలాగి వదులుగాఉన్న రవిక, అందులోనుండి ఆమె అందమైన శరీరం కనిపించింది ఆమె ముందుకు వంగినప్పుడు. ఈ అనుకోని పనికి, స్త్రీ స్పర్శకి, కనుపించిన దృశ్యంవల్లా రామానికి బుర్ర గిర్రున తిరిగింది. సిగ్గు ముంచుకొచ్చింది. కళ్లు దించుకున్నాడు... ''యిక్కడికే ఒచ్చి సదువుకో... యీ గది నీకొగ్గేస్తాను...''అంది.

ఇంతలో సుడిగాలిలా వచ్చింది రత్నం. ''బావొచ్చినావా... యెంతసేపయింది...''

''ఇప్పుడే... అన్న ఒస్తున్నాడా ?'' రామం అడిగేడు.

రత్నం బాగా ఎదిగిన పిల్ల. ఏళ్లు పదిహేనే అయినా ఆరోక్లాసులో ఆమె ఉండడం అందరికీ ఇబ్బందే. హెడ్‌మాష్టారు ఆమె తండ్రిని పిలిచి సలహా ఇచ్చేరు. ఈ ఏడాది తరవాత స్కూలు మానిపించి, ఇంటిదగ్గర బాగా కోచింగ్ ఇప్పించి, ఒక ఏడాది తరవాత చిన్న పరీక్షపెట్టి నాలుగో ఫారంలో ఎడ్మిట్ చేస్తే మంచిదని. కాని ఒకటే ప్రోబ్లము. ఈ పిల్ల ఇంటిదగ్గర అసలే చదవదు. ఈ ఇంటికీ ఆ ఇంటికీ తిరిగేసరికే సరి. వీధల్లా దానికి స్నేహితురాళ్లే. అందరూ పదేళ్ల లోవు వాళ్లు. తన మెంటల్ వయసున్న వాళ్లతో రత్నానికి స్నేహం... తన వయసు పిల్లల్తో కాదు.




ఇప్పుడు రత్నం బాధ్యతకూడా రామం మీద పెడదామని చూస్తున్నాడు రత్నం తండ్రి. ఒకటి రెండుసార్లు ఈ సంగతి మాట్లాడేడు. రామానికి వీలున్నప్పుడల్లా వచ్చి రత్నానికి ట్యూషన్ చెప్పగలడా ? రత్నం చదువుమీద దృష్టి నిలవటం లేదు. ఎంతమంది గురువులు వచ్చేరు. వెళ్లేరు. కాని రామం దగ్గర కూర్చోపెట్టి క్లాసు పాఠాలు చెప్తే శ్రద్ధగా వింటుంది. అర్థం చేసుకుంటుంది. ఇది అందరూ గమనించారు.

రత్నం నలుపూ, తెలుపూకాదు. మధ్య రంగు. పరికిణీ జాకెట్ వేసుకుంటుంది. వోణీ వేసుకోదు, ఎదిగిన శరీరపు వంపులు కనిపిస్తున్నా. ఆరో క్లాసు చదువుతోంది కాబట్టి ఆ పిల్లల్లా ఉండాలనుకుంటుంది. జుత్తు అతి నల్లగా, ఉంగరాలు తిరిగి, ఒత్తుగా పొడుగ్గా ఉంది. కనుబొమ్మలు తీర్చిదిద్దినట్టున్నాయి. కాటుక పెట్టుకోకపోయినా, కనురెప్పలు సహజంగా నల్లగా ఉన్నాయి. నవ్వినప్పుడల్లా చిన్నపళ్లు మల్లె మొగ్గల్లా మనోహరంగా కనిపిస్తాయి. ఆమె చర్మానికొక నిగారింపుంది. చర్మం నునువుగా మెరుస్తుంది. ఆమెకి తన శరీరం గుర్తుకేవట్టే, అతి సహజంగా తిరుగుతుంది. గెంతుతుంది, కిరుగెడుతుంది, ఏ మాత్రం బిడియం లేకుండా మాట్లాడుతుంది.

''ఒస్తాడు ... కాపిన్‌తో మాటాడు తున్నాడు ... యివాళ సాయంత్రం గేముంది. టోర్నమెంటు ప్రాక్టీసు ... అడ్చేలోపున నాకు తెలుగు పద్యాల కర్థాలు చెప్పు ...'' అని పక్క గదిలోకి వెళ్లి నిముషంలో వచ్చింది. వరలక్ష్మి రామం ఇబ్బంది గమనించి నవ్వుకుంది. ''తమ్ముడూ !, దీన్ని నువ్వే దారిలోకి తేవాలి. ఎవురి మాటా యినదు. యెప్పుడూ పుస్తకం తియ్యదు. సినీమాలు ... ఆటలు ... కబుర్లు.''

రత్నం పుస్తకం తెచ్చి రామం కూర్చున్న కుర్చీ చెయ్యిమీద కూర్చొని, ఒక చెయ్యి రామం భుజంమ్మీద వేసి పుస్తకం విప్పి, రామాని కిచ్చింది. ''చెప్పు...యెందుకీ పద్దెలు ఒక్కటీ... అర్థమవదు'' అంది కోపంగా.

రామం అన్నాడు ... ''నువ్వా కుర్చీలో కూర్చో ... నా కుర్చీమీదకాదు. ఇలా ఎప్పుడూ చదువురాదు'' అని ఆదేశించేడు. రత్నం ఒళ్లు తన ఒంటికి తగులూ్తకూర్చుంటే ఏం చెప్పడమో తనకే తెలీదు. అందరూ రత్నాన్ని చిన్నపిల్లలా భావిస్తారు. రామానికి అలా కనిపించదు. బాగా ఎదిగిన ఆడదానిలా, లతకన్న పెద్దదానిలా కనిపిస్తుంది. కాని రత్నంతో అధికారంతో మాట్లాడగలడు. ఇంట్లో అందరూ తనకా అధికారం ఇచ్చేరు. రత్నం తన మాట తీసీదు. తీసేస్తే ఆ అధికారం వెంటనేపోతుంది.

( ఇంకా వుంది )

# అజర్‌బైజాన్‌లో అగ్నిదేవాలయం!

ఆ పేరు వినగానే అది ఒక ముస్లిం దేశమా అన్న సందేహం కలుగుతుంది. అవును. సోవియట్ యూనియన్‌లో ఒక భాగమయిన ఆ దేశంలో పలుజాతులు వున్నా అది నూటికి మూరుపాళ్ళు ముస్లిందేశమే. అలాంటి దేశంలో భారతీయుల దైవాలకు అందునా హిందువుల దేవుళ్ళకు ఆలయాలా ? యిదెక్కడి వింత అని ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. హిందువులు పరమ పవిత్రంగా ఎంచే అగ్నిదేవునికి అక్కడ ప్రత్యేకంగా ఓ ఆలయం నిర్మించారు.

ఆ ఆలయం కూడా నిర్మించింది ఎక్కడో కాదు. అజర్ బైజాన్ రాజధాని బాకూనగరం నడిబొడ్డున. అసలు ఈ నగరం దాదాపు 5 వేల



అజర్‌బైజాన్ రాజధాని బాకూ నగరంలో అగ్నిదేవాలయం

ఏండ్ల క్రితమే ఏర్పడింది. నగరానికి మూడు వైపులా సముద్రం పరివ్యాప్తమైంది. కాస్పియన్, సముద్రపుటంచులలో తేలియాడుతూ ఆకాశాన్ని చుంబించే హర్మ్యాలు, బృహత్తర కట్టడాలతో అందమైన తోటలు, ఏపుగా పెరిగిన చెట్ల మధ్య అలరారుతూ కమనీయ మనోహర సుందర దృశ్యంగా గోచరిస్తుందీ నగరం.

చమురు లేదా పెట్రోలు పుష్కలంగా లభించే ఈ నగరం సోవియట్ యూనియన్‌కు చెందినా అక్కడ — ఆసియా దేశాలలోని సంస్కృతి, సంప్రదాయాలు కనిపిస్తాయి.

బాకూ నగరవాసులకు, భారతీయులకు మధ్య పాతకాలం నుండే వ్యాపార సంబంధాలు వుండేవి.

అది 1683 వ సంవత్సరం. ఇద్దరు భారతీయ వ్యాపారులు బాకూ నగరం చేరు కున్నారు. ఆ ప్రదేశం, ఆ వాతావరణం వారికి ఎంతో హాయి ఆహ్లాదం కలిగించాయి. ఒక [అప్పటి] శివారు ప్రాంతంలో ఒకచోట అపురూపమైన, అద్భుతదృశ్యం గోచరించింది.

వారి చుట్టూ అంతా శూన్యం. నిర్మానుష్యంగా, ఎడారిలా కనిపిస్తున్న ఆ ప్రదేశంలో జాజ్వల్యమానంగా వెలుగొందుతూ శగలు, పొగలు వెదజల్లుతున్న అగ్ని కనిపించింది. ఆ నగరంలో విపరీతంగా గాలులు వీస్తుంటాయి. అలాంటి గాలులను సైతం లెక్కచేయకుండా నిరాఘాటంగా వెలుగులు చిమ్ముతున్న ఆ జ్వాల వారిని మరింత ఆశ్చర్యంలో ముంచెత్తింది. యిది దేవతలు నివశించే ప్రాంతమయి వుండాలి. అంతేకాదు, యిక్కడ ఏదో మహత్మ్యం వుండి వుండాలని వారు ఒక నిర్ధారణకు వచ్చారు. అప్పటి నుండే ఆ ప్రాంతంలోని అగ్నికి పూజలు, పునస్కారాలు ప్రారంభమయ్యాయి.

ఆ అగ్ని గురించి చిత్రవిచిత్రమైన కథలు నాడు భారతదేశం నలుమూలలా వ్యాపించాయి. ఆ అగ్నికి ఒక నీడ కల్పించాలన్న ఆలోచన వారిలో కలిగింది. 1730 లో ఆ అగ్ని చుట్టూ ఓ చిన్న ఆలయం నిర్మించారు. విమానంమీద త్రిశూలం, చుట్టూ నాలుగు చిన్న దీపస్తంభాలనూ నిర్మించారు. చూపరులకు ఇదంతా ఓ అద్భుత దృశ్యంగా గోచరిస్తుంది.

1860 నాటికి భక్తుల సంఖ్య బాగా పెరిగిపోయింది. దానితో ఆ ఆలయం చుట్టూ వసతి సౌకర్యాలున్నటు వంటి గదులను నిర్మించాలన్న ఆలోచన వచ్చింది. 26గదులు నిర్మించారు.

భక్తులు తాము ఏదో పాపం చేసినట్లు అనుమానం రాగానే ఈ ఆలయానికి వచ్చి తాము ఏదో తప్పు చేసినట్లు అగ్ని ముందు తలవంచుకుని నిలుచునేవారు. ఆ తర్వాత తమకు కేటాయించిన గదుల్లోకి వెళ్ళేవారు. తమను తాము శిక్షించుకునేవారు. ఈ సందర్భంగా వారు తమ దేహాన్ని, ఇతర శరీర అవయవాలను చిత్రహింసలకు గురి చేసుకునేవారు. చేతులను నరుక్కునేవారు. నాలుకకు, దవడలకు ఇనుప మువ్వలను గుచ్చుకునేవారు. తమ దేహాన్ని ఇనుప గొలుసులతో బంధించుకుని నిద్రాహారాలకు స్వస్తి చెప్పేవారు.

1883 లో ఆ ప్రాంతానికి చమురు అన్వేషకులు వచ్చారు. ఇక్కడ చమురు, ఖనిజ వాయు నిక్షేపాలు అపారంగా వున్నట్లు వెంటనే తేల్చివేశారు.

1969 లో అజర్ బైజాన్ ప్రభుత్వం ఈ ఆలయాన్ని ఒక మ్యూజియంగా భద్రపరిచింది. ఆనాడు భక్తులు చేసుకున్న చిత్రహింసల రీతులను, జరిగిన సంఘటనల ప్రతిబింబాలను యథాతథంగా ఆలయం చుట్టూ నిర్మించిన 24 గదులలో భద్రపరిచారు. ఆలయం మధ్యన, ఆలయం పైన నాలుగు మూలలా పిల్లగాలులనే కాదు, పెనుగాలులను సైతం తట్టుకుని నేటికీ నిరాటంకంగా, నిరంతరాయంగా అగ్ని మండుతూనే వుంది.

ఇది వాస్తవంగా జరిగిన సంఘటన అయినందున బాకూ నగరం సందర్శించిన ప్రతి విదేశీయుణ్ణి అది విశేషంగా ఆకర్షిస్తుంది. దివ్యంగా మండుతున్న ఆ జ్వాలను చూడాలన్న ఆసక్తి, ఆతృతను పెంచుతుంది.

—పి. పద్మావతి

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్పరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్పరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్.®

## పాలు వుండనే వున్నాయి




**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్
ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి.
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం. 3 న్యూ ఢిల్లీ-110 00

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

# మిసెస్ వర్మ

లావణ్య




హైదరాబాదు ఎయిర్‌పోర్టుకు ఐసి 141 విమానం ఇంకో అయిదు నిముషాల్లో చేరబోతుంది. పదమూడో నెంబరు సీట్లో కూర్చుని ఉన్న మిసెస్ వర్మ ఎయిర్ హోస్టెస్‌ను పిలిచింది.

''యస్ మేడమ్ !''

''పదినిముషాల్నించి నాకు ఎడమవైపు గుండెలో నొప్పిగా వుంది. ఈ విమానంలో ఎవరయిన డాక్టర్ వున్నారా !''

''మీరేమి వర్రీ కాకండి మిసెస్ వర్మగారు! నాలుగైదు నిమిషాల్లో మనం ఎయిర్‌పోర్టులో దిగబోతున్నాము. ఈ లోపల విషయం తెలియ చేస్తాను.''

''నేను గాంధీ హాస్పిటలులో చేరదలచుకున్నాను.''

''అయితే హాస్పిటలుకు కూడా మెసేజి పంపిస్తాను. రెండు నిముషాలు ఓపిక పట్టండి.''

ఎయిర్ హోస్టెస్ గబగబ కాబిన్ లోకి వెళ్ళింది. సంగతంతా విన్న పైలెట్ హైదరాబాదు ఎయిర్‌పోర్ట్‌కు వైర్ లెస్‌తో విషయం చెప్పాడు.

*        *        *

ఐసి: 141 విమానం హైదరాబాదు ఏర్‌పోర్ట్‌లో దిగి టార్‌మేక్ మీద నిలబడింది. అంతకు ముందే ప్రయాణీకులకు హెచ్చరిక చేయడం జరిగింది. కాబట్టి మిసెస్ వర్మను బయటకు తీసుకరావడం సులభమయింది. స్ట్రెచర్ మీద మిసెస్‌వర్మను ఎయిర్‌పోర్ట్ బయట నిలబడివున్న అంబులెన్స్ లోకి చేర్చారు.

గాంధీ హాస్పిటల్ డాక్టర్ రవి మిసెస్ వర్మను ఎయిర్‌పోర్స్ అంబులెన్స్ నుండి రిసీవ్ చేసుకోవడం, వెంటనే ఆమెను కార్డియాలజీ వార్డ్‌లో చేర్చబడటం వెంట వెంటనే జరిగిపోయింది.

మిసెస్ వర్మని మానిటర్‌కి కనెక్ట్ చేసేసారు. ఆమెనాడి పరీక్షచేస్తు డాక్టర్ ప్రదీప్ మానిటర్ వంకే చూస్తున్నారు.

''మీ పేరేమండి''

''మిసెస్ వర్మ.''

''మీ వయసెంత.''

''యాభై మూడు సంవత్సరాలు.''

''ఎప్పటి నుండి మీకు గుండె నొప్పిగా వుంది.''

''పది నిముషాల నుండి''

''నొప్పి ఎక్కడినుండి వస్తోందో చూపించగలరా.''

మిసెస్ వర్మ చూపించింది.

స్టెతస్కోపుతో ఆమెను పరిశీలిస్తూ,

''గాలిగట్టిగా పీల్చండి''! అని పరీక్షించసాగాడు.

''యిదివరలో ఎప్పుడయినా యిక్కడ నొప్పి వచ్చిందా!''

''లేదండీ!''

''విమానంలో ఏం తిన్నారు.''

''మామూలుగానే బిస్కట్సు అండ్ టీ.''

''ఎక్కడనుండి వస్తున్నారు.''

''బొంబే నుండి.''

''ఇప్పుడు నొప్పి ఎలావుంది చెప్పండి.''

''కొద్దిగా తక్కువయింది.''

''చూడండి నొప్పి వొక్కచోటనే వుంటుందా, లేక కుడివైపు క్కూడా ప్రయాణం చేస్తుందా!''

''లేదండి వొక్క చోటనే వుంటుంది.''

''సిస్టర్ బి. పి.''

''బొంబేలో ఎన్నింటికి బయలు దేరారు.''

''10—40 నిముషాలకు.''

''పరీక్షలు చేయడం పూర్తయ్యాయి.''

''చూడండి మిసెస్ వర్మా. మీరు ఆరోగ్యంగానే వున్నారు. ప్రస్తుతం నొప్పిగుండెకు సంబంధం లేదు. బి. పి. కొంచెం ఎక్కువగా

వుంది. బహుశా ప్రయాణం బడలిక వల్ల కావచ్చు. పల్స్‌నార్మల్‌గావుంది. మీరు బొంబేలో తిన్నది సరి పళ్ళేదను కుంటాను. అందు వల్ల నొప్పి వచ్చి వుండవచ్చు.

ఈ హాస్పిటలులో మరోరెండు గంటలుండ టానికి మీకేమయినా అభ్యంతరం వుందా!''

''లేదు డాక్టర్.''

''మీ వాళ్ళెవరికయినా ఫోన్ చేసి తెలియ పర్చాలా''

''అవును డాక్టర్! ఫోన్ నెంబరు 32451 లో లెక్చరర్ వర్మగారికి నేను ఆస్పత్రిలో వున్నట్టు చెప్పాలి.''

''యస్ మేడమ్. బైదిబై నర్స్ మీకు మందు లిస్తుంటుంది. విశ్రాంతి తీసుకోండి. నేను ప్రతి పది నిముషాలకు వొక మారు వచ్చి మిమ్మలను చెకప్ చేస్తుంటాను. ఓకే!''

''థ్యాంక్యూ డాక్టర్ !!''

*    *    *

డాక్టర్ ప్రదీప్ 32451కు ఫోన్ చేశాడు.

''ఎస్ వర్మ స్పీకింగ్.''

ఫోనులో అవతలి కంఠం వినిపించింది.

''నేను కార్డియాలజి వార్డునుండి డాక్టర్ ప్రదీప్‌ను మాట్లాడుతున్నాను. ఇక్కడ మిసెస్ వర్మగారు ఆస్పత్రిలో జాయినయ్యారు'' అన్నాడు డాక్టర్ ప్రదీప్.

''నేనిప్పుడే బయలు దేరుతున్నాను'' అన్నాడు వర్మ— ఫోన్ పెట్టేసాడు.

''సార్ మిసెస్ వర్మగారు చాలా తీవ్రంగా బాధపడుతున్నారు'' అన్న నర్సు మాటతో డాక్టర్ ప్రదీప్ వెంటనే మిసెస్ వర్మ గదిలోనికి వెళ్ళి ఆమెను పరీక్షించి నిర్ఘాంతపోయాడు.

''వాట్ హాపెన్డ్ డాక్టర్'' అన్నాడు వర్మ, డాక్టర్ ప్రదీప్ ముందు నిలబడూ.

''వెరి వెరీ సారీ! వెంటనే మరో ఆస్పత్రికి తీసుకెళ్ళండి'' అని చెప్పి అక్కడి నుండి మరో వార్డులోకి వెళ్ళిపోయాడు డాక్టర్ ప్రదీప్.

లెక్చరర్ వర్మ వెంటనే మిసెస్ వర్మను సమీపంలో ఉన్న సుజాత మెమోరియల్ ఆస్పత్రిలో చేర్పించాడు. డాక్టర్ ప్రాంక్‌లేకే మిసెస్ వర్మను పరీక్షించి, ఆమెలో గుండెచలనం, రక్త ప్రసరణం ఆగిపోయి చనిపోయిందని' రిపోర్టిచ్చాడు. ఎందుకయినా మంచిదని వెంటనే ఎడ్రెనిలిన్ యింజెక్షన్ యిచ్చి గుండె మర్దన చేసాడు. ముక్కు రంధ్రాల ద్వారా గాలి పంపాడు, ఒకవేళ ఏదన్నా అడ్డుంటే పోతుందని. అలా జరిపిన ఇరవై నిముషాల్లో మిసెస్ వర్మ బ్రతికి బయటపడ్డది.

లెక్చరర్ వర్మ, మిసెస్ వర్మ యిద్దరూ డాక్టర్ ప్రాంక్‌లేకేకు హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలియ చేశారు.

ఒక్కొక్కప్పుడు అదృష్టమే చచ్చినవాళ్ళని బ్రతికిస్తుంటుంది. 

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

**జరిగిన కథ — 12 :** తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయభారాన్ని తగ్గించుకొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్రరావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావుతో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు. పద్మిని, కృష్ణప్రియల రాకతో తులశమ్మగారి ఇంట్లో చైతన్యం వస్తుంది. కృష్ణారావు చర్చలకు అందరూ ఆకర్షితులవుతారు. శోభనం నాటి రాత్రి మూర్ఛవచ్చి పడిపోయిన పద్మినికి సేవలు చేసి అనునయిస్తాడు కృష్ణ. గుండె నొప్పితో బాధపడుతున్న పద్మినిని మనస్సుకు ఉల్లాసం కలిగించే మాటలతో వూరడిస్తాడు కృష్ణ. మనువడి కోసం తాపత్రయ పడే తులశమ్మను చూసి పద్మిని కృంగిపోతుంది.

రోజులాగే ఆరోజూ నారాయణ బృందం లైబ్రరీ బయట సమావేశమయ్యారు. అందరూ దాదాపు కృష్ణారావు వయసువున్నవాళ్ళే. నారాయణ లాంటి కొద్దిమంది చిన్నతనంనుంచీ కృష్ణారావుతో సహచర్యంతో బాటే అతనంటే అసూయను పెంచుకుంటూ వచ్చినవాళ్ళే. చిన్నతనంలోనే కృష్ణారావు పంథావేరుగా వుండేది. వయసును మించిన ఆలోచన్లతో, ఆలోచన్లను మించిన ఆత్మ పరిశీలనతో — ఆత్మ పరిశీలనలోనే అంతర్లీనమైన జిజ్ఞాసతో, ఊహాతీతమైన మనో సంఘర్షణతో వయసును మించి ఎదిగిపోయినట్టు స్పష్టంగా కన్పించే కృష్ణారావుకి మిత్రులనదగ్గ వాళ్ళుకూడా దూరంగా వుంటు వచ్చారు. తన అసలైన మిత్రులెవరో— జీవిత లక్ష్యమేదో — జీవన గమ్యమేదో కృష్ణారావు తెల్సుకోటానికి ప్రయత్నాలు చేసే సమయం దగ్గరౌతున్నకొద్దీ — జిజ్ఞాసతో తనకు దగ్గరౌతున్న వాళ్ళుక్కూడా దూరమయ్యాడు. అది కొందరికి తృప్తిగానే అన్పించింది. కారణం. కృష్ణారావు కృషి, మనోవికాసం, మానసిక పరిపుష్టి, పరోపకార చింతనా, పైకి తేలని అతని హృదయంలాగే నిగూఢంగా వుండిపోయాయి కనుక. కానీ, కృష్ణారావు వివాహం ముందునుంచీ సమాజ పరంగా కూడా అతనిలో ప్రస్ఫుటిస్తున్న, ఆరాటం, తపనా-- ఆశ్చర్యకర

(గత సంచిక తరువాయి)

మైనమార్పూ, అసూయాపరులకు ఇబ్బంది తెచ్చిపెట్టింది. తల నెరిసినవాళ్ళూ, ఉద్దండ పండితులనదగ్గవాళ్ళూ, తాతల్లాంటివాళ్ళూ, చివరికి, యువతరంలో ఎక్కువ భాగం కృష్ణారావు ఆదర్శాలవైపుకూ చర్చలవైపుకూ ఆకర్షితులౌటం, అతని వ్యక్తిత్వాన్ని ప్రత్యేకంగా చూడటం కళ్ళల్లో నలుసుల్లా బాధ పెట్టటం మొదలుపెట్టాయి. పైగా అతని ఆధ్యాత్మిక వాదానికి, నిజజీవితానికీ, వాళ్ళకెక్కడా పొంతన కన్పించటంలేదు. నిజానికి ఆగర్భ శ్రీమంతుడు. ఒక అప్సరసని కట్టుకున్నవాడు. ఐశ్వర్యం తెచ్చిన హుందాతో అల్లారుముద్దుగా పెరిగినవాడు. "ఇంట్లో అన్ని భోగాలూ అనుభవిస్తూ పైగా దాంపత్యం చేస్తూ, సన్యాసి బోధలు చేస్తాడా? తను ఆచరించలేనివీ — ఇతరుల తలపై రుద్ది తను అందలం ఎక్కి అమాయకుల్ని మోసం చేస్తాడా ? ఇతని మోసాలెలా బయటపెట్టాలి ? అతని భక్తులనబడే వాళ్ళ కళ్ళు ఎలా తెరిపించాలి ?"

ప్రతీరోజూ జరిగే చర్చలో ప్రధానాంశం అదే.

ఆ చర్చకు నాయకుడు నారాయణ. మొదట్నుంచీ కృష్ణారావంటే అకారణ ద్వేషాన్ని పెంచుకున్నవాడు. అవసరమొస్తే, కాలం కల్సి వస్తే, కృష్ణారావును అవమానపర్చే విధానాలన తీవ్రంగా విడవకుండా ఆలోచించే ధ్యేయాన్నే ప్రధానంగా పెట్టుకున్నవాడు.

"ఐతే ఏం చేద్దామంటారు ???"

తీవ్రంగా ఆలోచిస్తూ అన్నాడు నారాయణ.

"అతన్ని వ్యతిరేకిస్తూ ఏమీ చెయ్యలేము. అన్ని విధాలా అతనికి అండవుంది. అతని మంచితనంమీద చాలామందికి విశ్వాసం వుంది. నువ్వు చాలాసార్లు ప్రయత్నించావుగా — ఫలితం ఏమైంది ???"

దాసు మాటల్లో వ్యంగ్యం కన్పించింది.

పుండుమీద కారం జల్లినట్లైంది నారాయణకి.

"అందుకే గదా ఉపాయం చెప్పమంటున్నాను. పదిమందిలో మనంపల్చనవకూడదు. అతని నిజస్వరూపాన్ని మటుకు అందరికీ తెలిసే విధంగా చెయ్యాలి. ఒకసారి తెల్సుకున్నారంటే— అతని మీద మనతోబాటే— నలుగురూ నాలుగు రాళ్ళూ వేస్తారు."

కసిగా అన్నాడు నారాయణ.

అంత కసిని పెంచుకోటానికి అతనికి మరో కారణం కూడా వుంది.

అది కల్యాణి.

కల్యాణి నారాయణకి మేనమామ కూతురే కాదు కాబోయే భార్య కూడా. నారాయణ ఎక్కువ స్థితిమంతుడు కాదు. ఆ రోజుల్లో ఆ ఊళ్ళో నారాయణ తండ్రి తహసిల్దారు చేసి మూటలు దాచుకునే రిటైరయ్యాడు. ఐతే చెడు వ్యసనాలు మూటల్ని కరిగించాయంటారు. నారాయణతోబాటు ముగ్గురు చెల్లెళ్ళూ, ఇద్దరు తమ్ముళ్ళూ కూడా వున్నారు. ఐతే తండ్రి ఆశలన్నీ నారాయణ మీదే పెట్టుకుని చదివించాడు. గ్రాడ్యుయేట్ అయ్యేసరికి తాతలు దిగి వచ్చినా, చదువుతున్న వాడినన్న అహం, అందరి కన్నా తనకేదో ప్రత్యేకత వుందనీ— తననీ, తన విద్యార్హతల్నీ, ఎవ్వరూ అర్థం చేసుకోటం లేదన్న దురభిప్రాయం ప్రేళ్ళు నాటుకు పోయింది. మొదట్నించీ నలుగురిచేత గుర్తింపబడాలనీ ప్రత్యేకతతో చూడబడాలనీ, పెద్ద పైజా హీరోగానే ఊళ్ళో పరపతి పెంచుకోవాలనీ కలలు గన్న నారాయణకి కృష్ణారావు కొరకరాని కొయ్యలా తయారయ్యాడు. అతను నారాయణ దృష్టిలో తనకన్నా తక్కువ చదువుకున్నవాడు. గ్రాడ్యుయేషన్ కూడా లేని అర్భకుడు. కేవలం ఐశ్వర్యంతో, మెస్మరిజంతో జనాన్ని ఆకట్టుకుంటున్న అర్హతలేని వాడు. అప్రయోజకుడు.

తనకీ కల్యాణికీ, భార్యాభర్తలనే బంధం, త్వరలో ముడిపడబోతోంది. తనలాగే తన భార్య ప్రత్యేకతతో వుండాలనీ— వుండగలదనీ అనుకున్న నారాయణ అహం మీద పద్మిని రూపం విపరీతంగా దెబ్బతీసింది. ఎంత అందమున్నా— పద్మిని ముందు, కల్యాణి సూర్యుడి ముందు దివిటీ



లాంటిదని తన అంతరాత్మకి తనకే తెల్సు. ఐనా కల్యాణి మీద పెంచుకున్న మమకారం ఆ భావాన్ని తాత్కాలికంగా దూరం చేసినా ఇప్పుడు అసలైన బాధ పట్టుకుంది. కల్యాణి చాలా తరచుగా కృష్ణారావు వాళ్ళింటికి వెడుతోంది. కృష్ణప్రియా, పద్మినీలతో స్నేహం రోజురోజుకీ బలపడి పోతున్నట్టే — కల్యాణి కృష్ణారావు వైపుకి ఆకర్షితురాలౌతోందేమోనన్న అనుమానం పెనుభూతంలా నారాయణని పీడించడం మొదలు పెట్టింది. కృష్ణారావు విషయం లేనిదే తమ మధ్య సంభాషణ పూర్తికావటం లేదు. అతని అందాన్నీ వ్యక్తిత్వాన్నీ చీటికీ మాటికీ పొగడటం, తనలో వున్న లోపాల్ని కావాలని ఎత్తి చూపించటం నారాయణకి సహించరాని విషయంగా వుంది. కృష్ణారావు తనకంటే — ఎందులో గొప్ప? నాలుగు గ్రంధాలు కంఠస్థం చేసి నీతులు చెప్పినంత మాత్రాన గొప్పవాడయాడా? ఆచరణలో పెట్టని అతని నీతులు వింటూ ఎంత మంది మోసపోతున్నారు. అతని స్వరూపం బయట పెట్టాలి— తన స్థాయిని పెంచుకుని సుస్థిరంగా నిలద్రొక్కుకోవాలి. తన మాటలతో— సహజమైన చాతుర్యంతో — కుర్రకారునంతా బావగట్టుకో గలిగాడు నారాయణ.

తీవ్రంగా ఆలోచిస్తున్న నారాయణ కుడి భుజం లక్ష్మణ్ హుషారుగా ఈల వేశాడు.

''ఇలా చేద్దామా పోనీ—''

''ఎలా ???—''

కొన్ని గొంతుకలు ముక్త కంఠంతో పలికాయి.

''కృష్ణారావంటే ఏ మాత్రం ద్వేషభావం వున్నట్టు ఏ విధంగానూ బయట పడద్దు మనం. ఇందాకనుకున్నట్టుగానే అభాసుపాలవటం తప్ప జరిగేదేమీ వుండదు. ఒక పది రోజులపాటు సిన్సియర్‌గా వాళ్ళ గోష్టుల్లో పాల్గొందాం. ముసలాళ్ళు వాడంటే పడి చస్తారు కదామరి. అందుకని వాళ్ళతోనూ ఏకీభవిస్తున్నట్టే నటిద్దాం. పొరుగూర్లో మా గేంగ్ వుందిలే వాళ్ళ తాలూకు వాళ్ళచేత గోష్టికోసం— అదే ప్రత్యేక గోష్టి కోసం కృష్ణారావుని వొప్పిద్దాం—''

''ఎక్కడ వాళ్ళ ఊళ్ళోనా ?— కృష్ణ చస్తే వొప్పుకోడు. ఇక్కడేదో కాలక్షేం కోసం వస్తున్నాడు కానీ— ఇటువంటి పబ్లిసిటీలు వాడికి నచ్చవ్. లాభంలేదు—''

కృష్ణారావంటే అభిమానమున్న రమణ నిక్కచ్చిగా చెపుతుంటే గుర్రుగా చూశాడు లక్ష్మణ్.

''నువ్వు నోరు ముయ్యిరా. ఆ మాత్రం ఐడియా నాకూ వుంది. ఎక్కడో పొరుగూర్లో వాడి గోష్టి ఏర్పాటుచేస్తే మనకేం లాభం? వాడి రంగు బయట పడాలనికదా నారాయణగోల నాడెలాగూ రావటానికి అంత త్వరగా వొప్పుకోడు. అప్పుడు వాళ్ళచేతే— మనూళ్ళోనే ప్రత్యేకంగా మీటింగ్ ఏర్పాటు చెయ్యటానికి వొప్పిద్దాం. దైవ సంబంధమైన చర్చలు కాబట్టి కాదనడు కదా— దానికి మనం మంచి మనస్సుతో మద్దతు ఇద్దాం—''

''మంచిమనసుతో...మనం???''

ఎవరో గుంపులోనుంచి ఎగతాళిగా అన్నారు.

''అబ్బబ్బ— అలా నటిద్దాం— గోష్టిలో— వాళ్ళచేత అల్లరిచేయిస్తూ పరిస్థితి కాస్త తార స్థాయికి రాగానే మనం— మనపని చేద్దాం—''

అందరూ— సరే అంటే సరే అన్నారు.

ఏకగ్రీవంగా ఆమోద ముద్ర వేశారు.

*  *  *

ఆ రోజు లైబ్రరీ ఆవరణ కళకళలాడుతోంది.

యువకులంతా ఉత్సాహంగా పూనుకుని ఏర్పాట్లన్నీ చాలా ఘనంగా చేస్తున్నారు. అంత పెద్ద ఎత్తున అంత ఘనంగా — వయో తారతమ్యం మరచి ఆ విధంగా ఏర్పాటు చెయ్యటమనేది ఆ ఊరి చరిత్రలోనే అరుదని చెప్పకుంటున్నారు. కృష్ణారావు కుటుంబానికి అతి సన్నిహితుడూ, మహాభక్తుడూ, ఉద్దండ పండితులూ శంకరశాస్త్రిగారు ఆ రోజు సమావేశానికి అధ్యక్షత వహించటానికి వచ్చారు. ఆ ఊరివారూ వీరరాఘవయ్యగారికి సమకాలీకులూ — కృష్ణారావంటే విపరీతమైన అభిమానం, వాత్సల్యం వున్న కృష్ణశాస్త్రిగారూ ప్రధానవక్తగా వచ్చారు. అనుభవంతో తలపండి— మనసా వాచా కూడా వృద్ధులూ మాననీయులూ ఐనవారిముందు ముఖ్య అతిథిగా వుండటానికి సుతరామూ వొప్పుకోలేదు కృష్ణారావు.

''పెద్దలనుంచి నేను నేర్చుకోవాలి. వారు నన్ను ఆశీర్వదించాలి — వారిముందు ఉపన్యాసాలివ్వదగినంత అర్హత నాకు లేదు ''

## కర్మయోగి

కృష్ణారావు అభ్యర్థనను తీవ్రంగా త్రోసి పుచ్చాడు నారాయణ.

''ఎవరి అర్హతను వారు నిర్ణయించలేరు. ఇది అభిమానంతో మేము చేసుకున్న అభ్యర్థన.''

నారాయణకి విపరీతమైన మద్దతు లభించటంతో స్టేజి ఎక్కక తప్పలేదు కృష్ణారావుకి.

ఐతే అతని మనస్తత్వం తెల్సిన పెద్దలే – ఆ రోజు కార్యక్రమంలో మార్పులు చేశారు.

''ముఖ్య అతిథిగా కృష్ణారావే వుంటాడు. ఇంత చిన్న వయసులో ఇంత ఖ్యాతినీ – ఇంతటి ఆధ్యాత్మిక చింతననీ, అరుదైన వర్చస్సునీ స్వంతం చేసుకున్న చిరంజీవిని చూస్తేనే తెలుస్తోంది సామాన్యుడుకాడని, అతని తేనెపలుకులు వినాలనే ఉత్సాహం మీకూవుంది. ఐతే వినయపూర్వకమైన అతని అభ్యర్థన త్రోసివేసి అతన్ని చిన్నబుచ్చటంకూడా భావ్యంగా అన్పించటం లేదు. అందుకే ఈగోష్ఠిలో–ముఖ్యఅతిథులూ, అధ్యక్షులూ, ప్రధాన వక్తలూ అంటూ ఎవరూ లేకుండా -- కల్సికట్టుగా గోష్ఠి నిర్వహిస్తే బావుంటుంది. ఆ గోష్ఠికూడా – మీనుంచి వచ్చిన ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చే అంశంగా వుండాలని ఇప్పుడే కొందరు పెద్దలు సూచించారు. మీలో ఎవరు ఎవరిని ఆధ్యాత్మికంగా ప్రశ్నలు వెయ్యాలనుకున్నారో– వారి పేర్లపైన వ్రాసి నిర్మొహమాటంగా ప్రశ్నలు అడగవచ్చు. ఎవరిని ఉద్దేశించిన ప్రశ్నలకు వారే సమాధానాలు చెపుతారు. ఈ పద్ధతి బావుందనుకుంటాను.''

కొంత తర్జన భర్జనల తరువాత శంకర శాస్త్రిగారి అభిప్రాయాన్ని అందరూ ఆమోదించారు.

కృష్ణారావు పేరుమీద ప్రశ్నలు అధిక సంఖ్యలోనే వచ్చాయి. మిగితా వారికి నామమాత్రంగా – చిన్నబుచ్చటం ఇష్టంలేనట్టు ఒకటి రెండు వచ్చాయి.

ప్రశ్నల పరంపరలను అందుకుని గంభీరంగా లేచి నిలబడ్డాడు కృష్ణారావు. ఆ తేజస్సు చాలా మందికి వివేకానందుడ్ని గుర్తుకు తెచ్చింది. ఆ విశాల ఫాలభాగం వింతగా మెరుస్తుంటే – అందమైన ఆ కళ్ళలో చిన్మయానందం తొంగి చూస్తోంది. ఎవరికి వాళ్ళే కృష్ణారావుతో తమని పోల్చుకోకుండా వుండలేకపోయారు. సామ్యం అందక సిగ్గుపడిపోయారు.

''సన్యాసీ...కర్మ చేసేవాడూ ఒకటే ఎలా అవుతాడు? మొదట్నుంచీ సన్యాశ్రమం మీదున్న మోజు– సంసారం మీదకు మళ్ళటానికి కారణం? ఐనా కూడా– మామూలుగా సంసారం చేస్తూ కూడా–అతి సామాన్యుడిలా బ్రతుకుతూ కూడా– సన్యాసం గురించీ, వైరాగ్యం గురించీ జితేంద్రియుడిలా సలహాలివ్వటం– హాస్యాస్పదంగా లేదూ– సరైన సమాధానం కావాలి.''

కృష్ణారావా ప్రశ్నని మరోసారి బిగ్గరగా చదివి కాగితం మడిచాడు. ఒక్కక్షణం మౌనంగా వుండిపోయాడు.

మొదటి ప్రశ్నతోనే అర్థమైపోయింది. వేదిక మీద పెద్దలు మొహామొహాలు చూసుకున్నారు. ఇది కేవలం కృష్ణారావును చిన్నబుచ్చటానికి ఏర్పాటైందే కానీ– దైవచింతన వల్లా, విషయ జిజ్ఞాసవల్లా కాదు.

''నిజమైన సన్యాసీ, నిజమైన కర్మయోగీ ఒకటే అవుతాడు. ఫలాపేక్షలేని మనసు దైవ మందిరం లాంటిది. సన్యాసి కర్మలు చెయ్యడు. అందువల్ల, ఫలమాసించే ప్రసక్తిలేదు. అదే విధంగా కర్మయోగీ కర్మ చేస్తూ కూడా ఫలమాసించని మనస్కుడవటం వల్ల ఇతనూ సన్యాసి క్రిందే జమకట్టబడతాడు. నాకు మొదట్నుంచీ మోజు సన్యాసం మీద కానీ– సంసారం మీద గానీ లేదు. నా మనసు అతి విచిత్రంగా వుండేది. నాకే అర్థంకాని స్థితిలో విపరీత సంఘర్షణలో అగమ్యంలోకి అడుగుపెట్టేది. చివరికి భగవన్నిర్ణయం ప్రకారమే వివాహం చేసుకోటం తటస్థించింది. నేను అతి సామాన్యుణ్ణే, ఐతే హాస్యాస్పదమైన తప్పటడుగు ఇంతవరకు వెయ్యలేదు. ఆ భగవంతుడు వేయించడనే నమ్మకం ఆయనే కల్గించాడు.''

తొణక్కుండా అతి గంభీరంగా అంటున్న కృష్ణారావు వాణికి సభలోంచి అడ్డంకులు చాలానే

"తలనొప్పికోసం ఎన్నో
వాడి చూశాను...

# అయితే అత్యుత్తమంగా పనిచేసేది సారిడన్!"

ఒక్క బిళ్ల సారిడన్ వేసుకుంటే చాలు. మీ తలనొప్పి క్షణంలో వదిలి పోతుంది. కారణం, ఔషధ పరిశ్రమలో ప్రపంచ నేతలైన రోష్‌వారు పరిశోధించి రూపొందించిన అద్వితీయ ఔషధ సూత్రం సారిడన్‌లో ఉండడమే!

కనుక, ఈసారి మీకు తలనొప్పి వచ్చినప్పుడు గట్టి మందే వేసుకోండి. సారిడన్ తీసుకోండి.



# సారిడన్

ట్రేడ్‌మార్కు 'రోష్'

ఒక్కటే, నిజంగా పనిచేసేది.

RPL-1205

ఇటీవల చిలకలూరిపేటలో ప్రారంభించిన 'కళా తరంగిణి' వారు ఏర్పాటు చేసిన సభలో ఉపన్యసిస్తున్న శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, శ్రీయుతులు రంగబాబు, ఎస్. సత్యనారాయణ, డా. జె. సీతారామారావు (సంస్థ అధ్యక్షులు), టి. వెంకట్రాయలుగార్లను చిత్రంలో చూడవచ్చు.

వచ్చాయి. ఐతే అతని అంతరంగిక విషయాలను తరచి తరచి అడిగే హక్కు లేదని వేదిక మీది పెద్దలు తీవ్రంగా అభ్యంతరం తెలియజేశారు.

మరో ప్రశ్న చదివేటంతలో సభికుల్లోంచి ఒక యువకుడు చటారుగా నిలబడ్డాడు.

## కర్మ యోగి

''నాకు కొన్ని సందేహాలు ...''

''సందేహాలుంటే వ్రాయవచ్చుగా – ''

కృష్ణశాస్త్రి వంక నిశితంగా చూశాడతను.

''వ్రాయవచ్చు. కానీ – ఒకటో రెండో ప్రశ్నలు అడిగినంత మాత్రాన– వాటికి ఆతనేవో సమాధానాలు చెప్పి ముగించినంత మాత్రాన నాకు తృప్తి తీరదు. అందుకోసమైతే–నేనెంతో దూరం నుంచి రావటం అనవసరం.''

లక్ష్మన్ అలవాటైన హుషారుతో ఈల వెయ్యబోయి అతి ప్రయత్నంమీద అదుపులోకి తెచ్చుకున్నాడు.

''అడగండి. అభ్యంతరమేముంది ? ... ''

కృష్ణారావులో అదే ప్రశాంతత. అదే చిరునవ్వు – అదే గాంభీర్యం.

''ఇదివరకు మీరు గీతామందిరంలోనే నిద్రాహారాలు మాని గడిపేవారని విన్నాను – ఇప్పుడు ఆ మందిరంలో చాలా తక్కువ సేపు గడుపుతున్నారనీ – ప్రాపంచిక విషయాలలోనే అధికమైన ఆసక్తిని చూపిస్తున్నారనీ వింటున్నాము. అటువంటి మీరు – విగ్రహారాధనకు దూరంగా వుంటూ – కొందరిని విగ్రహాలను ఆరాధించమనీ–మరి కొందరిని గుడీ–గోపురాలను సందర్శించటమే వ్యర్థమనీ అంటున్నారుట...''

కృష్ణారావు మౌనంలోనే అజ్ఞాతశక్తి నిగూఢంగా కన్పించింది.

''అవును – గీతామందిరంలోనే గడిపే వాడిని ... అందుకే గీతాచార్యుడు చేయూతనిచ్చి బయట ప్రపంచంలోకి తీసుకువచ్చాడు. తన

ఆ ఒక్క మందిరంలో మాత్రమే కాదనీ – సర్వ వ్యాప్తమని – సర్వాంతర్యామిననీ నా వెన్నుతట్టి జ్ఞానోదయం కలిగించాడు. అన్నిటిలోనూ తనని చూడమన్నాడు.

యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుప
శ్యతి
సర్వ భూతేషు చాత్మానం తతోనవి
జుగుప్సతే.

అన్నవాణి పదేపదే నా చెవుల్లో మారు మ్రోగేది ...''

''వారికి అర్థంకూడా చెపుతే బావుంటుంది''

శంకరశాస్త్రిగారు చిన్నగా అన్నారు.

''సమస్త భూతములను తనయందు, సమస్త భూతములయందు తన్ను చూసుకొనువాడు ఎవరినీ నిందింపలేడని అర్థం. ఆత్మ యొక్క ఏకత్వం అర్థమయ్యాక గీతామందిరంలో గడపటం తగ్గించి వేశాను. ప్రాపంచిక విషయంలో ఆసక్తి చూపిస్తున్నాను. అదీ ప్రయోజనం ఆశించి కాదు. కర్మలు చేస్తున్నాను. కానీ ఫలాన్ని ఆశించాలనే జిజ్ఞాసే కలగదు నాకు – స్వప్రయోజనాలకోసం చేసే కర్మలు మాత్రమే– మనల్ని బంధితుల్ని చేస్తాయి. నన్నే కర్మ బంధింపజాలదనే అనుకుంటున్నాను. ద్వైతము– అద్వైతము గురించి నాలోని భగవానునితో చర్చించుకున్నాక, సాంఖ్యులకూ, పాతంజల యోగులకు, నిష్కామకర్మయోగులకూ గల తేడాలను తరచి తరచి తర్కించుకున్నాక భగవంతుడు నాకుచూపించిన పథంలో పయనించ టానికి నిశ్చయించుకున్నాను.''

క్షణం ఆగాడు కృష్ణారావు.

''మీరు చాలా పెద్ద మాటలు చెపు తున్నారు. మాలాంటి వారికి అర్థమవటంకష్టం. తేలిక భాషలో అర్థమయేలా చెపుతారని ఆశిస్తున్నాం–''

ఇందాకతనే రెట్టించి అడిగాడు.

''చెపుతాను. సాధ్యమైన వరకూ– తేలిక భాషలో చెప్పటానికే ప్రయత్నిస్తాను. తనను మినహాయించుకుని, సమస్త ప్రపంచమునూ దైవ స్వరూపంగా భావించటాన్ని ద్వైత మంటారు. సర్వం భగవంతుని నిలయమైనప్పుడు– సర్వత్రా భగవంతుడే నిండివున్నప్పుడు తననుమటుకు మినహాయించుకోట మెందుకు? తనను తాను దైవమని గుర్తించినప్పుడు- విగ్రహారాధన లెందుకు ?... పూజలూ వ్రతాలూ ఎందుకు? మంత్ర తంత్రాల మాయాజాల మెందుకు ?- అందుకే వ్యక్తినిబట్టే– వ్యక్తి మానసిక పరిణామాన్నిబట్టే– కొందరిలో విగ్రహారాధనమూ– మరికొందరితో– ఆత్మా రాధనమూ– చెప్పటం మొదలు పెట్టాను. ఎవరికి వారు వారివారి స్థితినిబట్టే – ఆత్మా నందాన్ని వెతుక్కోవటం– నాకు ఆనందాన్ని కల్గించింది...''

''సాంఖ్యులూ, జలపాత యోగులూ అన్నారు...''

మరెవరో వ్యంగ్యంగా అన్నట్టనిపిస్తే– నొచ్చుకుంటున్నట్టుచూశారు కృష్ణశాస్త్రిగారు.

''బాబూ– నీకు నిజంగా విషయం తెల్సు కోవాలన్న జిజ్ఞాస వుందా ?'' ఆయన అను మానాన్ని అతి తేలిగ్గా తీసివేశాడు కృష్ణారావు.

''అడగనివ్వండి బాబాయిగారూ– నావంటి అల్పుల్నికూడా– ఇంతమంది ప్రశ్నలు వేస్తున్నా రంటే– అదీ దైవ సంబంధమైనవి–అంటే నా జన్మ సార్థకమైనట్టే భావిస్తున్నాను. నేను తెల్సుకుంది, నాకు తెల్సిందీ అత్యల్పం, ఆ అల్పమే నా కింతటి ఆనందాన్ని అందిస్తోందంటే ఆ అనుభూతిని మాటల్లో చెప్పలేకపోతున్నాను''

కృష్ణారావు తన్మయత్వం చాలామందికి విచిత్రంగా వుంది.

ఎంతోమందికి అద్వితీయంగా వుంది–

కొందరికి మాత్రం ఆనందంగా వుంది.

''సాంఖ్యుల విషయం కదూ అడిగారు – నీకైనా అర్ధమైనంతవరకూ చెపుతాను... చెప్ప టానికి ప్రయత్నిస్తాను. సాంఖ్యులు, పాతంజల యోగులైనవారికి ఎంతో ప్రీతిపాత్రమైంది సర్వ కర్మత్యాగమూ. ఇతరుల కష్ట సుఖాలతో కానీ, వారి యోగ క్షేమాలతోగానీ – వీరికి సంబంధం వుండదు. ఆ యోగంకూడా అసాధ్య మైనదే – ఐతే దానికన్నా కర్మయోగం నా స్థితికి ఆచరణయోగ్యంగా నేను భావించాను. నేను ఆచరిస్తున్నానా అంటే – చెప్పలేను. ప్రయత్నిస్తున్నాను. నా ప్రయత్నం సఫలీకృతం కావాలని కోరుకుంటున్నాను... కోరుకోటం భావ్యంకాదనీ నాకు నేనే నచ్చచెప్పుకుంటున్నాను. నిష్కామ కర్మయోగం అలవడుతుందో లేదో – ఆ పంథాలో నడవమని ఆదేశించిన ఆ భగవంతుని మీదే భారంవేశాను... సర్వవ్యాప్తమైన పరమా త్మని ఏ విషయంలోనూ ఏ రకంగానూ చిన్న బుచ్చటం బాధించటం సహించరాని నేరం. ఇతరులు ఎటువంటి కూడని పన్లు చేస్తే మన మనస్సు బాధతో విల విలలాడుతుందో –ఇతరులు ఏ విధంగా ప్రవర్తిస్తే – మన మనస్సులు వికలమైపోతాయో – ఆ విధంగా మనం ప్రవర్తించకూడదనీ మనం ఎదుటివారి స్థానంలో నిలబడి అంత బాధనూ మానసికంగా అనుభవించి అదే బాధను ఎదుటివారు అనుభవించకూడదన్న సిద్ధాంతంతో–మనోవాక్కాయ కర్మలతో ఇతరుల బాధలు పోగొట్టే ప్రయత్నంలో – ఇతరుల సుఖాన్ని చూస్తూ అనంతమైన సుఖాన్ని అందుకో టాన్ని మించిన వరం లేదనే భావన నాది. సామాన్య మానవుణ్ణి – అసామాన్యమని మీరను కుంటున్న భావనలు నాలో వుంటం దోషం కావచ్చని మీరభిప్రాయపడితే క్షమించవల్సిందిగా వేడుకుంటున్నాను. ఈ సభలో ఎందరో మహ నీయులున్నారు. మహోమయులున్నారు, ఉద్దండ పండితులున్నారు. ఎందరో విద్యాధికులున్నారు. అందరిలోకీ – అన్ని విషయాలలోనూ – అతి చిన్నవాడిని. నా అంతరంగిక జీవితానికి ప్రాధాన్యత నిచ్చి - అతి విలువైన ఈ కాలాన్ని వ్యర్థ పుచ్చటం భావ్యంకాదేమోనని నేను భావిస్తున్నాను.''

అతని వినయం, సాగరగంభీర వాక్చాతుర్యం, భావప్రకటనం, శత్రువుల్నికూడా కదిలించగల ఆర్ద్రత, మతిమెత్తని హృదయం, సౌకుమార్యం సభని స్తబ్ధతలో ముంచింది.

''అర్థమైనవాటికే సమాధానాలిస్తూ సభ పవిత్ర లక్ష్యాన్ని కాపాడవల్సిందిగా కోరు తున్నాము.''

ముందు వర్సలోంచి ఒక పెద్దమనిషి లేచి చిన్నగా అన్నాడు.

లక్ష్మణ్ బృందంలో చాలామందికి ఏ ప్రశ్న ఏ విధంగా అడగాలో అంతుచిక్కటంలేదు.

మరి కొందరికి భాషరాక, పాండిత్యంలో లోతు తెలియకా గజ ఈతగాడిలా కన్పిస్తున్న కృష్ణారావుతో సమానంగా చెయ్యి అందుకుని –



# కర్మయోగి

ఆధ్యాత్మిక సాగరంలో మునిగిపోవాలంటే—ధైర్యం చాలటంలేదు.

మరి కొందరు ఆత్మ విమర్శ చేసుకుంటున్నారు. "మనం ఎందుకొచ్చినట్టు? ఇటువంటి మనిషిని అపహాస్యం పాలుచెయ్యాలంటే అంత తెలికే? ఐనా ఎందుకు చెయ్యాలి?"

వాళ్ల ఆలోచన్లు వాళ్లకే అంతు చిక్కటం లేదు.

"ప్రతీ వారిలోనూ — దైవం నెలకొని వున్నప్పుడు— వారి వారి మనోభావాల్లో ఇంత వ్యత్యాసమెందుకుంటోంది?— అందరూ ఒకేలా ఎందుకు ప్రవర్తించరు?"

కృష్ణశాస్త్రిగారు లేచి ఈ ప్రశ్న చదివారు.

"కృష్ణా— సమాధానం నువ్వే చెప్పాలిట."

తనముద్దేశింపబడిన ప్రశ్నల బొత్తిలో ఒక కాగితం మరోసారి కదిలిందన్నమాట —

కృష్ణారావు పెదాలమీద చిరునవ్వు వెలిగింది.

"ప్రతీ వారిలోనే కాదు— ప్రతీ జీవిలోనూ దైవం నెలకొని వున్నాడు. అందులో ఎంత మాత్రం సందేహం లేదు. ఐతే తరుణం రాక కొందరిలో, యోగం లేక మరికొందరిలో—సాధన లోపించి ఎందరిలోనో — వివిధ లక్షణములు మనసుకు దగ్గరౌతూ — అసలైన తేజస్సు అజ్ఞానంతో కప్పబడిపోతోంది. విశ్వలము, యోగమూ, తపస్సు—జిజ్ఞాసా, ఆత్మావలోకనా— ఆధ్యాత్మిక సాధనా, సాధు సంపర్కమూ నిశ్చలత్వము ఏర్పడిన మనసులో— అంతర్గతంగా వున్న భగవానుని రూపం దృగ్గోచరమౌతుంది. అటువంటి యోగి ప్రవర్తన అన్నింటా—అన్ని వేళలా, అన్ని విధాలా ఒకటిగానే వుంటుంది."

దృఢంగా వినిపిస్తున్న ఆ వాణిలోనూ భగవంతుని వాణి ఐక్యత చెందిన అనుభూతి కలిగింది కొందరిలో.

"మన దేశంలో ఏముంది?— దరిద్రం తప్ప?— మన మనసుల్లో ఏముంది— కాలుష్యం తప్ప? ఈ భారతదేశంలో పుట్టిన ఏ భక్తుడు పరదైవాన్ని ద్వేషించకుండా వున్నాడు? అతి ప్రాచీనమూ— అర్థరహితమూ— నిస్సారమూ — రసహీనమూ— ఇదీ అంటూ ఎన్నదగ్గ అంశం, దేనిలోనూ— ఎవరిలోనూ — ఏ ప్రదేశంలోనూ లేని— ఈ భారతావనిలో పుట్టేకన్నా— ఐశ్వర్యానికీ— హృదయ వైశాల్యానికీ— మంచితనానికీ— ప్రతీకగా నిల్చిన అమెరికా వంటి దేశాల్లో జన్మించటాన్ని మించిన అదృష్టంలేదని మా భావన.."

ఆ ప్రశ్నను పూర్తిగా చదవలేని కృష్ణశాస్త్రి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. కణతలు అదురుతుంటే ఎర్రజీరలు కళ్ళలో చోటు చేసుకున్నాయి.

"మన దేశంలో ఏ ముందా?— మన సంస్కృతినా నిందించేది?— ఈ కర్మభూమినా అధిక్షేపించేది? ఈ పుణ్యభూమినా తూలనాడేది? ఎంత దౌర్భాగ్యం! ఎంత దురదృష్టం!!!—కృష్ణా— ఎన్నో చెప్పాలని వచ్చాను— ఏవేవో నేర్చుకోవాలని వచ్చాను. శక్తికొలదీ గీతామృతాన్ని దానం చెయ్యాలని ఆశపడ్డాను. ఈ దానాన్ని అపాత్రులకివ్వటానికి మనసంగీకరించటంలేదు. ఈ సభను చాలిస్తే మంచిదేమో—"

కృష్ణశాస్త్రి సూచనకు శంకరశాస్త్రిగారు గంభీరంగా తల పంకించారు.

"ఈ సభలో మొదల్నుంచే అపశృతులు వినిపించాయి. నిజమైన భక్తుని చిన్నపరచటానికి ఏర్పాటైందని— వాళ్ళెంత దాచినా కనిపిస్తూనే వుంది. ఈ సభను సాగనివ్వటం ఉచితంకాదు. అయితే చిరంజీవి కృష్ణచేత భారతీయసంస్కృతిపైన రెండు ముక్కలు చెప్పిస్తే— మనం చేసుకున్న పాపం పోతుందనిపిస్తోంది—"

కృష్ణారావు కళ్ళు మౌనాన్ని ఛేదిస్తున్నాయి—

ఇటీవల గుంటూరులో జరిగిన "ఆంధ్రప్రదేశ్ సీనియర్ మెజీషియన్‌ల సన్మానం" సందర్భంగా ఇంద్రజాల ప్రదర్శన ఇచ్చిన విజయవాడ సిద్ధార్థ కళాశాల విద్యార్థి చి. మనోహర్.



ఆ కంటి వెలుగులో అఖండజ్యోతి ప్రజ్వరిల్లి వెలుగుతోంది. ఆ అఖండ జ్యోతిలో అద్వితీయ రూపం అగ్నిశిఖలా వెలుగుతోంది.

నీలాకాశంలో చందమామలా—
అజ్ఞానాంధకారంలో జ్ఞానశిఖలా—
భారతీయ సంస్కృతికి ప్రతీకగా—
పవిత్ర భారతావని అనుంగు పుత్రరత్నంలా—
విజ్ఞానాన్ని స్వంతం చేసుకున్న అగ్నిశిఖలా—

అపురూపంగా కనిపిస్తున్న కృష్ణారావులో— అమూల్యమైన లోతులు వెతకటం అసంభవమని తెల్సిపోయింది చాలామందికి.

" 'స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః' స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' యత్కరోషి యదశ్నాసి... తత్కురుష్వ మదర్పణం'

అతి విలువైన అత్యంత పవిత్రమైన కర్మయోగ సాధనను గీతామృతంలోంచి అందించి కర్మయోగులుగా ఎందర్నో మలచి— తద్వారా విశ్వకల్యాణానికి పునాదులు వేసింది మనభారతీయ సంస్కృతేనన్న విషయాన్ని విస్మరించటం ఎంత సిగ్గుచేటు—

సాగరగంభీరమై, రత్నగర్భమై, విజ్ఞాననిధిగా— ఎన్నెన్ని సాంప్రదాయపు వెల్లువలు, ఎన్నెన్నో ఆధ్యాత్మిక ఉప్పెనలు. ఎన్నెన్నో దైవ సంబంధపు ప్రేరణలు, విభిన్న రూపాలలో, విభిన్నుల అంతరంగాలలో—భిన్నభిన్న ఆకృతులతో వెలసి, వెలిగి— భక్తి తత్వాన్ని అనంతం చేసి— సర్వ బింబాల ప్రతిరూపంలో ఏకత్వం చూపించి 'నేను'కి సరైన నిర్వచనాన్ని చెప్పిన గీతామాత భారతీయ సంస్కృతికి ఆదర్శప్రాయం కాదా?

కర్మానుసారంగా జనన మరణాలు తప్పవనీ, ఆత్మ స్థిరమైనదనీ, చావులేని ఆత్మను మనసులో స్మరించి — అస్థిరమైన శరీర పతనం కోసం కుమిలిపోవటం తెలివితక్కువని — అతి బలహీన మనస్కులకి, మాయా మోహాలలో చిక్కుకుని దారి తెలియక అలమటించేవారికీ, సంసార సాగరంలో తలమున్కలయేవారికీ, జ్ఞానోదయాన్నీ, ఊరటను అందించి— ఆత్మస్థైర్యాన్ని పెంపువేసింది మన భారతీయ సంస్కృతేనని మర్చిపోయినవాళ్ళు క్షమార్హులా?

పురాకృత కర్మలనుబట్టి ఎన్నిజన్మలు ఈ ఆత్మ చవిచూసినా, విషయ వాంఛలు — ఐహిక బంధాలూ, అస్థిరమైన బంధనాలూ, జీవన్మరణ సమస్యలతో కలతబెట్టే సంఘటనలూ—అవిశ్వాసమనీ కేవలం భ్రమయనీ — అసలైన గీతాచార్యుని తత్వం తెలిశాకగానీ — నిశ్చల భక్తితో ఆతన్ని ఆశ్రయించాకగానీ — ఈ మాయా మోహాలు విడిపోవనీ జన్మంటులేని పరమ పదలో రాధాకృష్ణులకు నిలయమైన గోలోకంలో సుస్థిరం స్థానం లభించదనీ — ఎలుగెత్తి ఘోషించేది మన సంస్కృతి కాదా? ఇంతకు



ఇటీవల విశాఖపట్నంలో శ్రీ కె.వి.ఎస్. వర్మ రాసిన 'యుద్ధం' కథల సంపుటిని ప్రముఖ కథా రచయిత శ్రీ కాళీపట్నం రామారావు ఆవిష్కరిస్తున్న దృశ్యం. సభకి అధ్యక్షత వహించిన ప్రఖ్యాత రచయిత శ్రీ రా.వి. శాస్త్రి, చలసాని ప్రసాద్, శ్రీ చందు సుబ్బారావుగార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

మించి ఎవరుమటుకు కోరదగ్గది మరేముంటుంది ?

"గోషు భక్తిర్భ వేద్యస్యన వై హిందురితి స్మృతః" అంటూ, నిజమైన హిందూధర్మం— గోపూజతో పునీత మౌతుందనీ – గోమాత స్మరణే శిరోధార్యమన్న ఆర్యోక్తిని ఏ సంస్కృతి ఉద్బోధిస్తోంది ?

మన భారతమాత వడిలో స్త్రీలకు రక్షణ లేదనే అపోహ ఎక్కడనుంచి వచ్చింది ? ఎందుకు రావల్సివచ్చింది ? స్త్రీలు గౌరవింపబడి – స్త్రీలు పూజింపబడిన ప్రతిచోటా సకల దేవతలూ – ప్రసన్నులై సకల సుఖాలనూ అందిస్తారనే నిజం భారతీయ సంస్కృతినుంచి కాదా పుట్టింది ?

సకల శాస్త్రాలకూ – సర్వ కళలకూ,

# కర్మయోగి

అపూర్వ సాహిత్య సంపదకూ, పరమ పూజ్యులైన జ్ఞానయోగాలకూ, భక్తి తత్పరులకూ, యోగి పుంగవులకూ, సాహిత్య నిధులకూ, సంగీత కోవిదులకూ, మహామేధావులకూ, పండితోత్తములకూ – కవివర్యులకూ – త్యాగమూర్తులకూ, యోధానుయోధులకూ, పతివ్రతా శిరోమణులకూ, దైవాంశ సంభూతులకూ, మన భారతమాత కాదా తల్లి ? తన పవిత్ర సంస్కృతితో కాదా, ఇందరు మహనీయుల్ని పెంచి పెద్దచేసి, శిరోధార్యుల్ని చేసింది ?

'జనని జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' మాతృభూమి విలువ తెలియనివాడూ, మాతృభూమిని చిన్నబుచ్చేవాడూ, మాతృభూమికి కళంకాన్ని ఆపాదించేవాడూ, అజ్ఞానంతో తూలనాడేవాడూ ఎంతదురదృష్టవంతుడు? మాతృభూమికీ కన్నతల్లికీ, భేదమేలేదని తెలియనివాడు ఎంత అమాయకుడు ! శ్రీకృష్ణ – దీనబంధూ – మాతృద్రోహాలని శిక్ష వెయ్యకు... అమాయకులని ఆరడి చెయ్యకు...చెయ్యద్దు ప్రభూ...!!"

ఆవేశాన్నీ, ఉద్వేగాన్నీ, బాధనీ, ఆవేదననూ అణుచుకోలేని కృష్ణారావు కళ్ళు మూతలు పడుతున్నాయి.

శరీరం కంపిస్తూ – తూలి ముందుకు పడబోతోంది.

తన హృదిలో – ఆ పవిత్ర పీఠంలో – చిద్విలాసంగా నవ్వుతున్న జగన్నాటక సూత్రధారికి చేతులు జోడిస్తూ ముందుకు వొరిగిన కృష్ణారావుని – ఆప్యాయంగా పొదివి పట్టుకున్నారు వేదికమీది పెద్దలు.

వారికి కృష్ణారావు, కృష్ణారావులా లేడు.

ఆ మూర్తిలో మరో మూర్తి—ఆ మూర్తి గీతాచార్యునిదా ?... సందేహంలేదు.

'మయ్యావేశ్య మనోయేమాం
నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాః తేమే
యుక్తతమామతాః'

కంటిముందు లీలామానుష వేషధారి, శిఖిపింఛమౌళి అఖిలాండకోటి బ్రహ్మాండం నాయకుడు, లోక నియంత శ్రీకృష్ణ రూపంలో చిరునవ్వులు చిందిస్తున్నాడు. తనువినాలోకం లేదని ఉద్బోధిస్తున్నాడు.

"కృష్ణ ధన్యోస్మి, ధన్యోస్మి కృష్ణ—"
సభలోంచి విపరీత కలకలం రేగింది.

ఆ రోజు సభ అంతటితో ముగిసిపోయింది.

[ఇంకా వుంది]





# The stove that not only glows but glitters



STAINLESS STEEL

# chetak
## Gas Stove

IS : 4246




**Highlights :**

- Perfectly Engineered.
- Swiss Technology Control Valve for Prevention of Gas leakage.
- Plated Burner Tops · Rust free.
- Better fuel efficiency
- Economically Priced.

**DISTRIBUTORS FOR ANDHRA PRADESH**
MADICON INDO-INTERNATIONAL
1-10-197/4, First Floor, Ashok Nagar X Roads,
Hyderabad - 500 020. A.P INDIA
Phone: 61286, 64757 Grams MADICON

**PRODUCT OF**
**JAINCO INDUSTRY**
NEW DELHI

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్థాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం
మరియు ఇండియన్ గ్యాస్ డీలర్లవద్ద కూడ లభించును.

# హైదరాబాదు నోట్‌బుక్

## తులసీ రామాయణం తెలుగు గద్యానువాదం

ఏప్రిల్ 17 సాయంకాలం నారాయణగూడ వై. ఎం. సి. ఎ. హాలు కవి పండిత సహృదయులతో క్రిక్కిరిసిపోయింది. కారణం, సాహిత్యరత్న శ్రీమతి ఉన్నవ కమలకుమారి రచించిన తులసీదాసు రామచరితమానస్ తెలుగు గద్యానువాదం ఆవిష్కరణోత్సవం గనుక. ఆవిష్కరణోత్సవాన్ని నవ్యసాహితీ సమితి నిర్వహించింది. అధ్యక్షత వహించిన శ్రీ వేమరాజు నరసింహారావు, ఆవిష్కర్త శ్రీ వణుకూరు నారాయణరావు [ఐ.ఎ.ఎస్.], డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ దాశరథి, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ సి. ఎస్. రావు మున్నగువారు రామాయణ వైభావాన్ని, రామచరితమానస్ ప్రాశస్త్యాన్ని, భక్తియోగాన్ని గురించి విశేషంగా చెప్పారు. రచయిత్రిని ప్రశంసించారు. రచయిత్రి శ్రీమతి కమలకుమారి సమాధానం చెబుతూ తనది యధా మూలానువాదమని, అనువాదానికి తన తల్లిగారు ప్రేరకురాలని చెప్పారు. ఈ విధంగా తాను ఋణవిముక్తురాలనయ్యానని అన్నారు. నవ్యసాహితీసమితి మధుర శీతలపానీయంతో శ్రోతలను సత్కరించింది.

## శ్రీ మాచిరాజు సీతాపతిరావు 81వ జన్మదినోత్సవం :

శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయంలో ఏప్రిల్ 15న సాహిత్య, సమాజసేవతో సహస్ర చంద్ర దర్శనం చేసుకొన్న ఒక గొప్ప వ్యక్తిని సహృదయులు గౌరవించడం సంభావించదగింది. ఆయన శ్రీ మాచిరాజు సీతాపతిరావు. ఆయన పెద్దాపురం తాలూకా, రామవరంలో 1904 న జన్మించారు. పిఠాపురం, విజయనగరాలలో చదువుకొన్నారు. వేమవరపు రామదాసుపంతులు, ప్రకాశం, పట్టాభి, రాధాకృష్ణన్‌లతో సన్నిహితంగా పని చేశారు. ఢిల్లీ చేరి ఐ. ఏ. ఎస్. శిక్షణ సంస్థలో చాలా ఏళ్ళు తెలుగు ఆచార్యులుగా వున్నారు. ఢిల్లీలో వున్నప్పుడు ఆంధ్ర విద్యా సమితి కార్యకలాపాలలో శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌తో కలిసి పని చేశారు; తెలుగువారికి గొప్ప అండగా వుండేవారు. ఆయన 81వ జన్మదినోత్సవ సందర్భంగా ఆయన మిత్రులు, శిష్యులు, అభిమానులు ఏర్పాటు చేసిన ఈ అభినందన సభకు అధ్యక్షత వహించిన మాజీ పోలీసు డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు, ముఖ్యఅతిధిగా వచ్చిన రెవెన్యూ శాఖ కార్యదర్శి శ్రీ జయసింహ, స్వాతంత్ర్య



యోధుడు డాక్టర్ పి. తిరుమలరావు, రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ రామకృష్ణ, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, శ్రీమతి చాగంటి సీతాలక్ష్మి, శ్రీ సీతాపతిరావు బోధన చాతుర్యాన్ని, సౌజన్యాన్ని, సాహిత్య కృషిని, నిరాడంబరం, ఔదార్యం మున్నగు గుణగణాలను ప్రశంసించారు. శ్రీ జయసింహ శ్రీ సీతాపతిరావును శాలువతో సత్కరించారు. శ్రీ అక్కిరాజు సుందరరామకృష్ణ పద్యాలు సమర్పించారు. భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు ప్రారంభంలో స్వాగతం పలికి చివరన వందన సమర్పణ చేశారు.

**ఉపశ్రుతి :**

ఏదైనా జోక్ చెప్పండి. వాడుకుంటాను— అన్నాను మిత్రులు శ్రీ అంజన్‌బాబుతో. ఈ ప్రపంచమే ఒక జోక్, మన బతుకు మరొక జోక్— అన్నారాయన.

— తిరుమల రామచంద్ర ★

## న్యూఢిల్లీ లేఖ

[6వ పేజీ తరువాయి]

అతను మాత్రం మామూలువాడా! నన్ను బార్ దగ్గిరికి తీసుకుపోయాడు. నేను చెక్కు చెదరకుండా అతనికి కధ అంతా చెప్పాను. యధార్థగాథ చెప్పాను అని తర్వాత తెలుసుకున్నాను. చెప్పిన తర్వాత ఏమనుకుంటే ఏమి లాభం ?

ఆదిక్ నన్ను పంపించేసే ముందు సలహా ఇచ్చాడు : "భా. జ. పా. వాళ్లని నమ్మకు వాళ్ల దగ్గిర రహస్యం దాగదు. పత్రికలలోనే ఎక్కిచ్చేస్తారు. ప్రెస్ కౌన్సిల్‌కి దీని సంగతి చెప్పాలి !" ★

*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna.*

# "నేనచ్చం మునుపటి శ్రీదేవినే!"

"ఊహుఁ, ఒక్క అలవాటూ మారలేదు.
ఇప్పటికీ నేను ఇంట్లో ఉన్నప్పుడల్లా ఝుమ్మని
విడియో మీద విదేశీ చిత్రాలు చూస్తూనే ఉన్నా.
ఇప్పటికీ నేను తీరిక చిక్కినప్పుడల్లా పెన్సిలు
పుచ్చుకుని బొమ్మలు గీస్తూనే ఉన్నా.

ఇప్పటికీ నా చర్మ సౌందర్యాన్ని నా ప్రియాతి
ప్రియ లక్స్‌తో మెరుగుపెట్టూనే ఉన్నా."

A. Sridevi




## శుద్ధమైన సౌమ్యమైన లక్స్- సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు

HLL-9718

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.



ఉషాకిరణ్ మూవీస్





# సుందరి సుబ్బారావు




నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
నరసింహారావు రేలంగి

Bhaskar

నిర్వహణ: మిక్కిలినేని జగదీష్‌బాబు